శ్రీరస్తు

# ఆంధ్రసారస్వతవ్యాసావళి





'ఆంధ్రభూమి' సంపాదకుఁడు

ఆంద్ర శేషగిరిరావు, బి.ఏ.

వ్రాసినది.

మొదటి కూర్పు:
సెప్టెంబరు : 1952

శ్రీ ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.
రచియించిన గ్రంథములు

| | | రు. అ. పై. |
|---|---|---|
| 1. | ఆంధ్రరమణీమణులు 1-వ భాగము | 0-12-0 |
| 2. | ఆంధ్రరమణీమణులు 2-వ భాగము | 0-12-0 |
| 3. | కేయూరబాహు చరిత్ర ... | 0-12-0 |
| 4. | ఆంధ్రరాజభక్తులు ... ... | 0-12-0 |
| 5. | ఆకుకూరలు ... ... | 1- 0-0 |
| 6. | కాయకూరలు ... ... | 1- 0-0 |
| 7. | దుంపకూరలు ... ... | 1- 0-0 |
| 8. | వాణిజ్యపూజ్యులు 1-వ భాగము | 1- 0-0 |
| 9. | ఆంధ్రవిదుషీమణులు 1-వ భాగము | 1- 8-0 |
| 10. | ఫలజాతులు (మొదటిభాగము)... | 2- 0-0 |
| 11. | ఫలజాతులు (రెండవ భాగము)... | 2- 8-0 |
| 12. | ఆంధ్రసారస్వతవ్యాసావళి ... | 2- 0-0 |

విక్రయము :
ఆంధ్రభూమి బుక్కుడిపో
మదరాసు: 7.

# మహావాక్యము

జనసుతులౌ కవీశ్వరుల సత్కృతిసారసుధారసంపు వ
ర్ణన కౌని నద్దమెట్టుల గ్రంథచమత్కృతి చెప్పవెల్ల చ
క్కని పదియాఱువన్నెకనకంబున వాసన - కమ్మకస్తురి
న్గనదురు కాంతియున్ - జెఱకునన్ ఫల మబ్బెడు భాగ్యమౌ కదా!

—చాటుధార

# విషయసూచిక





౧

# ప్రాచీనాంధ్ర వాఙ్మయావలోకనము

'మ. మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు త
న్మహనీయస్థితి మూలమై నిలుప శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటించు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్.'

—రామరాజభూషణకవి

'దేశభాషలందుఁ దెలుఁగు లెస్స' యని రాయల వచనము. తీరుతీయములు కలిగి తెనుఁగుబాస వీనులకు విందొనర్చును. దీని మార్దవము నాకళించి, మాధుర్యమును జూచి కొని దీనికి పాశ్చాత్యపండితప్రకాండులు 'తూర్పుఖండపు ఇటాలియన్ భాష' (Italian of the East) అని నామకరణ మొనర్చిరి.

ఆంధ్రభాష యనఁగా నాంధ్రునిచే మాటలాడఁబడు భాషయని కాని, లేక యాంధ్రదేశోద్భవమగు భాష యని కాని చెప్పవచ్చును. త్రిలింగదేశమునఁ బుట్టినదగుట, అచట వ్యవహరింపఁబడున దగుట ఆంధ్రభాష తెలుఁగు, తెనుఁగు అనియు వ్యవహరింపఁబడును.

ఆంధ్రభాషలో నన్నయభట్టారకునకుఁ బూర్వ మనేక గ్రంథము లుండియుండును. మన దురదృష్టమువలన తదుపలబ్ధి లేకపోయినది.

క్రీస్తుశకము పదునొకండవ శతాబ్ది ఆరంభమునుండియు వాఙ్మయ మభివృద్ధినొంది నిలచియున్నది.

ఆంధ్రసారస్వతాభివృద్ధి కాలమును నాలుగు యుగములుగా విభజింపవచ్చును:

1. భాషాంతరీకరణయుగము (11–15 శతాబ్దులు)
2. ప్రబంధయుగము (16, 17 శతాబ్దులు)
3 మధ్యమయుగము (18, 19 శతాబ్దులు)
4. ఆధునికయుగము (20–వ శతాబ్ది)

ఇందు మొదటి మూడుయుగములలోని ఆంధ్రవాఙ్మయాభివృద్ధిక్రమమును ఇచట పరామర్శించుకొందము.

ఆంధ్రసారస్వతయుగములలో తొలుతటిదైన భాషాంతరీకరణయుగమునఁ గావ్యములను కేవల మర్థగౌరవముతో రచించిరి. ప్రబంధయుగములో శబ్దార్థముల రెంటికిని సమానముగ ప్రాముఖ్యము నిచ్చిరి. మధ్యమయుగములో శబ్దగౌరవమునే విశేషముగఁ బాటించిరి. కావున నీకాలమున సారస్వతము క్షీణదశ నందినది.

ఆంధ్రసారస్వతచరిత్రమున ప్రథమయుగమగు భాషాంతరీకరణ యుగపు వాఙ్మయాభివృద్ధిని ప్రత్యేకించి రెండుపాదములుగ విభజించుకొని విమర్శించుకొందము.

# 1

## భాషాంతరీకరణ యుగము

### ౧–వ పాదము
### 11, 12, 13 శతాబ్దులు

#### కవులు

నన్నయభట్టు ప్రథమాంధ్రమహాకవి. రాజరాజనరేంద్రుని ప్రోత్సాహముచే నాతఁడు ఆంధ్రకవితాప్రపంచ

మును సృష్టించినాఁడు. 'భారత వేదవాక్యరసభావము లెఱుంగ లేక నిస్సారమనుస్కులై' 'కాసటబీసలే చదివి గాథలఁ ద్రవ్వు తెనుంగువారి'కినై భారతము పరివర్తింప దొరకొని అరణ్యపర్వము నాలవయాశ్వాసము సగమువఱకు రచించి కీర్తిశేషుఁడయ్యెను. అతని రచన మృదుమధురమై, శబ్దాలంకారశోభితమై, సంస్కృతపదభూయిష్ఠమై యుండును. మధ్యాక్కఱలు మొదలగు పద్యముల రచన నన్నయ ప్రాచీనతను వెల్లడిసేయును. నన్నయ భాషాంతరీకరణము స్వతంత్రబహుళమైనది.

తర్వాత తిక్కన విరాటపర్వము మొదలుకొని భారత భాగమును 'ఆంధ్రావళి మోదముంబొరయ' రచించెను. నుడికారము గల తెలుఁగుఁబలుకుబళ్ళఁ గూర్పుటయం దీతఁ డద్వితీయుఁడు. తిక్కయజ్వ విరాటోద్యోగపర్వములందుఁ జూపిన 'మహత్త్వకవిత్వపటుత్వ' సంపద లసదృశములు.

పదంపడి ఈ యిర్వురకుఁ దుల్యుఁ డగువాడు ఎఱ్ఱాప్రెగ్గడ. అరణ్యపర్వశేషపూరణ మీతని ప్రధానకృతి. షం దీతఁడు నన్నయనే యనుకరించెను. ప్రబంధశైలికి ఇతఁడే మార్గదర్శి. ప్రబంధపరమేశ్వరుఁడని ఇతనికి బిరుదము. ఈతని ప్రబంధశైలి ననుసరించి శ్రీనాథాదులు గ్రంథములను మనోహరముగా వ్రాసిరి.

నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడలను కవిత్రయమందురు. వీ రాంధ్రభాషకుఁ బ్రామాణికకవులు. వీరి కవిత్వము పదాఱువన్నె బంగారమువలె నిర్దుష్టమైనది.

తిక్కన భారతమును ముగింపఁగానే తర్వాతి కథయగు హరివంశమందలి యుత్తరభాగమును 'నవీనకవితాసనాథుఁ

డగు నాచన సోమనాథుఁడు రచించెను. ఈతఁడు కల్పనా కౌశలమున, ప్రతిభావిశేషమున, బుద్ధివైశద్యమున ఆంధ్ర కవులలో నిరుపమానుఁడని కొందఱి మతము.

మారన మార్కండేయ పురాణము, కేతన దశకుమార చరిత్ర ఈ సందర్భమునఁ బేర్కొనఁదగినవి.

ఈ పాదమున రంగనాథ, భాస్కరాదులు రామాయణమును తెనిఁగించిరి.

### కవిత్వలక్షణములు

ఆంధ్రభాష భట్టారకునితో నవతరించి తిక్కన కాలముననే జాతీయత నలవఱచుకొని మహోన్నతదశకు వచ్చినది. భారతకవుల గ్రంథములు భాషాంతరీకరణములయ్యును స్వాతంత్రములుగా నుండును.

ఆకాలమునఁ గవు లాంధ్రపదముల నధికముగా వాడుచు వలయుపట్ల సంస్కృతపదప్రయోగముఁ జేయుచు రసవంతమును, మనోరంజకము నగు కవిత్వము చెప్పిరి.

ఈ పాదమునందలి గ్రంథములన్నియు భాషాంతరీకరణములే కాని స్వకపోలకల్పితములు కావు.

భారతకవు లెవ్వరును కేవల శబ్దాలంకారములను విశేషించి వాడియుండలేదు. నన్నయ కవనమందును, భాస్కర రామాయణ- హరివంశములందును కొలఁదిగా శబ్దాలంకారములు కలవు.

నన్నయ మొదలు సోమనాథునివఱకుఁ గల కాలములో ఆంధ్రభారతి సర్వాంగసౌందర్యసౌకుమార్యసంపాదన మొనర్చుకొన్నది.

ఈ కాలపు కవులు దీర్ఘసమాసములను అతిగా వాడి

యుండ లేదు.

వీరు స్వతంత్రగ్రంథకర్తలు కాకపోయినను శక్తిమంతులు; వాఙ్మయధురంధరులు.

ఈ కాలమందలి కవులు సాధారణముగా బ్రాహ్మణులే. అయినను బద్దెన, నన్నెచోడులవంటి రాజకవులును లేకపోలేదు. తిక్కనకాలమునాటి కవులు మంత్రులుగా—రాజకీయ తంత్రజ్ఞులుగా—యోధులుగా నుండిరి.

ఈ పాదమందలి కావ్యరచన నీతిబోధకును, మతవ్యాప్తికిని తోడ్పడినది.

**మతము**

ఈ కాలమున బ్రాహ్మణమతమే విజృంభించియున్నను జైనగ్రంథములు కొన్ని తలసూపినవి. నిదర్శనము: జినేంద్ర పురాణము, ఆదిత్యపురాణము.

భారత భాగవత, రామాయణాది గ్రంథభాషాంతరీకరణములు బ్రాహ్మణమతవ్యాప్తి నొనర్చి జైనమతమును క్షీణింపజేసినవి. నన్నయాదుల భారత భాగవతాదుల భాషాంతరీకరణములు జైనమతవిజృంభణ మడంచి బ్రాహ్మణమత ప్రచారమునకే తోడ్పడెను కాని వాఙ్మయాభివృద్ధికి గాదని వాఙ్మయచరిత్రకారుని అభిప్రాయము.

వీరశైవమతావలంబకులు 'జాను తెనుంగు'లో గ్రంథములను రచించి మతప్రచారమొనర్చిరి. పాలకురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర, బసవపురాణము లను ద్విపదకావ్యము లిందులకు నిదర్శనములు.

**పోషకులు**

ఆదినుండియు ఆంధ్రకవిత రాజపోషణమున వృద్ధిపొంది

నది. 11,12 శతాబ్దులలో మనవాఙ్మయమును పోషించినవారు చాళుక్యులు. చాళుక్యవంశజులగు సత్యాశ్రయుఁడు, యుద్ధమల్లుఁడు మొదలగువా రాంధ్రసారస్వతమును పోషించిరనుటకు నిదర్శనములు పెక్కులున్నవి.

చాళుక్యుల పిమ్మట చోళులు ఆంధ్రకవిపోషకులుగా నుండిరి. అటుపిమ్మట కాకతీయులును, రెడ్లును ఆంధ్రకవుల నాదరించిరి.

నన్నయ- నారాయణభట్టుల భారతము; మల్లన గణితము; విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణి చాళుక్యుల కాలమునాఁటి సారస్వతము.

తిక్కన రామాయణ, భారతములు; మంచన కేయూరబాహుచరిత్ర చోడులనాఁటి వాఙ్మయము.

భాస్కర- రంగనాథ రామాయణములు కాకతీయుల నాఁటివి,

ఎఱ్ఱాప్రెగ్గడ భారత, రామాయణ, నృసింహ పురాణాదులు రెడ్ల యాదరణమున బయలుదేఱిన సారస్వతము.

వాఙ్మయరంగములు

ఆంధ్రకవితాసతి గోదావరీతీరస్థమగు రాజమహేంద్రవరమున నన్నయచే సృజింపఁబడి, క్రమముగా పినాకినీ నదీప్రాంతముల స్వేచ్ఛావిహారములను సల్పి, అద్దంకి ఓరుగల్లు ప్రాంతముల బాల్యావస్థను గడపినది.

నన్నయకాలమున రాజమహేంద్రవరమును- తిక్కన కాలమున సింహపురియు- ఎఱ్ఱాప్రెగ్గడ కాలమున అద్దంకి ప్రాంతములును- భాస్కరాదుల కాలమున ఓరుగల్లును- నాచన సోమనాథుని కాలమున విద్యానగరమును వాఙ్మయ

కేంద్రస్థానములుగ నుండినవి.

## భాషాంతరీకరణయుగము

**౨-వ పాదము**
**14, 15 శతాబ్దులు**

### కవులు

ఈ కాలమునాఁటి ఆంధ్రవాఙ్మయవిజృంభణమును తిలకించి మనము పట్టువీఁగవలసినదే.

పినవీరభద్రుఁడు, అనంతుఁడు, జక్కన, శ్రీనాథుఁడు, బమ్మెర పోతన ఈ కాలమందలి అనర్ఘులగు కవులు.

పినవీరభద్రకవి భారతకవులతోఁ దుల్యమైనవాఁడు. జైమినిభారతము, శకుంతలాపరిణయము లీతని కృతులు. కాళిదాసు సంస్కృతభాషలో రచియించిన శాకుంతలనాటకమునకు పినవీరభద్రుని శకుంతలాపరిణయము చాలవఱకు అనువాదము. దృశ్యకావ్యమును ప్రబంధముగా భాషాంతరీకరించుట కితఁడే ప్రథముఁడు. ఈ శకుంతలాపరిణయరచనమే ప్రబంధనిర్మాణమునకు దారిచూపెను.

అనంతుని భోజరాజీయము నూతనకథావర్ణనాంశములు కలిగి మృదువై మధురముగ నుండును. స్వతంత్రగ్రంథరచనకు ఆంధ్రసారస్వతమున నితఁడే మార్గదర్శి. తెనుగులో ఉన్న స్వకపోలకల్పిత గ్రంథములలో భోజరాజీయము ఒకవిధముగా మొదటిదనవచ్చును.

జక్కన రచించిన విక్రమార్క చరిత్ర తెనుఁగులోని చమత్కారగ్రంథములలో నొకటి.

శ్రీనాథుఁడు లాక్షణికుఁడైన గొప్పకవి. ఈ కవిసార్వ

భాముఁడు 'చిన్నారి పొన్నారి చిఱుతకూకటినాఁటి' నుండియు భాషాసేవ నొనర్చినవాఁడు. 'కాశీఖండ మయఃపిండం నైషధం విద్వదౌషధమ్' అని కొనియాడఁబడు సంస్కృతగ్రంథముల రెండిటి కీతఁడొనర్చిన యాంధ్రీకరణములే యీతని పాండిత్యగరిమమును వెల్లడించుచున్నవి. ఈతని సీసపద్యములో యాశ్చర్యపు నడకలు కలవు. ప్రబంధపరమేశ్వరునిచే నిర్మింపఁబడిన ప్రబంధశైలిని శ్రీనాథుఁడు సొంపుగా, నింపుగా నభివృద్ధిపఱచెను. తిక్కన సృజియించిన మహనీయస్థితిని శ్రీనాథుఁడు ప్రోచినాఁడు. ఇతని కవితాధార మత్తేభగమనిక కలది. ఇతఁడు దీర్ఘసమాసములను విశేషముగాఁ బ్రయోగించెను.

బమ్మెరపోతన భక్తిరసప్రధానముగా భాగవతముఁ దెనిఁగించిన- ఆత్మగౌరవము కలిగిన కవిసత్తముఁడు. ధనమున కాశించి ఆంధ్రభారతిని కర్ణాటకిరాటకీచకుల కమ్మని మహాత్ముఁడు. లాక్షణికు లీతని గ్రంథమున లక్షణదోషములు కలవందురు. ఇతని కవనమున శబ్దాలంకారములు మెండుకొని యుండును.

కవిత్వలక్షణము

ఈ పాదము ఆంధ్రసారస్వతమున స్వతంత్రగ్రంథములు బయలుదేఱిన కాలము.

భారతమందలి శకుంతలకథ, కాళిదాసుని శకుంతలనాటకము సమ్మేళనమొనర్చి స్వతంత్రముగాఁ బినవీరభద్రుఁడు శకుంతలాపరిణయము రచించెను.

భోజరాజీయము నిర్వివాదముగా స్వతంత్రగ్రంథము.

శ్రీనాథుని హరవిలాసము కొంతవఱకు స్వకపోలకల్పితము.

భాషాంతరీకరణ మన్నమాటయే కాని ఆంధ్రభాగవతము సంస్కృతభాగవతముకంటె పెద్దది.

ఆంధ్రవాఙ్మయనిర్మాతలని, మహాకవులని మనము కీర్తించు శ్రీనాథుడు, పోతన్న భాషావ్యాప్తికి చెఱియొక అర్గళమును దెచ్చిపెట్టిరి. అవి అత్యంతదీర్ఘతమములగు ప్రౌఢసమాసములను వాడుట యొకటియు, శబ్దాలంకారాడంబరము నెలకొల్పుట యొకటియు నని నా భావము.

సంస్కృతాంధ్రభాషాపారంగతుఁడగుట శ్రీనాథునకు ప్రౌఢదీర్ఘసమాసము లుపయోగించుట సులభసాధ్యమైనది. కాని తరువాతి పండితేతరుల కది వేలము వెఱ్ఱి, కొఱుకుపడని కొఱముట్టె యైనది.

పోతన్న శబ్దార్థముల రెంటికి సమానగౌరవ మిచ్చి సామర్థ్యాతిశయముతో శబ్దార్థాలంకారము లుపయోగించెను. తర్వాతికవులు అవిషహ్యమగు వికారముఁ దెచ్చిరి.

### మతములు

భాషాంతరీకరణయుగవు ద్వితీయపాదములో రామానుజ శిష్యులగు వైష్ణవులును, మధ్వాచార్యశిష్యులగు మాధ్వులును కొన్ని తెనుఁగుపుస్తకములు వ్రాసి వారివారి మతసిద్ధాంతప్రచారమును, ఆంధ్రసారస్వతాభివృద్ధిని నొనర్చి కీర్తికాయులైరి. శ్రీనాథుని కాలమునాఁటికి తెలుఁగునాటికి యవనసంపర్కము బాగుగా కలిగినది.

### పోషకులు

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని కాలమున విద్యానగర ప్రభువులును, శ్రీనాథుని కాలములోఁ గొండవీడు రాజు

మహేంద్రవరము రెడ్లును ఆంధ్రసారస్వతమునకు పోషకులుగా నుండిరి.

పోతన లక్ష్మీదేవిని తృణీకరించి సరస్వతిని ఆత్మగౌరవమున నిలిపెను.

### వాఙ్మయరంగస్థలములు

విజయనగరము, రాజమహేంద్రవరము లీకాలమున వాఙ్మయరంగములు. రాజమహేంద్రవరము భాషాంతరీకరణ యుగపు టాద్యంతములందు సారస్వత కేంద్రస్థానముగా నుండుట గమనింపఁదగినది. పుట్టినిల్లువిడిచి దూర మేఁగిన ఆంధ్ర భాషాయోషను తిరిగి జన్మస్థానమునకుఁ దెచ్చినవాఁడు శ్రీనాథుఁడు. ఆంధ్రభారతిని శ్రీనాథుఁ డాంధ్ర దేశమంతయుఁ ద్రిప్పినాఁడు.

## 2

## ప్రబంధయుగము

16, 17 శతాబ్దులు

### కవులు

ప్రబంధపరమేశ్వరుని ప్రబంధశైలిని- శ్రీనాథుని దీర్ఘ సమాసములను, సీసపద్యములను- పోతరాజు శబ్దాలంకారములను- భోజరాజీయ శకుంతలాపరిణయములను ఆదర్శముగాఁ గొని ఈ యుగమునఁ గవులు స్వతంత్రగ్రంథములను వ్రాయ మొదలిడిరి.

పెద్దన, తిమ్మన, కృష్ణదేవరాయలు, రామరాజ భూషణుఁడు, సూరన, రామకృష్ణుఁడు వీరలు ప్రబంధకవితా తారాపథమున దివ్యజ్యోతులు.

మనుచరిత్ర రచించి ప్రబంధరచనకుఁ బెద్దన్న మార్గదర్శి యయ్యెను. మారన మార్కండేయపురాణమునుండి కథావస్తువును గ్రహించి- విస్తరించి- మెఱుంగువెట్టి మనుచరిత్ర వెల్వరించెను. ఇందలి అల్లిక, జిగిబిగి నిరుపమానము. ప్రకృతివర్ణనలు మనోహరములు.

తిమ్మన పారిజాతాపహరణము ముద్దులు మూటగట్టుచుండును. 'ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు' అనుమాట అక్షరాస్యులైన ఆంధ్రులలో నెఱుంగనివా రరుదు.

కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదను రచించి తన ఆంధ్రపారస్వతాభిమానమును వ్యక్తీకరించినాఁడు. ఇతఁడు మానవజీవితపరిశీలనమునం దసదృశుఁడు. ఆముక్తమాల్యద నారికేళపాకమునఁ బడినది. అయినను అద్భుతజనకములైన ఇందలి వర్ణనలు హృదయరంజకములు.

మాంధాతృచరిత్ర, కాళహస్తీశ్వరమాహాత్మ్యము మొదలగు మధ్యరకపు గ్రంథము లిప్పటికే. ధూర్జటికవి కాళహస్తీశ్వరశతకము గంగాప్రవాహప్రతీకాశమగు ధారావేగము కలది. ఈ కవి మత్తేభశార్దూలవృత్తములను పొంకముగా నడిపియున్నాఁడు.

రామరాజభూషణుని వసుచరిత్ర శబ్దాలంకారములందు భాగవతమును మించెను. భాషావిషయములో నేగ్రంథమును వసుచరిత్ర కీడురాకపోయినను కథాసంవిధానమందు- సంభాషణసమీచీనతయందు- వర్ణనసందర్భమందు వసుచరిత్ర ఉత్తమశ్రేణికిఁ జెందలేకపోయినది. కాని ఇందలి పద్యములు శ్రవణసుభగములైనవి.

పింగళి సూరన ప్రబంధయుగమునఁ జక్రవర్తి. ఈతని

గ్రంథములు అన్నియును రత్నములు. ఆంధ్రసారస్వతమున కీతఁడొనర్చినసేవ వర్ణనాతీతము. రాఘవపాండవీయము ద్వ్యర్థికావ్యము. ప్రభావతీప్రద్యుమ్నము జాతీయములకు నిలయమై- మనోహరమై- నాటకసాంప్రదాయములుకల ప్రబంధము. కళాపూర్ణోదయము కథాసంవిధానమున మిన్న. ఆంధ్రసారస్వతమున నిదియొక అపూర్వగ్రంథము.

వ్యర్థపదములు మందునకైన లేకుండ తెనాలి రామకృష్ణుఁడు పాండురంగమాహాత్మ్యమును రచియించెను. పాండురంగమాహాత్మ్యములోని కథలు నీతిబోధకములు. ఇందలి నిగమశర్మకథ ననుసరించి కందుకూరు రుద్రకవి నిరంకుశోపాఖ్యానమును ప్రబంధము రచించెను. పాండురంగమాహాత్మ్యము శైలి సర్దుష్టమైనది; అనుకరణీయమైనది.

కవిత్వ సామాన్యలక్షణములు

మనుచరిత్రరచన దుర్నీతిబోధకమాయెను. ఇందలి రతివర్ణనలు దూష్యములు. వసుచరిత్రరచనకుఁ బూర్వపు కవులు మనుచరిత్రనే యనుసరించిరి. ఇది మొదలుకొని యనుకరణమే కవిత్వమైనది. ప్రబంధకవులు విశేషసమ్మానములు బడయుటచేఁ గవులు ప్రబంధములు కుప్పతెప్పలుగా రచించిరి.

మనుచరిత్రరచనానంతరము సారస్వతమునకు మూఁడు న్యూనతలు సంభవిల్లినవి.

అవి—

కవు లౌచిత్యమును గమనింపక కేవలము అనుకరణముపై నాధారపడుట :

శ్రీనాథ పోతనల దీర్ఘసమాస, శబ్దాలంకారముల యాదర్శము విస్తరించుట :

భాష కవులకధీనమై యుండుటకు మాఱు కవులే భాష కధీనులై నిఘంటువులపై నాధారపడుట :

ఇంకను రామరాజభూషణుని వసుచరిత్రతో మన భాషకు నాల్గవ న్యూనత సంభవించెను. వసుచరిత్ర తరువాతి ప్రబంధములన్నియు దానికి ప్రతిబింబములే.

ఈ కాలములోనివాఁడైనను జేమకూర వేంకటకవి 'పూమొగ్గలవలె తమకుఁదామే విచ్చు శ్లేషలతో, చవులూరు రచనలతో, అనుద్వేగకరములగు వర్ణనలతో' సారంగధర చరిత్ర, విజయవిలాసములను విరచించి ధన్యుఁడాయెను.

పింగళి సూరన్న ద్వ్యర్థి కావ్యరచనతో నాంధ్రసారస్వతమున కైదవన్యూనత కలిగెను. రసవిజృంభణము- శబ్దలాలిత్యము- కథాచమత్కారము శ్లేషకావ్యము లందుఁ బూజ్యములు. అనఁగా నభావములనుట.

కావున నిది మొదలుకొని ఈ ఐదు న్యూనతలతో సారస్వతము క్షీణదశనొందినది.

ఇట్టి న్యూనతల పొంతపోక వేఱుగా నిలచిన ఈయుగపు వాఁడు వేమనకవి.

పోషకులు

ఆంధ్రభారతిని జయంత్యుత్సవములతో పల్లకులపై నూరేగించినది యీ యుగమందే. కృష్ణదేవరాయల 'భువన విజయమున' వెల్వడిన గ్రంథములన్నియు నాంధ్రకవితాసతి కలంకారములు. మన సారస్వతాభివృద్ధికాలములో దీనిని 'అగస్టన్ ఏజ్' అనవచ్చును. తంజావూరు రాజులు, మధుర నాయకులు ఈ యుగమున శక్తికొలఁది సారస్వతమును బోషించిరి.

### వాఙ్మయరంగములు

విద్యానగరమే ఈ యుగమందలి ప్రధానసరస్వతీనిలయము. తమిళదేశమధ్యస్థములైన తంజావూరు, మధుర నగరములు ఈ యుగములోని ఉత్తరపాదమున వాఙ్మయరంగములగుట గమనార్హవిషయము. తంజనగరమున యక్షగానములు, మధురపట్టణమున వచనకావ్యములు విస్తరిల్లినవి.

## 3

## మధ్యమయుగము

18, 19 శతాబ్దులు

### కవులు

కీర్తనలు వ్రాసిన త్యాగరాజు, ఉత్తరరామాయణము రచించిన పాపరాజు మున్నగువారు తప్ప ఈ యుగమున పేర్కొనఁదగిన పెద్దకవు లెవ్వరును లేరు.

### కవిత్వసామాన్యలక్షణములు

మధ్యమయుగమున భాషాదోషము కురూపమై కుంటనారంభించినది. ఇదివఱకే వ్యాపించియున్న న్యూనతలుగాక మఱిరెండు న్యూనతలు వచ్చినవి.

మొదటిది:

అచ్చతెనుఁగులో గ్రంథరచన—

పొన్నగంటి తెలగనార్యుఁడు యయాతిచరిత్ర నచ్చతెనుఁగులో రచించి భాషకు శ్రోత్రకట్టిప్పు తెచ్చినాఁడు. మహాకవు లనిపించుకొనుటకై కూచిమంచి తిమ్మనాదు లచ్చతెనుఁగులో గ్రంథములు కురియించిరి. వీరి గ్రంథములు సరససాహిత్యవినాశనమునకుఁ దోడ్పడినవనక తప్పదు.

రెండవది :

నిరోష్ఠ్యాదినియమములతో గ్రంథరచన—

ఆధునికులగు వీరేశలింగముపంతులుగారుకూడ నిరోష్ఠ్యాది నియమములతో గ్రంథములు వ్రాసి భాషాదేవిని బంధించుటలో పాల్గొనఁ గల్గిరి.

ఉత్తమకావ్య మనఁదగినది యొక్కటియు నీమధ్యమ యుగమున వెడలలేదనవచ్చును.

అష్టాదశ వర్ణనలు: శృంగారరసము

ఈ యుగపువారు ప్రాచీనుల పద్యములనే మార్చి-మార్చి వ్రాసి వెలార్చిరి లక్ష్మణకవి, తిమ్మకవి మొదలగు వారు ఇందులకు దక్షులు. వీరితోఁ బ్రబంధయుగమున కవసానదశ సిద్ధించి- స్త్రీవర్ణనములు మితిమీఱి- అష్టాదశ వర్ణనలే ప్రబంధమునకు ముఖ్యవిషయములుగ నైనవి.

భోగపరాయణులైన ధనవంతులు పోషకులుగా నుండుటచే అసభ్యశృంగారము ప్రధానమైనది. కనుకనే ఈకాలమున ప్రభవించిన ప్రబంధములు ఇప్పటి నాగరకుల కనిష్టజనకములై యున్నవి. శేషము వేంకటపతి శశాంకవిజయము, ముద్దుపళని రాధికాసాంత్వనము మున్నగునవి ఇందులకు నిదర్శనములుగాఁ జెప్పవచ్చును.

మతములు

మహమ్మదీయసంపర్కము గల ప్రబంధయుగములో మహమ్మదీయగ్రంథము లేవియు వెల్వడకున్నను ఇప్పటి క్రైస్తవమత సంపర్కములో మాత్రము మతప్రధానములగు గ్రంథములు పొడసూపినవి. ఈ యుగాంతమున బైబిలు వచన

రూపమున వ్రాయఁబడినది. ఆంగ్లభాషలో బైబిలుశైలి నిర్దుష్టమైనది. ఇఁక నాంధ్రమునందన్ననో బైబిలుశైలి విపరీతమై యవిషహ్యముగ నున్నది.

క్రైస్తవులు విపరీతమగు వచనశైలిని కొనివచ్చినవారయ్యు ఆంధ్రసారస్వతమునకు మహోపకార మొకటి చేసిరి. తెనుఁగున ముద్రాలయస్థాపనమే ఆ మహోపకారము. ఈ సందర్భమున బ్రౌనుదొర తప్పక స్మరింపఁదగినవాఁడు.

ముద్రాలయస్థాపనతో ఆంధ్రసారస్వతచరిత్రమున ఆధునికయుగము ప్రారంభమైనదని చెప్పవచ్చును.

౨

# తెనుఁగుకైతల క్రొత్తతెన్నులు

నవరసమ్ములు నాట్య మాడఁగ
చివురు పలుకుల జెవులు విందుగ
కవితలల్లే క్లాంతహృదయుల
గారవింపవె తుమ్మెదా !

—రాయప్రోలు సుబ్బారావు

## 1

## అభినవాంధ్ర కవిత్వావతరణము

ఇపుడు మనము తిలకింపఁబోవునది ఆంధ్రకవితాసారస్వత చరిత్రమందలి యొక రసవదధ్యాయము.

పింగళి సూరనకుఁ బిమ్మట ఆంధ్రసరస్వతి 'అరుణిమ దూలిన యధరము'వలె నసిచెడి శోభాదరిద్రాణమై దీర్ఘమైన నిద్రావస్థఁ బొందినది.

పందొమ్మిదవ శతాబ్ది మధ్యభాగమున బ్రౌనుదొర నిఘంటువు ప్రచురించుటతో ఆంధ్రభాషాప్రపంచమున నొక సంచలన ముదయించినది. చిన్నయసూరి, వీరేశలింగము పంతులు మొదలగు పండితప్రకాండు లీసంచలన మందికొని తీఁగ సాగింపఁజొచ్చిరి. వచనరచనయందుఁ గ్రొత్తఫణుతు లన్వేషించి, అవలంబించి నూతనయుగప్రవర్తకుఁడైన వీరేశ లింగముపంతులు తెనుఁగుకైతను ప్రాచీనులవలెనే ప్రబంధ

వీథుల బందీకృతిఁ గావించెనే కాని క్రొత్తతెన్నుల నడిపింపలేదు.

తిరుపతి వేంకటకవులు కవితాసతికి శాకటప్రచార మిచ్చి ఆంధ్రప్రజలదృష్టి కవిత్వమువైపు మరలించిరి. కాని వారు సరస్వతిని త్రిప్పరానిచోట్లఁ ద్రిప్పినారు. వారి బుద్ధచరిత్రలోనిది నిజమైన కవిత్వము. కవితాప్రపంచమునఁ గ్రొత్తతెన్నులు గానరాలేకపోయినను వారు మనకు వేఱొక మహోపకారము గావించిరి. వారాంధ్రయువకుల హృదయక్షేత్రములందుఁ గవితాంకురములు విత్తి కవితాసరస్వతీభావ్యాభ్యుదయస్థితికిఁ బునాదులు వైచి కవితోత్సాహకులఁ గొందఱ నెడలఁదీసిరి ఇందుల కాంధ్రులు వారిని చిరకాలమువఱకు మఱవనేరరు.

ఆంధ్రకవితాప్రపంచమున నవవసంతోదయమై నూతనవికాసము, నూతనచైతన్యము, నూతనవిలాసము, నూతనప్రబోధమును ఇరువదియవశతాబ్దాదిని జరిగినది. అప్పుడు సముద్రతరంగమువలె నున్నోత్తుంగ మూలమూలల వ్యాపించిన వందేమాతరోద్యమము స్వదేశాభిమానమును తీవరించి, స్వభాషాభిమానము నుద్రేకింపఁజేసినది.

అందుచే భాషోద్ధరణోద్యమము వెల్లివిరిసినది. ఆంధ్రకవితాసతి నాఁటి ఆవేశతరంగిణియొక్క ఉత్తుంగతరంగడోలికలలో రాయంచవలె నుయ్యాలలూఁగి, దిక్కుటారములందు ఎలుఁగెత్తి చాటుచున్న సమయశంఖముని విశ్రుతనాద మాలించి వికాసపుంజముల లోఁగొనినది. అంతతో నవ్యాంధ్రకవితాప్రపంచమునందొక మహావిప్లవము ప్రారంభమైనది.

నవ్యాంధ్రకవిత్వశుభోదయమునకు శ్రీగురుజాడ అప్పారావు వేఁగుజుక్క. ప్రబంధవీథుల బందీకృతయైన కవితాసతిని

క్రొత్త తెన్నులకుఁ గొనితెచ్చి ఆమెకు స్వేచ్ఛానిశ్వాసము కల్గించిన ప్రజ్ఞానిధి అతఁడు. అతఁడు 'క్రొమ్మెఱుంగులుచిమ్మ' గాఁ కవితాగానముచేసి అనూనశోభ ఘటించి నూతనయుగా రంభప్రకోష కాంతు లెల్లెడలఁ బఱపిన సిద్ధహస్తుఁడు; తన కవితాహస్తమునుండి ముత్యాలసరులకు రూపసిద్ధి నొసఁగిన లక్షణవేత్త.

ప్రబంధవాసన లెడలించి, 'నూతనయుగోదయరాగము' లాలపించి ఆంధ్రకవిత్వమునకు నవ్యత కొనితెచ్చినవాఁడు శ్రీ రాయప్రోలు సుబ్బారావు. భావరసభరితములు, నవోద్యమ దీపితములునగు 'తృణకంకణము, కష్టకమల' ఇత్యాది మనో హరకావ్యముల రచించిన సాహిత్యవర్ధనుఁ డాతఁడు. అతఁ డాంధ్రకీర్తిని సంకీర్తనము చేసినవారిలో ప్రథమాంధ్రమహా కవి. కుశేశయకుట్మలములవలెఁ గోమలములును, చిగురుటా కులవలె నూతనవికాసభాసురములును నగు నున్నఁదియ్యని పద ములతోఁ గావ్యములను జిత్రించు పదశిల్పి అతఁడు.

క్రొత్తపోకడ లలవఱుచుకొని, పదశిల్పము నేర్చికొనిన నవీనాంధ్రకవితాసతికి నూతనవాతావరణములో సరిపోవు ఛందోవిన్యాస మర్పించిన రచనాభిజ్ఞులు వేంకటపార్వతీశ్వ రులు. ఖండకావ్యములు, భావగీతములు రచించుటకు అన్ని విధముల అనువైనది తేటగీతియని నవీనాంధ్రకవికోటికి నివేదిం చిన కవితారసికులు వీరే. వీరి తేటగీతములు పదాంతము లందు విరుపులతోఁ జెన్నొందు లాలిత్యలావణ్యములు కలిగి యుండు పూలరేకులు.

నవ్యాంధ్రకవితాసతికి గురుజాడ అప్పారావు క్రొత్త తెన్నులు రుచిచూపెను; రాయప్రోలు సుబ్బారావు పదశిల్పము

నివేదించెను; వేంకటపార్వతీశ్వరులు తేటగీతముల, మంజుల కాన్కనిచ్చిరి. ఈ కవులు కావ్యేందిరరూపు రేఖలకు మార్పులు దొడిగిరి; కవితారథమును నూతనపథములఁ బట్టించిరి. వీరలు నవీనాంధ్రకవిత్వమునకు సూత్రధారులు.

ఇట్టి కవిపుంగవులు భాషాయోషకుఁ బూజాపుష్పము లర్పించుచుండ నాంధ్రోద్యమ మారంభమై దేశము నుత్సాహ తరంగితము గావించెను.

1906–1908 ప్రాంతమున సముద్రతరంగమువలె దేశము నలుమొగముల వ్యాపించిన స్వదేశీయోద్యమము కవిత్వావేశమునకుఁ, గావ్యసామగ్రికి నంతులేని ఆవేదన పడుచున్న నాఁటి తెనుఁగుకైతగాండ్ర కావేశము కల్గించి కావ్యసామగ్రిని గల్పించినది.

ఆంగ్లవిద్యావంతులైన ఆంధ్రులు పెక్కురు అంతదనుక డిగ్రీలు పొందినవెంటనే ఉద్యోగధర్మ మవలంబించుచు వచ్చిరి. కావున అట్టివారు సారస్వతజీవనులు కాలేకపోయిరి. స్వదేశోద్యమానంతరము సేవకావృత్తిపై విద్యావంతులకు ఏవ పుట్టుటయే కాక ఉద్యోగపదవులుకూడఁ దక్కువకాఁజొచ్చెను. అట్లగుట కొందఱు విద్యాధికులకు సారస్వతముపై దృష్టిపోవుటకుఁ దగిన యవకాశము సమకూడెను.

ఇట్లు వందేమాతరోద్యమము మనకవులకుఁ గవిత్వరచనకు వలయు అవకాశమును, ఆవేశమును, సామగ్రిని కల్గించినది.

ఆ తరుణమున గురుజాడ అప్పారాయని నూత్నభావవీచికలును, రాయప్రోలు సుబ్బారాయని ప్రౌఢపదవిన్యాసము

లును, వేంకటపార్వతీశ్వరుల తేటగీతముల క్రొత్తందనములును, మెత్తందనములును ప్రజాహృదయవీథి నడతెంచి, వారి మనముల నాటుకొనుచుండెను.

ఆ సమయమున ఆంధ్రపత్రిక, ఉగాదిసంచికలు, ఆంధ్రభారతి మొదలగు పత్రికలు బయలుదేఱి యువకవుల ఖండకావ్యములకు, భావగీతములకు సుస్వాగతము చేయుచు వానిని తలఁదాల్చుచుండెడివి.

ఆ సమయముననే ఆంధ్రోద్యమ మారంభమై ఆంధ్రులకు శుభోదయమును గొని తెచ్చెను. ఆంధ్రమహాప్రజల హృదయక్షేత్రములం దవబోధ మంకురించినది. దేశోద్ధరణమునకు దేశభాషాభివృద్ధి సహజసాధనమను సిద్ధాంత మంగీకృతమై తెలుఁగునాట దృఢతరమైన ఆంధ్రభాషాభిమానమును కల్గించినది.

అందుతోఁ గావ్యరచనాపరులగు ఆంధ్రకవుల కాంధ్రప్రజల పోషణప్రోత్సాహములును, అభిమానాదరణములును లభించి వారిని ఉత్సాహవంతులనుగా నొనర్చెను. ప్రపంచమునంతను కలగుండు వెట్టిన ఐరోపామహాసంగ్రామముకూడ ఆంధ్రలోకవ్యాప్తమైన ఈనూతనోత్సాహమును, కవితావేశమును చప్పఁబఱుపఁజాలకపోయెను.

ఆంధ్రోద్యమ మారంభించిన నాఁటినుండియు తెనుఁగుకైత పాలసముద్రమువలె నపారముగఁ బెరుఁగుచు మున్నెన్నఁడుఁ ద్రొక్కి చూడని పెక్కు నూతనమార్గములఁ బరువెత్తుచున్నది.

ఆ నూతనమార్గములఁ బరామర్శింతము.

# 2

## ప్రాచీనాధునాతన కవితావిభేదములు

ఆంధ్రకవితాసారస్వతమును విమర్శకదృష్టితోఁ బాఱఁ జూచితిమేని ప్రాచీన నవీన కవిత్వములందుఁ గల విభేదములు కొన్ని విస్పష్టముగఁ గానవగును.

### కావ్య పరిమాణము

మొదటిది కావ్యపరిమాణము. పూర్వకవులు సాధారణముగ మహాకావ్యములను రచించిరి. నేటివారన్నో అలఁతి యలఁతి విషయముల నితివృత్తములుగా నెన్ని, ఖండకావ్యములు రచించుచున్నారు.

ఇక్కాలమున ఖండకావ్యరచనకు విశేషప్రోద్బలము గలదు.

ఏతత్కారణము లారయనగును.

'కావ్యగీతిప్రియు'లగు రాజరాజనరేంద్రులను గాని, 'కవితాప్రావీణ్యఫణీశు' లగు కృష్ణదేవరాయచక్రవర్తులను గాని పరాధీనమందున్న ఆంధ్రు లిఁకఁ జూడఁబోరు. అట్లగుట:

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజన మూయ్యెలమంచము...

—చాటుధార.

ఇచ్చి మహాకావ్యములను రచియింపుఁడని కవులను గోరు ప్రభువతంసము లుండరు. మహాకావ్యరచనకు అవకాశముఁ గల్పించు రాజపోషణ మిట్లు కొఱవడియుండుటచే నీకాలమున ఖండకావ్యరచనమే కొనలుసాగుచున్నది.

మఱియొక కారణము :

ప్రస్తుతయుగమున కవితాపోషకులగు ప్రజలు తీరి కూర్చుండి మహాకావ్యములు పఠింపనేరని త్వరజీవనులు, లౌకికులు. వారికి తీరిక తక్కువ. వారిమనములు వివిధవ్యాపారములందుఁ బర్యాప్తములు. అందువలన స్వల్పకాలములో సమాప్తముకాఁగల ఖండకావ్యములపైకి వారిచిత్తములు పోవుచున్నవి. కావున నట్టి కావ్యరచనకు ఆధునికయుగమున విశేషమైన ప్రోత్సాహము, ప్రోద్బలము కల్గుట నైసర్గికము.

వేఱొండు హేతువు :

ప్రస్తుతకాలమున పత్రికలే పెక్కు సందర్భములలోఁ గావ్యప్రచురణసాధనములు. సుదీర్ఘమయిన కావ్యసామగ్రిని దలఁదాల్చుట ప్రజాభిరుచికి దూరమగుటయే యని నేఁటి పత్రికలు నిజ మూరసినవి. అట్లగుట నేఁడు కావ్యప్రచురణసాధనములైన పత్రికలుకూడ ఖండకావ్యరచననే అభిమానించుచున్నవి.

వేఱొక కారణము :

నవీనాంధ్రసారస్వతమునకు అదృష్టవశమున ఆంగ్ల సారస్వతసంపర్కము లభించినది. ఆంగ్లసారస్వతమున ఖండకావ్యములు వేనవేలు. అనుకరణమునకుఁ బెట్టినదిపేరగు మన ఆంధ్రకవులు అదిచూచి తెనుఁగుకైతను ఖండకావ్యభూషలతో సింగారింపఁ దొడఁగిరి. ఖండకావ్యరచనము ఆంగ్లసారస్వత సాహచర్యమువలన మన కబ్బిన మహాభాగ్యములలో నొకటి.

ఇఁక నొక కారణము :

'సతతము కావ్యరసముం గొనియాడుచు' 'మహాకవిత్వ దీక్షావిధిఁ' బూనఁగల తిక్కనసోమయాజివంటి రసోపాసకులను, గవిబ్రహ్మలను గనఁజాలని పిదపకాల మిది. ఆధునికాంధ్ర

సారస్వతమహాసభాభవన మలంకరించిన 'కలికిపాటలకోయిల కోలము' వారికి సారస్వతమువలన జీవనోపాధి కల్గుటలేదు. వారు ఇతరత్ర ఉద్యోగధర్మమును స్వీకరించియో, వ్యాపార వ్యవసాయము లవలంబించియో పొట్టపోసికొనుచు దేశాభిమానులును, భాషాభిమానులును నగుటచే తీరికసమయములందు ఉద్యోగ్నమనస్కులై కవన మల్లుచున్నారు. వారి శ్రద్ధాబుద్ధులను ఒక్క కవిత్వరచనమందే అవధానమొనర్చుటకు వారు ఉదరపోషణార్థ మవలంబించిన ఇతరవ్యాపారము లొప్పుకొనవు. కావున వారికి మహాకావ్యరచనకు వలయు దీర్ఘోపరమ లేకుండఁబోయినది. అత్యభిరుచిగల వారి కవిత్వాభినివేశము ఖండకావ్యరూపమున జాలువాఱుచున్నది.

కవితాపోషకులైన ప్రజలును, కావ్యప్రచురణసాధనములైన పత్రికలును, నవీనాంధ్రకవిత్వాభివృద్ధికిఁ బ్రోద్బలమొసంగుచున్న ఆంగ్లసారస్వతమును, కవితానిర్మాతలగు యువకవులును ఇట్లు ఖండకావ్యములవైపే మల్లుచూపుచుండుటచేత ఆధునికయుగమున ఏతత్కావ్యరచనము మెండుకొనుచున్నది.

## కవితాసామగ్రి

ప్రాచీనకవిత్వమునుండి నేఁటి తెనుఁగుకవిత్వమును వేఱుపఱచెడి రెండవవిషయము కవితాసామగ్రి.

పూర్వకవులు ఉన్నతకుటుంబములవారి ప్రేమజీవితములు, మహాపురుషుల యుద్ధవీరత్వము మొదలైన సామాన్యజనుల కందుబాటుకాని ఉదాత్తవిషయములను గవితావస్తువుగా గ్రహించిరి. వారికిఁ బ్రకృతివర్ణనములు మహాకావ్యకల్పనలో నెడపడఁదగు నోతెంచు నుపాఖ్యానములు.

నవీనకవుల కట్లుకాదు. ప్రకృతివర్ణనములే వీరిఖండ కావ్యములకుఁ బ్రాణమువోయు ప్రధానవిషయములు. ప్రకృతిలోని సీతాకోకచిలుక మొదలు గగనదీపమగు చంద్రునివఱకును గల సమస్తవస్తువులును వీరి కవితాకుంచిక కనువగు వస్తువులే. వీరు ప్రాకృతజనుల సామాన్యజీవితవిషయములను గూడ కవితాసామగ్రిగ స్వీకరింతురు. ఇది ప్రాచీనాంధ్ర పండితకవు లెవ్వరును ద్రొక్కి చూడని క్రొత్తతెన్ను.

ఇది ప్రజాస్వామిక (Democratic) ప్రభుత్వకాలము. కావున 'కవితలల్లే క్లాంతహృదయులు' సామాన్యప్రజల జీవితవిషయములను కవితాసామగ్రిగా స్వీకరించుట కాలప్రభావము.

ఇవి జాతీయపునరుద్ధరణదినము లగుటచే ఆంధ్రచారిత్రకవిషయములను దేశోద్ధారకు లనఁదగిన యువకవులోకరిద్దఱు గానముచేయుచు 'ఆంధ్రావళి మోదముంబొరయు' చున్నారు.

ప్రబంధకవులు కృతిపతి నభినందించు ఘట్టమునఁ దప్ప మిగిలిన స్థలముల సమకాలికాంశములను ప్రస్తావింపలేదు. నవ్యకవు లట్లుకాక సమకాలికాంశములను గావ్యవస్తువుగాఁ జేకొనుచున్నారు.

శైలి

మూఁడవది శైలి.

ప్రబంధకవులు తమకావ్యములను బ్రౌఢాతిదీర్ఘసమాసములతో నింపివైచిరి. అందు బంధశ్లేషద్వ్యర్థిత్యాది ఐంద్రజాలికకవిత్వము మెండుకొనియుండుటయుఁ గలదు. ప్రబంధకవులలోఁ బెక్కురు సంస్కృతసాహిత్యమండను లగుటచే వారిగ్రంథములందలి శైలి సాంస్కృతికము. 'తోడ నర్థమెల్లఁ

నోఁచకుండు గూఢశబ్దములతో' నిండియుండు నా ప్రబంధములు పండితులకుఁగూడ కొఱుకుడుపడని కొఱముక్కలు.

నవకవులు చిన్నిపదములు, నాతిదీర్ఘసమాసములు, జాను తెనుఁగుపదములు వాడి సులభసుందరశైలిలోఁ గావ్యరచనము చేయుచున్నారు.

బంధశ్లేషద్వ్యర్థికవిత్వములు మన యదృష్టవశమున విస్మృతికూపమునందుఁబడి అడఁగారుచున్నవి. ఆంధ్రకవితాసతి యదృష్టరేఖ బయలుపడుటచే ఆశుకవితాప్రాబల్యము త్వరితగతి నడుగంటుచున్నది. పరకపాటుగఁ జూపట్టుచున్నను రసికప్రజల సాదరదృష్టి అట్టికవిత్వముపైఁ బ్రసరించుటలేదు.

పదకాఠిన్యమే గొప్పకవిత్వమునకు యోగ్యతాపత్రముగా భావించిన ప్రబంధకవుల శైలికిని, శిరీషకుసుమపేశలములైన లలితపదములతోఁ గవనమల్లు నేఁటివారి శైలికిని గల వ్యత్యాసము సముద్రమంత విస్తారమైనది.

పూర్వులు మారుమూలపదములను, రెండర్థములు స్ఫురించు పదములను శ్రమచేసి ఏర్చి కూర్చి తమకావ్యములను బండితజనైకవేద్యముగా నొనరించిరి. నేఁటివారన్ననో 'కంచుపమాటలు, సామెతలు' అందముగాఁ బొందుపఱిచి తమగీతికాప్రసవములను జనసామాన్యము తావిగొనునట్లు చేయుచున్నారు.

వ్యావహారికశైలి నుపయోగించుచుఁ గళాదక్షులును, మహామతులు నగు నవ్యాంధ్రకవులు కొందఱు జీవద్భాషామాధుర్యమును ఆంధ్రలోకమునకు నంజుకొనఁబెట్టుచున్నారు. సులలితాంధ్రపదములు, వ్యావహారికభాషాపదములు, జాతీయములు, సామెతలు- ఇత్యాది జీవద్భాషాపరికరములు

నవీనాంధ్రకవుల శైలికి నవరఁదనముఁ గొనితెచ్చు మేరుప్రపూసలు.

ఛందస్సు

నాల్గవది ఛందస్సువిషయము.

పూర్వులు రచించిన గ్రంథములలో శతకములును, ద్విపదకావ్యములును మాత్రమే ఏకవృత్తపూర్ణములు. మిగిలినవన్నియు వివిధగద్యపద్యాత్మకములగు చంపువులు.

నవీనులగ్రంథములన్నిఁటిలో విశేషము తేటగీత, మంజరి, ముత్యాలసరులు మున్నగు ఏకఛందములో రచింపఁబడిన ఖండకావ్యములు.

ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము, శార్దూలము మొదలగు వృత్తములను విశేషముగను- సీసము, గీతము మున్నగు జాతులను ప్రాయికముగను పూర్వ ప్రబంధకవులు వాడిరి. ఆధునికయుగమున నియమబాహుళ్యముగల వృత్తముల రచన కొంచెము వెనుకబాటునొందినది. యతిప్రాసలకుఁ గట్టుపడుట యనినను, వ్యర్థపదపూరణములతో యతిప్రాసల నిల్పుటయనినను స్వేచ్ఛాపరులును, పదశిల్పులును నగు నేఁటి కవులకుఁ దలచీఁదఱ. యతిప్రాసలు ఎత్తికట్టి భాషాసౌలభ్య సంపాదన మొనరించుటకు స్వేచ్ఛాపరులయ్యు నవ్యాంధ్రకవులు పూర్తిగా సాహసింపలేక వృత్తములను మాని నియమములు తక్కువగనుండు మంజరులపైకి, తేటగీతములపైకిఁ దమదృష్టి మరలించిరి.

నవ్యాంధ్రకవితాసూత్రధారులలోనివారైన వేంకట పార్వతీశ్వరులు తేటగీతములు, మంజరులు లాలిత్యలావణ్యములు కలిగి విశృంఖలములగు నవ్యభావవర్ణనముల కమరి

యుంచుటను గనిపెట్టినారు. తేటగీతి ఆంధ్రమునకు అనుష్టుప్పు; సర్వతోముఖమగు నవ్యభావపరంపరకు ననువైన చక్కని వాహిక. మఱియొక మంజరీద్విపద మధురభాషయగు ఆంధ్రముకొఱకే అవతరించినది. కావుననే నవకవులు తేటగీతముల, మంజరుల విశేషముగ నాశ్రయించుచున్నారు.

పరంపరానుగతములగు ఛందములు యతిప్రాసదూషితములై తగినస్వేచ్ఛను, తృప్తిని ఈయకుండుటచే నూతనచ్ఛందములను నిర్మించుటకు నేఁడొకవిపులప్రయత్నము జరుగుచున్నది. ఈ విపులప్రయత్నము నవీనాంధ్రకవులలోఁ బెచ్చు పెరుగుచున్న స్వాతంత్ర్యబుద్ధివలనఁ గలిగిన ఆరోగ్యవంతమును, శ్లాఘ్యమును అగు కృషి. ఫలమెట్టిదగునో?

భావము

ఐదవది భావముల విషయము.

ప్రబంధకవులలో భావదాస్యము హెచ్చు. వారి కావ్యనిర్మాణపద్ధతియే ఇట్టిభావదాస్యమును బోషించినది. దేవతా ప్రార్థన, కవిస్తుతి, కుకవినింద, కృతిపతివంశవర్ణన, షష్ఠ్యంతములు, పురవర్ణన, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణన, వేశ్యాభిసారికా పుష్పలావికాది వర్ణన, నాయికా నాయకుల వర్ణన, వారి విరహము, చంద్రోపాలంభము, మన్మథోపాలంభము మొదలైన విషయములన్నియుఁ దప్పనిసరిగాఁ గావ్యనిర్మాణములోఁ బూర్వులు చేర్చికొనియుండుటచే వారి భావములకు అనేకత్వముకాని, సంక్షేపవిక్షేపములుకాని లేకపోయినవి. ఒకరినొకరనుకరించుటచే వారిభావములకు నవీనత్వము కూడ లేకుండఁ బోయినది.

నవీనకవుల విషయమున అట్లుకాదు. వీరు స్వేచ్ఛా

ప్రియులు. అనుకరణము వీరి 'ఇంట ఒంట' కూడ లేదన సాహసింపనేరము కాని వీరు కావ్యనిర్మాణపద్ధతిలో వివిధత్వ మవలంబించుటచే వీరిభావములకు సరిక్రొత్తఁదనమును, సంక్షేప విక్షేపములును లభించినవి

లక్షణగ్రంథముల బందుకిట్లకు లోఁబడి కావ్యరచనముఁ గావింపనొల్లని రసోపాసకులు నేఁటికవులు.

ప్రాఁదనుఁగుకైతనుండి వేఱైయున్న నేఁటి తెనుఁగుకైతల క్రొత్త తెన్నుల నిట్లు స్థూలదృష్టితోఁ బరామర్శించుకొంటిమి.

ఇఁక నాక్రొత్త తైన్నులను బ్రత్యేకనిదర్శనములతో విమర్శించుకొందము.

## 3

## తెనుఁగుకైతల క్రొత్తతెన్నులు

### ప్రకృతివర్ణనము

నవీనాంధ్రకవులకుఁ బ్రకృతిచింతనము, తత్సాంగత్యము నెక్కువ.

ప్రబంధకవులు తమకుఁదామై ప్రకృతితో సాంగత్యమనుభవించి ప్రకృతివర్ణనము చేయలేదు. ప్రకృతివర్ణనావసరమున వారు గ్రంథస్థములును, కవిసమయములును నైనవర్ణనాక్రమము నవలంబించిరి. ప్రవాహవేగయగు గంగానదిలోఁ దామరమొలపించెడి ప్రబంధకవు లెక్కడ? ప్రకృతిసాంగత్య మెక్కడ?

ఇట్టి విరుద్ధకవిసమయములచెంతఁ జేరక ఆంధ్రకవితాపితామహునివలె నొక్కింత మనోహరముగఁ బ్రకృతివర్ణన

గావించిన కవులును కొందఱు ప్రాచీనులలో లేకపోలేదు. కాని అట్టివారైనను ప్రకృతి యథారూపవర్ణనముగా త్రిమే చేసిరి కాని ప్రకృతిలోని అంతర్లీనవిషయముల నవగాహము చేసికొన ప్రయత్నింపరైరి,

ప్రకృతిలోని వివిధచిత్రములఁ దిలకించి, ఆనందించి, కలరూపు కవితాకుంచికతోఁ జిత్రించుట ప్రాచీనాధునాతన కవులకు సమానవిషయము. కాని అధునికాంధ్రకవులు ప్రకృతి వివిధరూపములను దూరమునుండి తిలకించుటతోఁ దృప్తినొందరు. వీరు ప్రకృతిలో నంతర్లీనము గుదురు.

నిదర్శనముగా 'ఏకాంతసుఖము' అను శీర్షికగల శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి క్రింది ఖండకావ్యమును తిలకింపనగును :

ఈ యడవి దాగిపోనా?
ఎటులైన
ఇచటనే ఆగిపోనా?
ఆకులో ఆకునై
పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై
నునులేత రెమ్మనై
ఈయడవి దాగిపోనా?
ఎటులైన
ఇచటనే ఆగిపోనా?
గలగలని వీచు చిఱు
గాలిలో కెరటమై
బలబలని పాడు
సెలపాటలో తేటనై

ఈయడవి దాగిపోనా?
ఎక్కడైన
ఇచటనే ఆగిపోనా?

తరులెక్కి యాలనీల
గిరులెక్కి మెలమెల్ల
చదలెక్కి జలదంపు
నీలంపు నిగ్గునై
ఈ యడవి దాగిపోనా?
ఎక్కడైన
ఇచటనే ఆగిపోనా?

ఆకలా దాహమా
చింతలా వంతలా
ఈ కరణి నెట్టినై
ఏకతమ తిరుగాడ?
ఈ యడవి దాగిపోనా?
ఎక్కడైన
ఇచటనే ఆగిపోనా?

ప్రకృతితో సాహచర్యము హెచ్చు గావుననే వీరికి ప్రకృతిరూపవికారములం దొక అనిర్వాచ్యమైన మహాశక్తి, మహావ్యక్తి పొడగట్టును. ఆ మహావ్యక్తిని గురువుగను, తమ్ము శిష్యులుగను నిర్దేశించుకొని నవీనాంధ్రకవులు ఆ మహావ్యక్తితో మానసికసల్లాపసంతోషముఁ బొంది అందుండి నీతిని గ్రహింతురు. ఒజ్జగా నిర్దేశింపఁబడిన ప్రకృతి మనసము క్రమముగా నతిశయిల్లి జీవాత్మపరమాత్మలకుం గల సంబంధ

సోపానమార్గమును వ్యక్తముచేయును.

ఇట్టి ప్రకృతివర్ణనము వేంకటపార్వతీశ్వరకవుల 'ఏకాంతసేవ'లో బ్రకృతిపురుషులకు గల పవిత్రప్రణయలీలల రూపముగ బ్రస్తావింపబడినది.

నవీనాంధ్రకవులకు బ్రకృతి జీవితాదర్శములు బ్రదర్శించు గురువు; అంతరాత్మను ప్రబోధించు వేదాంతి.

లిరిక్కు కవిత్వము

లిరిక్కు కవిత్వలక్షణములు కలదానినే కొందఱు భావకవిత్వమనుచున్నారు.

ఏజాతికి జెందినను ఉన్నతకవిత్వమునకు భావము ప్రాణాధారము అట్లగుట ఒకజాతి కవిత్వమునే భావకవిత్వమనుట కువాదమే యగును. కావున భావకవిత్వమని మనవారు పిలుచు కవిత్వమును 'లిరిక్కు'కవిత్వమని పిలుచుట సమంజసముగా నుండును.

ప్రబంధకవిత్వములో కవి చదువరులకు దనకు దానై గనుపించడు. కాని లిరిక్కు కవిత్వములోనో? లిరిక్కు కవిత్వమనునది కవి ఆశ్వాసదంతమో, ఆత్మానుభవమో ఐయుండును.

లిరిక్కు కవిత్వమునకు గవి తనహృదయమున మట్టుమీఱి మల్లాడు సుఖదుఃఖాద్యనుభవములను బ్రవహింపజేయును. కవి స్వీయానుభవవ్యక్తీకరణము గావున లిరిక్కు కవిత్వము విశ్వాసముండితమై యుండును.

లిరిక్కు కవితాప్రధానలక్షణ మొద్ది యనిన: కవితావస్తువుతో గవికి ప్రచ్ఛన్నముకాని సంబంధముండుటయే. ఇంతియేకాని వస్తువునందు గాని, భావమునందుగాని లిరిక్కు కవిత్వమునకు నియమశృంఖల లేదు.

'ముక్తావళి' యను ఖండకావ్యమున శ్రీవేదుల సత్య నారాయణశాస్త్రి 'నావలె శుష్కజీవనమునన్.....' (భారతి: సంపు ౧-సంచిక ౭-పుట ౧౮౭) అని వెల్లడించిన దుఃఖభాజనమైన యాత్మోదంతమును, 'తిక్కన' యను ఖండ కావ్యమున శ్రీ పెమ్మరాజు లక్ష్మీపతి గావించిన

ఉ. మేటివిపంచి కేలగొని మించినశక్తి బినాకినీనదీ
    వాటికలన్ గవిత్వరసవైభవముల్ వికసింప నెన్నఁడో
    మీటిన భావరాగముల మేదురనాదము మారుమ్రోయు నీ
    నాఁటికి గూడ నాంధ్రభువనంబునఁ దిక్కకవీంద్ర! హాయిఁగన్.

చ. అలతిరుతంబు గద్గదసమాకులమై నిను బిల్చుచున్న నా
    పలుకులు నిన్ను జేరక నభఃస్థలి లీనములైన నౌను గా
    క లఘుగుణాఢ్య! జిహ్వతనియన్ నిను బిల్చి త్వదీయరూపమే
    దలఁచెద డెందమం దిఁకఁ గృతార్థుఁడనయ్యెద నేయి నేటికిన్.

ఇత్యాది మహాకవిస్తోత్రమును ఆంధ్రసారస్వతమున లిరిక్కవిత్వమున కుత్కృష్టనిదర్శనములు.

## ప్రాకృతజనుల జీవితము

ప్రాచీనాంధ్రకవులు మహారాజులకథలనే కాని సామా న్యుల కథలను కావ్యసామగ్రులుగా గ్రహింపలేదు.

వారు రాజాశ్రయులు. అట్లగుట వారి భావప్రపంచ మున నంతఃపురసంవాసితులైన రాజదంపతుల విరహాగ్నికే కాని పల్లెటూరి పాటకపుజనుల నిసర్గరమ్యప్రణయజీవితము లకుఁ జోటులేకపోయినది. వారు 'పల్లెటూరితొయ్యలుల నిసర్గరమ్యదరహాసవిలోకనచేష్టలందు గుబుల్కొను నిష్క లుషపు గ్రామ్యజీవనపుఁ గమ్మఁదనంబు' గ్రహింపలేకపోయిరి. 'రాచోరింటికైనా రంగూ తెచ్చే పిల్ల' లు ప్రాకృతజనులలో

నుందురని వారు కలలోనైన నూహింపలేదు.

నవీనాంధ్రకవుల కట్లు కాదు——

ప్రేమకురియించు మోహనరాగాలాపములు గావించెడి కావుపడుచు కలికివలపు విద్యావంతులగు నవీనాంధ్రకవుల 'విరజాజిబజారు'లోని సరిక్రొత్త సరకు.

ఈ తరగతి కవిత్వమును బెంపొందించు రసికావతంసము లలో శ్రీ నండూరి వేంకటసుబ్బారావు మేటి. ప్రణయస్వరూపిణియగు యెంకిద్వారా ప్రాకృతజనుల సాంసారికపు ముచ్చటలను అనువగు కవితాసంభారములతో మేళవించి భోగ్యద్రవ్యముగా నొనర్చిన యీ కవిప్రతిభకు 'అంజలిసేయక తీర దేరికిన్.'

ప్రాకృతజనుల సాంసారికపు ముచ్చటలు భోగ్యద్రవ్యముగా నొనర్చిన ప్రతిభయేకాక వానికి శిష్టత్వ మాపాదించి సభాపూజ్యతఁ గొనితెచ్చిన గౌరవముకూడ సుబ్బారావుకే చెందును.

'యెంకిపాటల'లోని శ్లాఘ్యమైన మఱియొక విశేషము:

హిందూదేశము కర్మభూమి; జ్ఞానభూమి. అందుఁ బుట్టువుఁగన్న విద్యాగంధహీనుఁడగు కడజాతివానినుండి 'తపస్స్వాధ్యాయనిరతుఁ'డగు మునీశ్వరుని వఱకుఁగల ప్రతివానికిని బూర్వోత్తరజన్మజిజ్ఞాస తల్లి పాలనాఁటినుండి యుండునదే.

హిందూదేశౌన్నత్యము కలకాలము చిరస్థాయియై యుండుటకు వేరుదుంప యనఁదగిన దీ విజ్ఞానము. అది భారతీయుల కెల్లరకు ఉమ్మడిసొమ్ము.

కావుననే నాయుఁడుబావయు

'ఒనకజల్మములోన ఒగరమో' నంటి
సిగ్గొచ్చి నవ్వింది సిలక నా యెంకి!

'ముందు మనకేజల్మ ముందో లె' యంటి
తెలతెల్లపోయింది పిల్ల నాయెంకి!

అని నివేదించుచున్నాఁడు.

ప్రాకృతజనుల జీవితవిశేషములను వర్ణించుటలో విశేష వ్యాసంగముచేయుచున్న ఆధునికాంధ్రకవులలో శ్రీ కవికొండల వేంకటరావు అగ్రిసరుఁడు. అతని భావమంజులమగుకైతను ఆధునికాంధ్రలోకము ఇంకను లెస్సగ ఆకళింపలేదు. ఆకళింపనే లేదనుచుండగా ఆధునికాంధ్రలోకము వార్తగల అతని కవితను అనుభవించి ఆనందింపనేరకున్నదని వేఱ చెప్పనక్కఱ లేదు. ఇట్లు ఆనందింపలేకపోవుటకుఁ గారణమేమి? అతని భావవాహిక తెలియని తెన్నులఁబడి సాగుచుండుటచేతనా? నవ్యభావవర్ణనమునకు అంతగా ఒదుగని ప్రాచీనవృత్తములను దిగనాడి నూతనఛందముల సృష్టింప నావేదనపడుచున్న వేంకటరావు విశేషకృషి శ్లాఘనీయమే కాని అతని నూతన ఛందములఁ బఠింపవలసిన ధోరణి పలువురకుఁ దెలియకున్నది.

## గోపకావ్యములు

గోపకావ్యము (Pastorals) లనఁబడు నొకతరగతి కావ్యములు ఆంగ్లసారస్వతిసంపర్కమువలన మన వాఙ్మయము లోనికి దిగుమతినొందుచున్నవి.

గోపకావ్యనిర్మాత యనఁదగిన థియోక్రిటసు (Theocritus) శాద్వలస్థలములు, నదీతీరవిహారములు, పామరజన వ్యవహారములు- ఇత్యాది విషయముల వర్ణించెను. కాలక్రమమున కవులు గోపకావ్యములను మతసాంఘికసారస్వత రాజకీయాది విషయములపై తమ అభిప్రాయముల వ్యక్తీకరించుట కుపయోగించిరి.

భాగవతములోని గోపాలకృష్ణుని వనవిహారవర్ణన మీ తరగతి సారస్వత మనవచ్చును. ఇంతకుమించి మనలోఁ బ్రాచీన గోపకావ్యములు ప్రత్యేకించి లేవు. ఇప్పుడిప్పుడు ఆంగ్లసారస్వత సాహచర్యమువలనఁ గొలఁదిగ బయలుదేరుచున్నవి.

శ్రీ దువ్వూరి రామిరెడ్డి 'వనకుమారి' తెనుఁగులోని గోపకావ్యములలోఁ బేర్కొనఁదగినది. ఇందు గోపకావ్య సంప్రదాయము లన్నియు సమకూరినవి.

కథానాయిక యగు 'వనకుమారి' గొఱ్ఱెల కాచు కొనుచు

'సీ. కొండసెత్తమ్ములఁ గోరాడు మబ్బుల
గమనసౌందర్యంబుఁ గాంచి కాంచి;
మేఘోదయంబున మినమినఁ బురివిచ్చి
యాడు నెమ్మలయొప్పు లరసి యరసి;
యమృతధారలరీతి నచ్ఛమై ప్రవహించు
సెలయేళ్ళలోఁ గ్రీడ సలిపి సలిపి;
ప్రకృతిమంజులమైన పక్షుల గానంబుఁ
దమిదీఱ వీనులఁ ద్రావి త్రావి;
గీ. యెండవేళలఁ బూఁబొదరిండ్లఁ దూరి
హారిణగర్భిణులకుఁ జివురాకు లొసఁగి
ప్రసవమాలల ధరియించి ప్రతిదినంబుఁ
గాననంబుల రాణియై గ్రాలుచుందు.'

ఇట్లు నాయికచేఁ బ్రకృతివర్ణన చేయించుటయే కాక రామిరెడ్డి నాయకునిచే నంతఃపురజీవితము, పరలోకవృత్తాంతము మున్నగు విషయములను వర్ణింపించి లౌకికజీవితముపైఁ గల తన యభిప్రాయములను వెల్లడించెను.

కావుననే గోపకావ్యలక్షణములు 'వసుమూరి'యందుఁ గొంతవఱకు ఏకీభావ మొందిన వనుట.

ఈ గోపకావ్యనిర్మాణమునం దాంధ్రకవులు విశేష మైన యభినివేశ మగపఱచుటలేదు.

మృతస్మృతులు

నెనరైన చుట్టములుగాని, దేశారాధనతత్పరులైన మహానుభావులుగాని మరణించినపుడు కలిగిన దుఃఖావేగముచే రచింపఁబడిన శోకగీతికలు ప్రాచీనాంధ్రసారస్వతమునం దంతగాఁ గన్పట్టవు.

'సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి
కేలూత ఇచ్చి ఎక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొను వేళఁ బురమేఁగఁ
బల్లకి తన కేలఁ బట్టియెత్తె
బిరుదైన కవిగండపెండేరమున కీవె
తగుదని నాదుపాదమునఁ దొడిగెఁ
గోకట గ్రామాద్య నేకాగ్రహారము
లడిగిన సీమలయందు నిచ్చె
'నాంధ్రకవితాపితామహ! యల్లసాని
పెద్దన కవీంద్ర!' యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగలేక
బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు.'

అని పెద్దన్న చెప్పిన చాటుపద్యము ప్రాచీనాంధ్రసార స్వతమునఁ గల శోకగీతములలో నొకటి.

ఈ కాలమున నిట్టి మృతస్మృతుల రచనము విస్తృతిఁ జెందుచున్నది.

సుతస్మృతులు, మిత్రస్మృతులు, పేరుప్రతిష్ఠలుగల పురుషులు మరణించినపుడెల్ల పత్రికలలో మనము గాంచు స్మరణగీతములు మొదలైనవి శోకగీతికావాఙ్మయమును పెంచుచున్నవి; కాని సారవంతము చేయుటలేదు.

శోకగీతములను– ఆత్మీయులు మరణించినపుడు చెప్పునవి, మహాపురుషులు మరణించినపుడు చెప్పునవి అని రెండువిధములుగా విభజింపవచ్చును.

ఆత్మీయులు మరణించినపుడు చెప్పు శోకగీతికలకు శ్లాఘనీయమైన నిదర్శనముగా శ్రీ దువ్వూరి రామిరెడ్డి 'ప్రియావియోగము' అను ఖండకావ్యము ('భారతి: సంపు ౭–సంచిక ౯–పుట ౨౮:౨౯) చేకొననగును.

మహాపురుషుల మృతస్మృతులకు నిదర్శనముగా శ్రీ నిడమర్తి సత్యనారాయణమూర్తి 'దామెర్ల రామారాయస్మరణము' అను క్రందిగీతమును చేకొననగును.

'తూర్పు దిక్కున కాంతికిరణము
మార్పు దెచ్చెను గగనతలమున
తీర్పరమ్మిక దిశల పుటలను
మాతృబింబము
తమ్ముఁడా!
ఉదయగిరి శిఖరావనికపయి
బాలభానుఁడు తెలుఁగుచిత్రము
రచనచేసెను ప్రజలు మెచ్చిరి
చూడ రమ్మిట
తమ్ముఁడా!
నింగి వీథుల రంగు లలరెను
భృంగరాజము లలరి పాడెడి

పొంగి పొరలెడి సంతసార్ణవ
మదియె కను మటు
తమ్ముఁడా!

ఆంధ్రదేశమునందు మొదటగ
గౌతమీవాఃకణము నందున
మొలక లెత్తెను తెలుఁగుపలుకులఁ
దియ్యదన మది;
తమ్ముఁడా!

ఆంధ్రదేశమునందు మొదటగ
గౌతమీవాఃకణము నందున
చిగురుపట్టెను చిత్రకళల ప్ర
వాళరక్తిమ
తమ్ముఁడా!

కంటకావని కమ్మతావుల
మింట బరపెడి మృదులసుమముల
జంట మెరసెను సలుప రమ్మిక
మాతృపూజల
తమ్ముఁడా!

ఆకసమ్మున వెలుగు తారలు
గతులు దప్పియు రాలుచున్నవి
కాంతిపుంజము గడలఁ జిమ్ముచుఁ
జూడుమీ యిటు
తమ్ముఁడా!

వెలుగు వెలిగెను వెఱ్ఱితారక
యేమి యెఱుఁగును రాలిపడునని

కాలకర్మము లొకటి కూడఁగఁ
దప్ప శక్యమె?
తమ్ముఁడా!
క్రూరకర్ముఁడు కాలపురుషుఁడు
చూచినంతనె మార్పు తెచ్చును
జరుగనీయఁడు జగము మెల్లఁగ
నేమి చోద్యము
తమ్ముఁడా!
విడిచివిడువని కన్నెమొగ్గల
వెడల చిదిమియు పాలకన్నీ
రొడలు మండఁగ చూచినవ్వను
చిత్రమేమిరొ
తమ్ముఁడా!
ఏది యేమయియుండునో మది
పొదుకొల్పదు ఉదయమందున
నలము కొంతులె యస్తమానమున
నలము కొనుటను,
తమ్ముఁడా!
చూచి దుఃఖము ననుభవించుట
చూడకుండుటకంటె మేలది
చూడుమీ యిటు వేడియూర్పుల
తొలఁగు కొంతుల
తమ్ముఁడా!

### మర్మకవిత్వము

మర్మకవిత్వ (Mystic Poetry)మనఁబడు ఆధ్యాత్మిక కవిత్వ మీకాలమున విస్తృతినొందుచున్నది.

నోబిలుబహుమాన మందిన రవీంద్రుని గీతాంజలిని వంగీయులకుఁ బోరుగువారైన ఆంధ్రయువకవులు ఆలించి అందలి మేలెంచి మిన్నందినారు. గీతాంజలి సాహచర్యమున తెనుఁగుకవులు జయదేవుని గీతగోవిందము, లీలాశుకుని కృష్ణ కర్ణామృతము మొదలగు వైష్ణవభక్తిప్రతిపాదకములగు గ్రంథరాజములపైఁ దమ కవితాదృష్టిని బ్రసరించినారు. అందుతో భక్తుఁడు ప్రణయినీరూపమున భగవంతునిఁగొల్చు నట్లు కవిసంప్రదాయము మనలో నేర్పడినది.

ఈ మర్మకవిత్వరచనమున యువకులగు నవీనాంధ్ర కవులు విశేషవ్యాసంగముఁ జూపుచున్నారు. అట్టి విశేషకృషికి అమృతఫలముగా వేంకటపార్వతీశ్వరుల 'ఏకాంతసేవ' ఉదయ మొందినది.

ఆధునికాంధ్రకవులు ఆంధ్రభారతికి ఉపాయనముగ నర్పించుచున్న గ్రంథరాజములలో 'ఏకాంతసేవ' ఉత్తమ మైనది. ఇందుఁ బ్రణయినీప్రణయులకును, బ్రకృతిపురుషుల కును, భక్తపరమేశ్వరులకును గల పవిత్రప్రణయలీల యభి వర్ణితమై యున్నది.

### వేణు గా న వ ర్ణ న ము

వైష్ణవభక్తిప్రతిపాదకములగు గ్రంథములను బఠిం చుటవలన నేఁటి యువకవులలో శ్రీకృష్ణుని వేణుగానవర్ణనము పెచ్చుమీఱినది. సంస్కారులును, సనాతనమార్గగాములును గూడ నిట్టి వర్ణనమొనర్చి ఆంధ్రకవితాసతిచేత గుడుగుడు కుంచము లాడించుచున్నారు. ఇఁకనైన నిట్టిది విరమించుట మంచిపని.

### జాతీయ భావము

నేఁటి తెనుఁగుకవులలో జాతీయభావము పెల్లుబ్బి వెల్లువయై ప్రవహించుచున్నది.

నవీనాంధ్రకవులలో కొందఱు స్వదేశీయోద్యమాంధ్రోద్యమములచే నుత్సాహతరంగితులై కవన మల్లుచున్నారు. అట్టిచో వారి కవనములందు సమకాలీనమైన ఉత్సాహబీజములు అప్రయత్నముగనైన ఉరణింపక మానవు.

'ఆంధ్రావళి మోదముంబొరయ' గ్రంథరచనోద్యుక్తుండైన తిక్కనకూడ ఆంధ్రకీర్తిని ప్రత్యేకించి సంకీర్తనము చేయలేదు.

కాకతీయాంధ్రచక్రవర్తి ప్రతాపరుద్రుఁడు మువ్వూరుయవనవీరులను తెలుఁగుమాఁగానినుండి తఱిమివైచిన ఆ విజయలక్ష్మీప్రసాదాంకవిభవదినములలో నాఁటి తెనుఁగు కవులయందు జాతీయభావము పాలసముద్రమువలె పొంగిపొరలవలసినది. కాని ప్రాచీనాంధ్రకవులలో జాతీయభావము అంతగా లేదనవలసి యున్నది.

'లోక మంతకుఁ గాఁకవెట్టిన' ఆనాఁటి 'కాకతీయుల కదనపాండితి'ని 'చీకిపోవని చేవపాఁటల'లో నిరువదియవ శతాబ్దిలోనున్న శ్రీరాయప్రోలు సుబ్బారావు ప్రస్తావించెనే కాని సమకాలికు లందఱును మూఁగలై యుండిరి.

ఇవి జాతీయపునరుద్ధారణదీక్షాదినములు.

'ఉ. జారిన దేశగౌరవముఁ జక్కన దద్ది, మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగఁ బాలనఁజేసి, సమానరాష్ట్రముల్
కూరిమి నాసఁజేయ, తెలుఁగుం బుడమిన్ గయిసేసి...'

—రాయప్రోలు సుబ్బారావు

ఔన్నత్యశిఖరమునకుఁ గొంపోవలయునను దీక్షతో దేశారాధకులగు కవులు

'సీ. తనగీతి యఱవజాతిని పాటకులనుగాఁ
దిద్ది తరిల్లిన తెనుఁగువాణి
తన పోటులు విరోధితండంబులకు సహిం
పనివిగా మెరసిన తెనుఁగు కత్తి
తన యందములు ప్రాంతజనుల కభిరుచి వా
సన నేర్ప నలరిన తెనుఁగురేఖ
తన వేణికలు వసుంధరను సస్యశ్యామ
లను జేయఁ జెలఁగిన తెనుఁగుభూమి

గీ. అస్మదార్ద్రి మనోవీథి నావహింప
జ్ఞప్తి కెలయించుచున్నాఁడ చావలేదు
చావలేదు ఆంధ్రుల మహోజ్జ్వలచరిత్ర
హృదయములు చీల్చి చగువుఁ డోసదయులార!'

—రాయప్రోలు సుబ్బారావు

అని ప్రాక్తనవైభవ పునశ్చరణము చేయుచున్నారు. రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, శేషాద్రి రమణకవులు మొదలైనవారు జాతీయభావసముద్దీపితములగు కావ్యముల గొన్నిటిని రచించుచు ఆంధ్రకీర్తి సంకీర్తనము చేయుచున్నారు.

ప్రత్యేకమైన ఆంధ్రజాతీయాభిమానమే కాక నవీనాంధ్రకవులలో సాముదాయకమైన భారతజాతీయాభిమానముకూడ వెల్లివిరియుచున్నది. శ్రీ నండూరి బంగారయ్య

'రక్షరా! శ్రీరామ రక్షరా! తండ్రి
మాతృభూమికి గాను మహితాత్ముఁడగుచు

తన ప్రాణములనెల్ల ధారగా నిడిన
మీ తాత తపనులే మీకు రక్షణలు
దిక్కుమాలిన తల్లి దీనతను బాపఁ
బద్ధకంకణుఁడైన ప్రభువగు గాంధి
సత్య సంకల్పంబె సంరక్ష నీకు.
ఆత్మీయదేశార్థ మఖిలంబు నిచ్చి
పశువులసాలలో వసియించుచుండి
సుకుమారదేహంబు స్రుక్కిపోవంగ
కాటికిఁ గాళ్ళను కడఁజాచుకొన్న
కడువృద్ధు డయ్యును నెఱజవ్వనాన
చెఱసాల వాసంబు చేపట్టినట్టి
నెహ్రూ మహాత్ముని త్యాగసంసిద్ధి
నీకన్న డబ్బునో నా చిన్నికూన!
నీతండ్రి మార్గంబు నీకు బోధించి
గాంధిమానికి నిన్ను కరమప్పగించి
నీదేశభక్తియు నీవర్తనంబు
నేఁజూచి ధన్యనౌ నిమసంబుకొఱకు
వేచియుంటినిసుమ్మి వెళ్ళినాతండ్రి!
ఆంధ్రజాతీయుల యాత్మగౌరవము
భారతీయులయొక్క భావిభాగ్యంబు
నీచేత నున్నవి నా చిన్నిబాబు!

అను రచన మిందు కుదాహరణము.

ఇందులో నొక విశేషము:

కవి సమకాలీనమైన చారిత్రకాంశములను కావ్యవస్తువులుగా స్వీకరించియున్నాఁడు.

ప్రబంధకవులు కృతిపతి నభినందించు ఘట్టమునఁ దప్ప మిగిలిన తావుల సమకాలికాంశములను గ్రంథస్థ మొనర్ప లేదు.

సమకాలికాంశములను గావ్యసామగ్రులుగా నంగీకరించు నాచారము నవీనులలోమాత్రమే యెందుకొన్నది. నవీనాంధ్ర కవులందుఁ జూపట్టు జాతీయభావవిజృంభణమే యిట్టి ఆచార స్వీకరణమునకు ముఖ్యకారణము.

చిన్నికథలు

పూర్వాంధ్రకవులు ప్రత్యేకించి చిన్నికథలను రచింప లేదు.

మహాకావ్యసృష్టిలో నెడనెడఁ బొడతెంచు ఉపాఖ్యానములు వారికి ఏదేని ఒకవిషయమును సమర్థించుటకో, లేక ఏదేని ఒకనీతిని ఉపదేశించుటకో కొనితేఁబడిన అప్రధానవిషయములు.

నవీనాంధ్రకవులు పెక్కురు ఖండకావ్యరచయితలు గావున స్వల్పేతివృత్తముల నెత్తికొని వానికిఁ దగిన ఎత్తుగడ, నిర్వహణము, సమాప్తి హత్తించి చిన్నికథలు విరచించుచున్నారు.

నేఁటి ఖండకావ్యములలో నేదే నొకభావముకాని, అవస్థకాని ఉల్లేఖింపఁబడి, మథింపఁబడి, పరామర్శింపఁబడునట్లే నేఁటి చిన్నకథలలో నేదే నొక సాంఘికదురాచారముకాని, చిత్తవిభ్రమముగొల్పు విచిత్రసంఘటనముకాని ప్రస్తరింపఁబడును.

నిదర్శనముగా చిర్రావూరి కామేశ్వరరావు 'ఏకాంత ప్రేమ', 'వేంకటపార్వతీశ్వరుల 'జలజమాలిక', అబ్బూరి రామకృష్ణారావు 'మల్లికాంబ' చేకొననగును.

### వృత్తములు

ఈ కాలమున వృత్తరచనము వెనుకపాటు నొందినదని చెప్పవచ్చును.

వేంకటపార్వతీశ్వరకవులు వెలయించిన తేటగీతముల సమ్మోహనమే ఇందులకు ముఖ్యకారణము.

ప్రబంధవాసన పట్టనీయక వృత్తములను నవ్యసంప్రదాయముతో నడపించు యువకవులు కొందఱున్నారు. వారిలో రాయప్రోలు సుబ్బారావు, దువ్వూరి రామిరెడ్డి. వేదుల సత్యనారాయణశాస్త్రి, పెమ్మరాజు లక్ష్మీపతి మొదలగువారు ముఖ్యులు.

ఇందుఁ బెమ్మరాజు లక్ష్మీపతి వృత్తములకుఁ జూపు లిరిక్కుఅందము అసాధారణముగా నున్నది.

### బాలవాఙ్మయము

బాలబాలికాలీలలు విరివిగ వర్ణించుటకు, వారికొఱకై ప్రత్యేకించి వాఙ్మయము సృష్టించుటకు ఇక్కాలమున సత్ప్రయత్నము జరుగుచున్నది.

ఇందు బాలబాలికాలీలలు విరివిగ వర్ణించు సారస్వతమునకు నిదర్శనముగా 'అమ్మణ్ణి' అను శీర్షికగల

గంధము మెడకూ పూసుకొని
పసుపు కుంఖుం రాసుకొని
కంటికి కాటుక పెట్టుకొని
ఆడవె ఆడవె అమ్మణ్ణీ !

జడలో పువ్వులు తురుముకొని
తిలకము నుదుటా దిద్దుకొని
బుగ్గను చుక్కాపెట్టుకొని
ఆడవె ఆడవె అమ్మణ్ణీ !

కాళ్ళకు గజ్జెలు కట్టుకొని
చేతికి గొలుసులు పెట్టుకొని
దండలు మెడలో వేసుకొని
ఆడవె ఆడవె అమ్మణ్ణీ !
నోట్లో బూరా పెట్టుకొని
చేత్తో ఢక్కా పట్టుకొని
పూవుల చొక్కా తొడుక్కొని
ఆడవె ఆడవె అమ్మణ్ణీ !
గాజుల చేతులు తట్టుతును
బోసినవ్వులూ నవ్వుతును
చిటపటఅడుగులు తొక్కుతును
ఆడవె ఆడవె అమ్మణ్ణీ !
ముద్దులు కులికే నీ ఆట
త్రిభువనమోహనకరమమ్మా !
సూర్యచంద్రులూ ఉండేదాకా
ఆడవె ఆడవె అమ్మణ్ణీ !

అను శ్రీ చింతా దీక్షితులు రచనము స్వీకరింపనగును.

ఇఁక బాలబాలికలకుఁ ప్రత్యేకముగ సృజింపఁబడు వాఙ్మయమునకు ఉదాహరణముగ 'దొంగాట' అను శీర్షికగల

ఉత్తుత్తి పళ్ళు
ఉత్రాణీ పళ్ళు
నేరేడీ పళ్ళు
నిమ్మా పళ్ళు
కోడి పిల్లల్లార! దొంగైన పిల్ల
తన మొగుడి పేరేమొ తానె చెప్పాలి !

ఉత్తుత్తీ పళ్ళు-ఉత్రాణీపళ్ళు
నేరేడీ పళ్ళు-నిమ్మా పళ్ళు. (లలితదొంగ)
ముద్దులలితా! నీమొగుడి పేరేమి?
నామొగుడి పేరొచ్చి నారింజపండు!
ఉత్తుత్తీ పళ్ళు-ఉత్రాణీ పళ్ళు
నేరేడీ పళ్ళు-నిమ్మా పళ్ళు. (రమణమ్మదొంగ)
చిట్టిరమణా! నీ చెల్వు పేరేమి?
నాచెల్వు పేరొచ్చి-నే చెప్పనమ్మ!
చెప్పవా? దొంగైతె తప్పదోయమ్మ!
నాచెల్వు పేరైతె నాచిట్టిమొగుడు!
ఉత్తుత్తీ పళ్లు-ఉత్రాణీ పళ్లు
నేరేడీ పళ్లు-నిమ్మా పళ్లు. (అన్నపూర్ణదొంగ)
అన్నపూర్ణా! నీ చిన్ని మొగుడెవడే?
నాచిన్ని మొగుడొచ్చి ఆ చందమామ !
ఉత్తుత్తీ పళ్లు-ఉత్రాణీ పళ్లు
నేరేడీ పళ్లు-నిమ్మా పళ్లు. (సీతమ్మదొంగ)
సొగసు సీతా! నీమొగుడి పేరేమి?
పాలసంద్ర మిద్దిది బాలకృష్ణుండు

అను శ్రీ అధికార్ల సూర్యనారాయణరావు రచనము చేకొననగును. శ్రీ మునిమాణిక్యము నరసింహారావు 'కాకమ్మ' అను రచనముకూడ నీతరగతికే చెందును.

ప్రేమ

ప్రబంధములలో వర్ణితమైన ప్రేమ 'పూతపసిండి' వంటిది. ఇప్పుడు పెక్కురు యువకవుల లేఖినినుండి జాలువాఱు ప్రేమ విశుద్ధమైనది. అది హృదయగతమైనది.

'ప్రణయతపస్సు' లోని నాయికను గమనింపుఁడు:

ఉ. చిత్తములోని ప్రేమరసశీకరముల్పయిఁ జిల్కరింప రే
కెత్తిన భావపుష్పముల జేర్చి, హృదీప్సితమాలగూర్చి యా
యుత్తమునైతి వీవు హృదయాధిపు కంఠ మలంకరింపఁగా
నిత్తరికైన రాఁడు హృదయేశ్వరుఁ డో ప్రణయైకజీవనీ!

—పెమ్మరాజు రాజగోపాలము

హృదయోద్గారితమగు నిట్టి విశుద్ధప్రేమ వర్ణింపఁబడు ఈ నాగరికయుగమునఁగూడఁ గేవలము ప్రబంధధోరణిలోఁ గాముకప్రేమ వర్ణించు కవులు లేకపోలేదు. 'నిరీక్షణము' లోని భోగలాలసయగు నాయికను గాంచుఁడు:

చ. కురులను దువ్వి పూల్ముడిచి, గొజ్జగిపూవుల రేమెరుంగుటం
బరము ధరించి, గంధకలపంబుల మేన నలంది, కమ్మక
స్తురి తిలకంబు నెన్నుదుట సొంపుగ దిద్ది, సువర్ణభూషణో
త్కరములదాల్చి, నీకొరకు, ద్వారముఖంబున, నిల్చియుండితిన్.

ఉ. విచ్చినయట్టి బండిగురువిందపువుల్ గొనితెచ్చి, మాలికల్
గ్రుచ్చితి, పూలకన్న నతికోమలమైన భవచ్ఛరీర మే
నొచ్చునొయంచు, చక్కగ కనుంగొని విచ్చిన బొండుమల్లెలన్
దచ్చియె పాన్పుపై పరచితిన్ సకలంబును సిద్ధబెట్టితిన్.

—వేదుల సత్యనారాయణశాస్త్రి

## ఉపసంహారము

అభినవాంధ్ర కవితారథ మిట్లు హుటాహుటీనడలతో నూతనజీవలావణ్యకళ్యాణపథములఁ బఱతెంచుచున్నది.

3

# ఆంధ్ర సారస్వతము - హాస్యరసము

నవ్వు జనింపఁజేయునది హాస్యము. అది ఆనందప్రదము. ఆనంద మారోగ్యదాయకము. హాస్యము నవరసములలో నొకటి.

అపారమగు ఆంధ్రసారస్వతమున ఈ రసము చాలఁ గొలఁది. మృగ్యమని చెప్పుటకూడ సాహసముకాదేమో!

శృంగారరస మేమిపుణ్య మొనరించెనో కాని ఆంధ్రకవి పుంగవులచే నదిగన్న మన్ననలో సహస్రాంశమైన మిగిలిన రసములు నోఁచియుండలేదు. మన సారస్వతమున నున్నంత పిచ్చిగాఁ బచ్చిగా సుకుమారశృంగారప్రబంధములు మఱియే సారస్వతమున నుండవు.

ముచ్చటకుఁగాని, మచ్చునకుఁగాని కన్నుపొడుచుకొని చూచెదమన్నను ఆంధ్రవాఙ్మయమున కేవల హాస్యరసప్రధాన మైన గ్రంథ మొక్కటియుఁ బ్రబంధయుగమందుఁ బొడసూప లేదు. ఆంధ్రకవితల్లజుల కెల్లరకు శృంగారరసస్రవంతిలో 'మునుఁగానాం, తేలానాం'తో సరిపోయినది, పుణ్యకాలము కా స్తయు.

చిల్లపెంకులలోఁ జింతామణు లన్వేషింపదొరకొనినట్లు ఆంధ్రప్రబంధములం దొకదప్రాయముగనైన హాస్యరస మువ లబ్ధమగునేమో తడుముకొందుఁ దము.

భారతము నవరససంపోషిత మనికదా పండితనిర్వచ

నము. అట్టి భారతమునందు సయితము గాలించిచూచిననే ఒక్కటిరెండు తావుల తప్పిజాతి హాస్యముండినట్లు గుర్తింప నగును.

ప్రథమాంధ్ర కవిగ్రామణియగు నన్నయభట్టారకుఁడు హృద్యమగు హాస్య మక్కడక్కడ చిలుకరించియున్నాఁడు. ఈతని హాస్యము చదివినవెంటనే మనమునకుఁ దట్టినను కడుపు చెక్కలుచేయునంత అతికాక సరళమును, సరసమును ఐ చిఱునవ్వుఁ బుట్టించునదిగా నుండును.

'నలుని లిలకించితిరా?' యని సార్థవాహులను దమయంతి ప్రశ్నింపఁగా వారు:

క. నలుఁ గాన మి వ్వనంబున
గల వెవ్వఁడు కాంతు ముగ్రకరులను సింహం
బుల బుత్కుంబుల నిది మ
ర్త్యుల కవిషయ మాతపంబు దూఱదు దీనిన్.

—అరణ్యపర్వము

అని చెప్పిరనుటలో నెంతటి చమత్కారహాస్యము!

అర్జునుఁడు ద్రుపదరాజును గట్టి తనకాళ్ళముందర నుంచ, ద్రోణుఁడు ఆతనిఁ గాంచి

క. వీ రెవ్వరయ్య, ద్రుపద మ
హా రాజులె? యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె? యహహా! మ
హారాజ్యమదాంధకార మది వాసె నొకో!

—ఆదిపర్వము

అని మొగము తగులబ్బెచినట్లు చేసిన దెప్పిపొడుపులు చదువరుల కెంతయైన ఆనందము సంపాదించును.

కవిబ్రహ్మయగు తిక్కనసోమయాజి హాస్యరసపరిపోష ణము లెస్సగాఁ జేయలేదని నాతలంపు. ఉత్తర గోగ్రహణ వర్ణనాసందర్భమున ఈ రసప్రయోగమున కెంతయేని అవ కాశము కలదు. కాని ఈఘట్టమున తిక్కకవి నిజమైన హాస్య రసనిష్పత్తి కలిగింపలేకపోయినాఁడు.

నాచన సోమనాథుఁడు సరసహాస్యప్రయోగమున దిట్ట. నారదునకుఁ 'గయ్యమన్న సంభావనఁగిన్నరీతి'నుండునని వర్ణిం చియున్నాఁడు. ఇట్టి లలితహాస్యము మనగ్రంథములం దుండుట అరుదు.

ఈ యుగపువాఁడే యగు గౌరనమంత్రి హరిశ్చంద్రో పాఖ్యానమందలి కాలకౌశిక వీరబాహు వర్ణనలో మనోరంజ కమగు హాస్యము కలదు. ఈ కవి నవనాథచరిత్రయందును ఈ రసమును రమ్యముగా పోషించియున్నాఁడు.

ఈనాఁటి కవులలో శ్రీనాథుఁడు మేలుచేయి హాస్యరస ప్రయోగమునకు. జామాతయగు శివునిపైఁ గోపము పేరెత్తి యూతని విశేషగుణములను హిమవంతుఁడెట్లుగాఁ దీసికొనెనో చమత్కారముగా వర్ణింపఁబడినది. పరీక్షింపుఁడు:

సీ. తలమీఁది చదలేటి దరిమీలఁదివఁజేరు
కోఁగలు చెలఁగి కొంగొంగు రనఁగ
మెడఁదన్ను పునుకల నిడుపేరు లొండొంటిఁ
బోరిఁబోరిఁ దాఁకి బొన్ బొణుగురనఁగఁ
గట్టిన పులితోలు కడకొంగు పోఁకి యూఁ
బోతు తత్తడి చిఱ్ఱుబుఱ్ఱు మనఁగఁ
గడియంపుఁ బాములు కకపాలలో నున్న
భూతి మైఁ జిలికిన బుస్సురనఁగఁ

తే. దమ్మి పూఁజాలి పునుకకంచమ్ము సాఁచి
దిట్టతనమున బిచ్చము 'దేహి' యనుచు
వాడవాడల భిక్షించు కూడుగాని
యిట్టి దివ్యాన్నములు మెచ్చు (?)వుండు.

—హారవిలాసము

వినువుచేఁ గల్గిన ఈ విరోధభావములు పాఠకులకుఁ గొంతయైన నవ్వుఁ బుట్టింపఁజేయును.

శ్రీనాథుని మఱియొక గ్రంథములో వర్ణనసమయమందు జరిగిన ఈ చమత్కారమును జూడుఁడు:

తే. ఓమె యేమె యిదేమే మె లేమయేమె
మేఘపుష్పంబు దేవంచు మేలమాడ
మేమె మేమేలు దఱచయ్యె మేలు మేలు
'మేఁక మేఁక'న సభవారు మిగుల నగిరి.

—శృంగారనైషధము

శ్రీనాథునిది రుచికరమగు హాస్యము సరళహాస్యరస ప్రయోగమున శ్రీనాథుఁడు చతురుఁడు. ఈతని గ్రంథములందు హాస్యము చిప్పిలు పద్యములు తెలుచు. చాటువులందును శ్రీనాథుఁడు చక్కని హాస్యమును నవదరించియున్నాఁడు.

భారతమందలి ఉత్తరకుమారప్రజ్ఞలు తిలకించి- అనుకరించి పల్నాటివీరచరిత్రమునందు శ్రీనాథుఁడు తంబళకొమ్మయ్య డచ్చీలు చొప్పించినాఁడు. కాని యవి శ్రీనాథునకు హాస్యరసప్రయోగకుశలత్వమునం దావగింజంతయు అధికకీర్తిగౌరవములు దేనేరవు సరికదా మీఁదుమిక్కిలి ఆతనికున్న కుశలత్వప్రతిష్ఠనే కుంచించునంతి అసభ్యములుగనున్నవి.

శ్రీనాథునిదని అనుమానాస్పదముగు ప్రతీతిగల 'క్రీడాభిరామ' రూపకమందలి హాస్యము తరచినకొలఁదిని ఆభాస ప్రాత్రముగ నున్నది.

ఏది ఎటులున్నను- గ్రుడ్డిలో మెల్ల మేలనునట్లు- చమత్కారహాస్యరసప్రయోగమునందు శ్రీనాథుఁ డాంధ్రప్రబంధ కవిసార్వభౌముఁడే. సరససరళహాస్యమున కితని గ్రంథములందును, చాటువులందును ఉపలబ్ధములగు నన్ని ఉదాహరణములు మఱి యే ఆంధ్రకవి గ్రంథములందును అనుపలభ్యములనుట సత్యమునకుఁ గాసంతయు దూరము కాదు.

శ్రీనాథుని యనంతరమునుండి ప్రబంధములు జడవాఱి ఓరీపాతమువలె నెడతెఱపి లేకుండ వర్షించినవి. ఈ ప్రబంధములందు హాస్యము 'కొత్తిమిరిప్రాయముగ'నైన లేదు.

ఆంధ్రలోకమున అంధపరంపరగా తెనాలి రామలింగని గూర్చి హాస్యకథలు పెక్కు జనాదరణము వడసి విశేషవ్యాప్తిలోనున్నవి. రామలింగఁడు హాస్యకవిజాణయని జనశ్రుతియే కాని ఆతని 'పాండురంగమాహాత్మ్యము'లోఁ బ్రౌఢకవిత్వమే కాని కేవల హాస్యరసప్రధానములగు పద్యములు చతురత్వము లేనివారికైనను గానరావు

దూష్యశృంగారము చిప్పిలు పద్యములన్నియు శ్రీనాథుని మెడఁగట్టుట ఆంధ్రకవిపండితులకు వృద్ధాచారమైనట్లే మోటుసరసమును, ముతుకహాస్యమును గల కథలు తెనాలి రామలింగనికి ముడిపెట్టుట ఆంధ్రకవిపండితులకు అనుస్యూతాచారమై ఉన్నదని నా నిశ్చితాభిప్రాయము.

'పాండురంగమాహాత్మ్యము'లోని 'నిగమశర్మ యెత్తుగడలు' మందహాసజనకములని రామలింగని వెనుకవేసికొని

వచ్చి కొండఱు సర్దుబాటుగా చెప్పవచ్చును. హాస్యకవితా ధురంధరుఁడని ఆంధ్రప్రపంచమున అపారయశముగాంచిన తెనాలి రామలింగనికి 'నిగమశర్మ యొత్తుగడలు' హాస్యరసపోషణవిషయమున పిసరంతైన యశోగౌరవము లాపాదింపవని అట్టివారికి నా చేయుమనవి. 'నిగమశర్మ యొత్తుగడ'లలో నిజమైన హాసనము మఱుఁగుపడియే యున్నది.

ప్రౌఢకవి మల్లన 'రుక్మాంగదచరిత్ర'లో సంభావన బ్రాహ్మణులకు వికారనామము లొసంగి తక్కువరకపు హాస్యము వాడియున్నాఁడు.

'నిరంకుశోపాఖ్యాన' మను ప్రబంధము రచించిన కందుకూరి రుద్రకవి హృదయంగమమగు హాస్యము పోషించియున్నాఁడు. పరికింపుఁడు:

చ. కలశపయోధిమీఁదఁ దరఁగల్ మఱి హోయని మ్రోయ వేయుభం
గుల తలపాన్పు పాము బుసకొట్టఁగ నేగతి నిద్రచెందెదో
యలసతిఁ దండ్రి! చీమచిటుకన్నను నిద్దుర రాదు మాకు నో
బలవదరీ దరీ కుహరభాస్వదరీ యదరీ దరీ హరీ!

—శతకము

'చీమ చిటుక్కుమనిన మాకు నిద్రరాదుగదా, అట్టిస్థితిలో క్షీరసాగరమునుండి నిరంతరము వెల్వెడలు ఉత్తుంగ తరంగమాలికల హోరులో- తలపాన్పు పాము కన్నుబున్నులలో నీకెట్లు సుప్తికల్గును?' యని సందేహనివారణార్థము బాలునివలెఁ గవి విష్ణుమూర్తిని అడుగుచున్నాఁడు.

ఇందలి హాసనము అనుభవైకవేద్యమే కాని విడమర్చి చెప్పఁజాలము. దేవతాపరమైన యిట్టి హాస్యము నిర్బాధకమగుట సర్వజనసమ్మతమును, సర్వవిధముల శ్లాఘాపాత్రమును,

ఈ కాలపువారగు సారంగు తమ్మయ్య, చెదలువాడ మల్లయ్య అను కవులు తమగ్రంథములందు ఉండీఉండనట్లుగా హాస్య ముపయోగించిరని చెప్పుకొని సంతోషింపవచ్చును.

కదరీపతి శుకసప్తతిలో, నారాయణకవి హంసవింశతిలో ఎడనెడ హాస్యరసపు ఛాయలు ఉన్నవి. శుకసప్తతిలోని ప్రతిబంధపుఁబేరఁటాలికథలో చక్కని హాస్యమున్నది.

ఉండుఁగాక! ఆంధ్రప్రబంధములందు హాస్యరసాన్వేషణమునకుఁ గడఁగుట ఏరుపిడకలలో హీరమణు లారయుటే అని మాత్రము అందరును అంగీకరించి తీరవలయును.

'అసలే సోమిదమ్మ, అందులో వేవిళ్ళ'ని నట్లు, ఇంత వఱకు నంజుకొనుటకైన చాలీచాలనట్లుగా నున్న హాస్యరసమునకు ఇప్పుడు మఱియొక రోగము తగిలినది.

పచ్చిబూతులే హాస్యరసపరిపోషణమునకు ముఖ్యపరికరములను దురభిప్రాయము ఈనాఁటి ఆంధ్రకవులలోఁ దాడు వాఱినది. చంద్రరేఖావిలాపము; కవిచౌడప్ప, వేణుగోపాల, రామలింగేశ శతకములు చవిఁజూచినవారలకుఁ బై విషయ మనుభవపునరుక్తమగును.

కుంటికి గూను తోడైనట్లు రానురాను బూతులు హాస్యరససంపోషణమునకు అవశ్యపరికరములని దురభిప్రాయపడుట యేగాక వానిని సుగుణములుగాఁ గూడఁ బరిగణించిరి.

అట్లగుటనే జగ్గకవి 'బూతులన్ బూర్ణుఁడ'వని కృతిపతి తన్నుగ్గడించిన ట్లాడంబరముగాఁ జంద్రరేఖావిలాపమునఁ జెప్పికొన్నాఁడు; బూతులబుంగయగు తన ప్రబంధమునకు సాదృశ్యముగా నేకవులును కృతిఁజెప్ప నేరరని తన్ను మిన్నగా శ్లాఘించుకొన్నాఁడు.

'హాస్యకవిజాణ' యని రఘునాథరాయల పేరోలగమందును- 'కొంటి కోణంగి' యని ఆంధ్రపండితప్రకాండులచేతను మెండుగాఁ గొండాడఁబడుచున్న కవిచౌడప్ప ఈ సందర్భమున నేమనెనో చూడుఁడు:

క. పది నీతులు పదిబూతులు
పది శృంగారములు గల్గు పద్యములు సభం
జదివినవాఁడే యధికుఁడు
గదరప్పా కుందవరపు కవి చౌడప్పా!

క. నీతులకేమి యొకించుక
బూతాడక దొరకు నవ్వుపుట్టదు ధరలో
నీతులు బూతులు లోక
ఖ్యాతులురా కుందవరపు కవి చౌడప్పా!

బూతాడఁగూడదనువారిని దలవాఁచ చీవాట్లుపెట్టి వారినోళ్ళ నీతఁడెట్లు నొక్కెనో చూచితిరా:

క. బూతు లెగదుదురు తమతమ
తాతలు ముత్తాతమొదలు తరతరముల వా
రే తీరున బూతెఱిఁగిరి
ఖ్యాతిగ మతి కుందవరపు కవి చౌడప్పా!

కంటిరా!

'పదిబూతులు సభలోఁ జదివినవాఁడే యధికుఁడఁట- బూతాడక నవ్వు పుట్టదఁట- బూతులు లోకఖ్యాతులఁట'- పాపము! ఇది కేవలము కాలదోషము.

నీతిబాహ్యవర్తనమునెడ సామాన్యజనులకు డోఁకు పుట్టించుటకిట్టి బూతులావశ్యకమని వారూహించిరి కాబోలు!

ఈ రోగము మన ఆంధ్రమునకే పట్టలేదు. సంస్కృత

మునకును గల అంటురోగమే. ప్రతాపరుద్రీయమందలి హాస్య రసలక్ష్యములు తిలకించినవారికే నావచనములందలి సత్యము సకలము విదితమగును. ఇంకను అనుమానము వీడనివారు కాళిదాసప్రహసనమని నామాంతరముగల లంబోదరప్రహసన మొక్కసారి చిత్తగించిన నిజము తేటతెల్లమగును.

బూతులమాట మఱచితిమేని చంద్రరేఖావిలాపము నిజముగా హాస్యరసప్రబంధరాజము. ఇందలి హాస్యము చాల వఱకు సంఘదురాచారతిరస్కారప్రతిపాదకము.

ఈర్ష్యచేతనే యనుకొనుఁడు, జగ్గకవి యీ గ్రంథము రచియించినది. ఎట్లయిననేమి దీనిని వెల్వరించి ఆంధ్రసారస్వతమున నూతనమార్గగామి యైనాఁడతఁడు. అనుకరణము మన కవులకు గోణముకట్టుటాదిగల గుణమే యైనను ఏలకో చంద్రరేఖావిలాపమునకుఁ బ్రతిబింబములు బయలుదేఱలేదు. అది ఒకవిధముగా మన యదృష్టమే.

ముప్పదియేండ్ల అమ్మాయియగు చీపికన్నుల చంద్రి (చంద్రరేఖ) నలుబదియేండ్ల అబ్బాయియైన చిడుముపొక్కుల సింగరాజును వలచి- వలపించి- వలంగొనైవై చికొనుటయే ఇందలి ఇతివృత్తము.

ఇం దపూర్వవిషయ మొకటి కలదు. వీరభద్రతెంబళికి నరసింగార్యనంబి వాక్రుచ్చినదఁట యీ వృత్తాంతము. ఆంధ్ర కవులు కనివిని యుండని విచిత్రమిది! దేవాలయపు టర్చకులు విధ్యుక్తవిధుల విడిచి పదుపుముచ్చట్లతోఁ గాలక్షేపము చేయుచుండిరనికదా ఇందు గర్భితమైయున్న అధిక్షేపము.

తమ కాలమునాఁటి జనతాస్థితిని గావ్యదర్పణములందుఁ బ్రతిఫలింపఁజేయుట ప్రతిభావంతులగు కవుల చమత్కారము.

ఇట్టి విషయములు మన సారస్వతమునం దరిది. మొన్న మొన్నటి బొబ్బిలిచరిత్రముకుండ నారదుండే ఇంద్రునకు నివేదించినట్లు రంగరాయచరిత్రమునఁ గలదు. ఇది ఎంత అసంభవముగా నుండునో పాఠకమహాశయులే యూహించుకొందురుగాక! జగ్గకవి ఈ అపూర్వవిషయప్రతిపాదనమునందు విశేష ప్రతిభాప్రాగల్భ్యముఁ జూపి సంఘదురాచారతిరస్కారము చమత్కారముగా, నాగరకముగాఁ బనివానితనముతోఁ జేసియున్నాఁడు.

కవికాలమునాఁటికే పూర్వపుఁ గట్టుబాట్లను బాసి దేశమున గౌరవమును గోల్పోయిన బ్రాహ్మణసంఘమును కవి ఒకానొక పాత్రముచే నెట్లు హాస్యజనకముగా తిట్టించినాఁడో తిలకింపుఁడు:

క. ఓంభూలం చేసికొంచును
జంధంబులం గొట్టుకొంచు జడమతి నకుభా
రంభము లరయుచుఁ దిరిగెడి
దంభపు విప్రునకు నీకుఁ దగ దిది చనుమా.

సంఘవిషయకమును, అట్లయ్యు అబాధకమును నగు నిట్టి చమత్కారహాస్యము పరిపోషించిన జగ్గకవి బుద్ధివైశద్యమసదృశము, అపారము, విశేషించి శ్లాఘాపాత్రము.

హాస్యరసపోషణమునకు బూతులే ప్రధానములని యూహించిన కవిచౌడప్ప సమయిత మొక్కొక్కచోఁ బ్రసాదమైన హాస్య ముపయోగించియున్నాఁడు. మచ్చునకు:

క. ఆడిన మాటలు దప్పిన
గాడిద కొడుకంచుఁ దిట్టఁగా విని మదిలో

వీఁడా కొడుకని యేడ్చును
గాడిదయును కుందవరపు కవి చౌడప్పా!

అనుదానిని చేకొనవనగును. ఇందలి హాస్యము మనోహరమై ఇంపునింపుచున్నది.

పిండిప్రోలు లక్ష్మణకవి మొదలగువారు శ్లేషకవిత్వము స్వార్థమునకు, శత్రుదూషణమునకు, ప్రతిపక్షతిరస్కారమునకు వాడుకొన్నట్లె అడిదము సూరకవి, కూచిమంచి తిమ్మకవి, జగ్గకవి మున్నగువారు హాస్యమును తమకుఁ గిట్టనివారలను తిట్టుటకుఁ బనిముట్టుగా నుపయోగించిరి. నిదర్శనముగా వేణుగోపాల, రామలింగేశ, కుక్కుటేశ్వర శతకములను బరిశీలింపనగును.

ఆధునికయుగమందలి హాస్యరసపరిపోషణము విమర్శింప దొరఁకొనుటకు మున్ముందు భాముకలాపములు, యక్షగానములు మున్నగు వీథినాటకములందును; చాటువులందును; శతకములందును గల హాస్యము మన సందర్శనమును, విమర్శనమును వాంఛించును.

పగటి భాగవతులు అసభ్యమైన హాస్యమునకుఁ బుట్టినిండ్లు. 'గొల్లకలాపము' వినిపించు వేశ్యాంగనల వెనువెంటఁ దప్పక విదూషకుఁ డొకఁడుండును. ఇట్టి విదూషకులు చెప్పు వినోదములు సాధారణముగాఁ బచ్చిబూతులతోఁ దెప్పలు తేలుచుండును. పామరజనసమ్మతమగును గాని ఈ బూతుహాస్యము నాగరికులకు, రసికులకు అనిష్టజనకమై, హేయమై భావించుటకుఁగూడ నాభాసపాత్రమై, జుగుప్సాకరమై యుండును.

కమ్మని పప్పులో ఘాటైన పచ్చిమిరియపుఁగాయ కొంత

కించినట్లు నిద్రాదేవికిఁ దమదేహముల ధారాదత్తముచేసి మాగన్నుఁగొన్న ప్రేక్షకులలోఁ జులుకు పుట్టించుటకుఁ గల్పింపఁబడియుండును ఈ హాస్యము. అగుటనేకాఁబోలు నాటకములందు హాస్యనిర్వాహణమునకై విదూషకుఁ డను ప్రత్యేక పాత్ర ననుసంధించుట.

ఇఁక చాటుధారల నెత్తికొందము:

తెలుఁగు చాటువులలో సాత్త్వికమును, సరసమును, సరళమును నగు హాస్యము చిలికి చిమ్ము పద్యరత్నములు పరశ్శతములుగా నున్నవి.

ఈక్రింది చాటుధార నారయుఁడు:

క. 'మీరుం బాగఁ ద్రాగుదురా?
వారిజభవ! వామదేవ! వైకుంఠహరీ!'
'ఓరీ! నారద! వినురా
యీరేడు జగంబులందు నిది ముఖ్యమురా!'

'మీరుగూడఁ బాగ త్రాగుదురా?' యని నారదులవారు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను బ్రశ్నించినాఁడఁట. బ్రహ్మ మానసపుత్రుఁడు సృష్టిస్థితిలయకారుల నెంతటి ఉత్కృష్ట విషయమునుగూర్చి పృచ్ఛించినాఁడు! వా రాతనితో 'ఈరేడు జగములలోఁ బొగాకు ముఖ్య'మనిరఁట. ఔరా! ఎట్టి చమత్కారహాస్యము, ఆ రసమున కవధియో యనిపించున్న దీ పద్యము.

అసలుకు మించిన కొసరు. దిగువ కందమును కనుగొనుఁడు. శివుఁ డద్రి శయనించుటకు, విష్ణువు శేషశాయి యగుటకు, రవిచంద్రులు మింటనుంటకుఁ గారణము మీకుఁ దెలి

యునా? తెలియకున్న ఈపద్యము చదివి తెలిసికొనుఁడు. బాగు పడియెదరు.

క. శివుఁ డద్రిని శయనించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపైఁ
బవళించుట నల్లి బాధ పడలేకసుమీ!

మర్యాదకు మఱియొకటి చిత్తగింపుఁడు:

చాఁకలివానిపైఁ జమత్కారముగాఁ జెప్పఁబడిన దీ దిగువ గీతము:

ఆ. వె. చాకివానితోడ జగడాలు పడలేక
సిరిగలాఁడు పట్టుచీరఁ గట్టె
శివుఁడు తోలుగప్పె సీయని మదిరోసి
భైరవుండు చీర పాఱవైచె.

వైద్యహాస్యమను పేర మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకశాలలో గల ఒకానొక అముద్రితగ్రంథములోని క్రిందిపద్యములు చక్కని హాస్యమును పుట్టించునవిగా నున్నవి.

క. వాతం బధికంబైనను
నూతంగల నీరు దెచ్చి నూరు ఘటంబుల్
సాతతముగ జలమార్చిన
వాతంబులు గొట్టు దొడ్డవార్తలు బుట్టున్.

గీ. అర్ధసేరు సీస మమరంగఁ దెప్పించి
గరిటెలోను చమురు గాఁగఁబోసి
చెముడువాని బిలిచి చెవులోను బోసితే
గూబ గాలి చెముడు కుదురుచుండు.

సీ. దాహంబునకు బంటు దాడిమామిడికాయ
మేహంబునకు బంటు మిరపకాయ

వాతంబునకు బంటు లేతగుమ్మడికాయ
శ్లేష్మంబునకు బంటు చికుడుకాయ
పైత్యంబునకు బంటు పచ్చిబొబ్బరికాయ
శైత్యంబునకు బంటు చింతకాయ
రోగంబునకు బంటు తీగబచ్చలికాయ
యారోగ్యములకెల్ల నరటికాయ
గీ. శ్వాసలకు బంటు పందిరిదోసకాయ
గండుతీటకు బంటు దూలగొండికాయ
జిహ్వారోగంబులకు బంటు చెమ్మకాయ
విషములకు బంటు తొలకరిముషిణికాయ.

'తీఁటగల భాగ్యశాలికిఁ' గ్రింది కందమందలి సమాచార మనుభవపునరుక్తమే:

క. తీఁటగల భాగ్యశాలికి
నీటుగలుగు గోళ్లు వేఁడినీళ్లు లభింపన్
దాటించి బఱుక సాగినఁ
దీఁటయె దేవేంద్రపదవి తిరముగ జగతిన్.

ఇందలి హాస్యము నిరుపమానముగదా!

'నానాఁటికిఁ దీసికట్లు నాగంభట్లూ' అన్నసామెత చతురతగాఁ బద్యమం దిమిడ్చి ఒక చాటుకవి ఎట్లు హాసము కలుగఁజేసెనో అరయుఁడు:

క. ఏనాఁటి యగ్రహారమొ
మానాఁటికి కంద్రికాయె మాపని దీరన్
మీనాఁడు మాన్యమాయెను
నానాఁటికిఁ దీసికట్లు నాగంభట్లూ.

అబాధకములును, అతిసుకుమారసుందరములును నగు

నిట్టి హాస్యపు చాటువులు ఆంధ్రసారస్వతమున మెండుకొని యున్నవి.

శతకముల నొకటి రెండింటి మన మీసందర్భమున సమీపించి పరామర్శింపవలయును, హాస్యరసాన్వేషణపరులమై.

మనలో విశేషప్రచారముగల 'వేణుగోపాల, కుక్కుటేశ్వర, రామలింగేశ్వర' శతకములు కొంతవఱకు మోటుక హాస్యముతో, జుగుప్సాకరములగు బూతులతో కూడియున్నవి. ఐనను ఆ శతకములలో నెడపఁదడప ప్రసాదహాస్యగర్భితములగు పద్యములుకూడ నున్నవి.

'మూర్ఖహృద్వ్యాభ్యాగతశూలమో' యన రచింపఁబడిన 'చంద్రశేఖరశతకము'నందు రుచ్యమగు హాస్యము కలదు. తమాషాకథలు గ్రామ్యభాషలోఁ జెప్పుచుఁ గవి యిందు హాస్య ముజ్జీవింపఁ జేయును. మాదిరికి నొక్కటి:

ఉ. సంగితకాడ పాడ కిక సాలిమ నీవది పాడినందుకున్
యింగిత మెంచి నేను మరి యిన్నదుకున్ సరిపోయె వింటివా
అంగున నే తలూపినటి అప్పుకు తంబుర యీడ మెట్టిపో
బంగుడు బాపనాడ యని పల్కుచు మూర్ఖుఁడు చంద్రశేఖరా!

ఈ హాస్యమున కాధారము 'నీవు పాడినందుకు, నేను విన్నందుకు సరిపోయింది, పైఁగా నేను తల ఊఁపినందుకు తంబుఱ యిచ్చిపో' అనెడి సామెత. ఇట్టివింకను ఆ శతకమునఁ బెక్కులున్నవి.

విస్తరభీతిచే నీ విషయ మింతటితోఁ గట్టిపెట్టి ఆధునిక యుగ హాస్యరసపరిపోషణస్వభావపరీక్షణమునకుఁ గలమున కనుజ్ఞనిత్తము:

ఆధునికయుగారంభములో నాంధ్రభాషాయోష కదృష్టపు రేఖ బయలుపడినదని జనవాక్యము. ఈ యుగమున తొలుదొల్త స్మరింపవలసినవారు వీరేశలింగముపంతులు.

ఆంధ్రభాషాపురోభివృద్ధి నాశించి సారస్వతమున నూతన మార్గముల నవలంబించి పలుత్రోవలు త్రొక్కిన పంతులు వారు సంఘదురాచారతిరస్కారప్రతిపాదక మగు హాస్యమును నెలకొల్ప నుద్యమించిరి. నూతనపథ మగుట వీరి యుద్యమ మంతయు నభినందనీయమైనను నిది ఆంధ్రభారతికి అంగ వికారము దెచ్చిపెట్టినేగాని అలంకార మొడగూర్పలేదు. వీరి గ్రంథములలో హాస్యరసప్రధానము లైనవి ప్రహసనములు, అభాగ్యోపాఖ్యానము; సత్యరాజపూర్వదేశయాత్రలు మొదలగునవి.

వీరి ప్రహసనములు సంఘదురాచారదూషణమునకు వ్రాయఁబడినవని ఇంతకుముందే నివేదించియున్నాను. దూషింపఁబడిన దురాచారములు క్రుంగుడుపోయినతోడనే వీనివ్యాప్తి తగ్గును. మఱియు నిట్టివి సర్వజనామోదకములు గావు అట్లగుట వానికి సారస్వతమున బలుకుఁబడియు, చిరస్థాయిత్వము లేదన్నమాట. స్టీలు, ఎడిసను వ్రాసిన సాంఘికవ్యాసము లాంగ్లసంఘసంస్కరణాభివృద్ధి యొనర్చినంతగా వీరిగ్రంథము లాంధ్రసంఘసంస్కరణ మొనర్పలేదు.

పంతులవారి 'అభాగ్యోపాఖ్యానము' బూతులు లేని 'చంద్రరేఖావిలాపము'నకు అచ్చుబొమ్మ. ఇందు వీరు వికృతాకారములును, వికారచేష్టలును వర్ణించుటచే హాస్య ముజ్జీవింపఁ బ్రయత్నించిరి. కాని ఇది సర్వోత్కృష్టమైన హాస్యము కాదు.

సత్యరాజపూర్వదేశయాత్రలందలి హాస్యముకూడ నించుమించుగా నీ కుదుటిలోనిదే.

పంతులవారి ప్రహసనము లాదర్శములుగ నిడుకొని చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు కొన్ని ప్రహసనములు రచియించిరి. సంఘాచారములందలి విపరీతములను, వింతయైన అలవాటులను వినోదవిషయములుగా మార్చి, వెక్కిరించి సంఘదురాచారములను పెల్లార్చుటే వీరి ఆశయమైనను ఈ ప్రహసనములు వ్రాయఁబడునప్పటికే ప్రాఁతపడి త్రుప్పుపట్టిన సాంఘికాచారములను కెక్కిరించి వెక్కిరించుటచే నివి ఆంధ్ర జనాదరణమును అంతగాఁ బడయలేదు.

జనాదరముఁబడసినను వీరి 'వినోదము'లందు సయితము స్వతస్సిద్ధమును, నవ్యమును నగు హాస్యము యిల్ల.

వీరి నాటకములందుఁగూడ సర్వోత్కృష్టమైన హాస్యము నాస్తి. వీరి నాటకములందలి విదూషకపాత్రలు వచించు హాస్యవచనములు జనపరంపరగా ముదుసళ్లనోళ్లనుండి వెల్వడుచుండు సామాన్యహాస్యవచనములే. వీరి నాటకములలోఁ జతురచంద్రహాసమున కొంచెము మెఱుఁగైన హాస్యము కలదు.

రూపకములందలి వీరి హాస్యము రుచిరమును, లలితమును, నవీనమును గాకపోయినను వీరి నవలలయందు సర్వోత్కృష్టము, సర్వజనాహ్లాదకరము నగు హాస్యము తాండవించుచుండును. ఆంగ్లనవలాకారులలో పేనుమిగిలిన ఛార్లెస్సు డికెన్సువలె వీరు నవలలందు ప్రసాదమైన హాస్యమును ఎడనెడ వాడి చదువరుల డెందమున కమందానందము సంధానింతురు. వర్ణనలయందును, సంభాషణలందును హాస్యరసము మేళవించి పండితకోటిని మెప్పించుటయే నవలారంగమున వీరిప్రతిభ.

వీరు 'హేమలత' – 'రామచంద్రవిజయము' – 'రాజ

రత్నము' లందు రుచిరము, లలితము, నవీనమునగు హాస్యరస మసదృశముగాఁ గూర్పునేర్పుతోఁ బోషించియున్నారు. వీరి 'గణపతి' హాస్యరసమున కవధి.

సంఘవిషయములఁగూర్చి అబాధకములగు చమత్కార కావ్యములు వ్రాసిన ఆంధ్రకవులలో దాసు శ్రీరాములుగా రగ్రగణ్యులు. వీరి 'తెలుఁగునాడు' లోనిది లలితమైన హాస్యము. మచ్చునకై :

ఉ. లేవరు రెండురెండవిన లేచినవారయినం దటాలునం
బోవరు పోవుచున్ నిలిచి 'పోదుము-పోదుము ప్రొయకుం'డటం
చీవరుసందు గేస్తు నలయింతురు పెండిలిలో సదస్యనం
భావన నాఁడు చూడవలె బాపనపాముల సాములన్నియున్.

అనునది చేకొనఁదగును.

ఇట్టి లలితరమ్యహాస్యమున కెంతయేని తావుకలదు, ఆంధ్రసారస్వతమున.

ఈ సందర్భమున తిరుపతి వేంకటకవులను మన మెన్నఁటికిని మఱవరాదు. శ్రీనాథుని తరువాత, అతనికంటె మిన్నగా, విరివిగా హాస్య ముపయోగించి ప్రబంధములు రచించినవారు ఆంధ్రకవీశ్వరులలో వీరే. శత్రుతిరస్కారమునకు హాస్య మాయుధముగ నెడపడప నుపయోగించినవారేయయ్యు వీరు పలుతావుల మనోహరహాస్యరససంపోషణ మొనర్చి ఆంధ్ర భారతికి అలంకారమును, ఆరోగ్యమును చేర్చి కూర్చినారు.

ఉదాహరణముగా రెండుమూఁడు పద్యరత్నములు చేకొననగును.

మ. ఒకయోగానికిఁ జిన్నికుట్టునికి నాయమ్మకర్మ చేయించి దా
నికినై కాని యొసంగి 'తక్క సగముల్ దెమ్మన్న' నా చేతికే

దకటా!’ నాఁగను క్షౌరపుంగృతికిఁ దా నంగీకృతింజొన్ప లౌ
భ్యకులాయమ్మగు ముద్దరాలి చరితం బాలించితే తిర్పతీ!

ఉ. గారెల పిండివంటకయి కొంతుఁడు కొంతను బృచ్ఛసేయ నా
సారస నేత్ర క్రే లొకటి చయ్యనఁజూపి ‘యిదొక్కఁడున్న దా
ధార! మటన్న సామెతగ......

—గిరతము

స్త్రీబాలజనైకవేద్యమ్ములగు నిట్టి కథలు సంభాషణ శైలికి మిక్కిలి సమీపమగు శైలిలోఁ జెప్పి మందహాసము కల్గించుటయే వీరిప్రతిభ. అదియే వీరౌనర్చు చమత్కారము.

ఇట్టి వినోదకథలఁ జొప్పించి హాస్య ముజ్జీవింపఁ జేయుటయే గాక ‘వైదికవాద స్తము’ – ‘కుండలలోఁబాండిత్యము’ – ‘యంత్రబ్రహ్మ’ – ‘కొండుభొట్లుకుఁ బరీక్షా’ – ‘గడే కారు’ మొదలగు నవ్వుతాలిమాటలు వాడి వీరు లలిత హాస్యము పోషించియున్నారు.

ప్రబంధములలో ఇంత సొంపుగా, నింపుగా హాస్య ముపయోగించినవారు ఆధునికాంధ్రకవులందు మఱిలేరు.

‘ప్రతాపరుద్రీయము’– ‘కన్యాశుల్కము’– ‘వరశుల్కము’ ఈమూఁడును హాస్యరసప్రధానములగు ఆంధ్ర నాటకరాజములు. ఇవి ఆంధ్రజనాదరణము బడసినవి. అయినను వీనియందలి హాస్యము సర్వోత్కృష్ట మను పాపమునకు నే నొడిఁగట్టఁజాలను.

సులభసుందరగ్రాంథికభాషనడుమ స్వైరయుక్తమగు గ్రామ్యభాషను, తురక ‘కి’ షష్ఠిఁ జొన్పి మాటలాడించి నవ్వించుటయే ప్రతాపరుద్రీయమందలి హాస్యము.

తెలుఁగుముక్కలలో వచ్చీరాని ఇంగ్లీషుముక్కలు

గుచ్చెత్తి దొర్లించి పాత్రలచే మాట్లాడించి హాసప్రహాసముల జనింపఁజేయుట కన్యాశుల్కమునందలి నవ్వునకుఁ గారణము.

అరవ తెలుఁగువలన వరశుల్కనాటకమున హాస్యము పోషింపఁబడినది.

మూఁడు నాటకములలోఁగూడ హాస్యము గ్రామ్య భాషవలనను, 'నానాభాషల సంకరసోమయాజుల' కలగాపుల గప్పుఁదెలుఁగువలనను కలుగుచున్నది. అంతియేకాని గ్రంథ కర్తల రచనాసామర్థ్యముచేఁ గాని, హాస్యరసప్రవీణతచేఁ గాని, ప్రజ్ఞాచమత్కారముచేఁ గాని కల్గుటలేదని ఘంటా పథముగ వాకొని వాదింపవచ్చును.

ఆంధ్రసారస్వతమున హాస్యరసక్షేమమును బోఁద్రోలిన వారు పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులు. హాస్యరస తారాపథమున మనకు వారు శుక్రతార.

పంతులవారు హాస్యరసప్రయోగమున కూలంకష ప్రజ్ఞాధురీణులు. హాస్యరసమును వీరు సర్వతోముఖముగ వాడియున్నారు. ఈవిషయమున వీరు చొఱబాఱని దారులు లేవు; నాట్యముచేయని సారస్వతరంగములు లేవు; ముట్టని విషయములు లేవు. ఎత్తికొనని ప్రస్తావనలు లేవు. హాస్యరస విషయమున వా రన్నియు నుచ్ఛిష్టముగావించి వదలివేసి రనుట అత్యుక్తి కాదు.

వీరి హాస్యరసమును విభాగించి విమర్శించుట ఈచిన్ని వ్యాసమున తలకుమీఱిన పని యగును.

నవ్వు జనింపఁజేయుటకు మార్గములు తలవెంట్రుకలన్ని. అందు కొన్నిటిని చేకొని పరామర్శింతము.

గ్రంథమునందు వచ్చుపాత్రములు చేయు కార్యములచే

హాసము జనింపఁజేయుట యొకమార్గము. ఈమార్గమును వీరు 'కంఠాభరణము'- 'సరస్వతి' నాటకములందుఁ ద్రొక్కియున్నారు.

గ్రంథకర్త వచనరచనాచమత్కారముచే, కలగాపులగపు భాషచే నవ్వించుట వేఱొకమార్గము. ఇట్టిది వీరి గ్రంథములందు సర్వత్ర సాధారణముగాఁ గానిపించుచునే యుండును. ఒక నిదర్శనము: వంటలవాఁడనై పొట్ట నెట్లట్లో గడుపుచున్నా ననుటకు బదులు డొంకతిరుగుడుగా 'మహానసాంతరచిత్రాన్నదధ్యోదనరచనాసమర్థుఁడనై' యున్నా ననుటచే నెవనికి నవ్వురాదు ?

సంఘదురాచారములఁ బరిహసించి హసింపఁజేయుట యింకొక మార్గము. ఇది వీరి 'సాక్షి' వ్యాసరాజములందుఁ గావలసినంత.

ప్రతిపక్షులపైఁ బగదీర్చికొనుటకు వారిగ్రంథములను బరిహాసపాత్రములుగఁ జేసి నవ్వించుట వేఱొకమార్గము. ఇది వీరి 'విమర్శాదర్శవిమర్శాదర్శము'న కాననగును.

ఈప్రతిపక్షదూషణవిషయికహాస్యము మనకు అడిదము సూరకవి, కూచిమంచి సోదరకవులు నేర్పినది. దీనినే వీరేశలింగముపంతులు కొక్కొండవారిపైఁ బ్రయోగించి ఆధునికయుగమున ఇట్టిహాస్యప్రయోగమునకుఁ బితామహులైనారు. ఈవిషయమున అతికిఁ బరుగిడక మోతాదుగా నుండినందులకు లక్ష్మీనరసింహారావుపంతులుగారు స్తుత్యులు.

సర్వతోముఖమగు వీరిహాస్యము ప్రత్యేకించి విపులముగా విమర్శింపవలయునే కాని ఇట్టి చిన్నివ్యాసమున అంటీఅంటనట్లుగా, నాపామాషీగా తాఁకి వదలవలసినది కాదు.

౪

# కవి తిక్కనవంశకథ

తిక్కనకవి సోమయాజి, నియోగిబ్రాహ్మణుఁడు, గౌతమ గోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు. అతని వంశీయులు లౌకికాధికారధుర్యపాలురై, కీర్తివిస్తారులై వెలుఁగొందిన శక్తిమంతులు.

కొట్టరువు మూవెనమంత్రి తిక్కనవంశమునకు మూల పురుషుఁడు. ఈతఁడు 'త్యాగవ్రతశీలుఁడు'; 'అమలినాచారుఁడు'; 'నానాగుణమణి': 'ఆగమకోవిదుఁడు.'

మూవెనమంత్రినందనుఁడు కేతన; ఈతఁడు శూరుఁడు. ధీరుఁడు; 'తేజోవిభవాభిజాత్యముల' గణనకెక్కిన సుప్రసిద్ధ పురుషుఁడు, కేతన కమ్మనాటిని బరిపాలించిన త్రిభువనమల్ల దేవచోడున కమాత్యుఁడు.

ఈ కేతనమంత్రి నాచమాంబయందు ౧. గుండన, ౨. భాస్కరుఁడు, 3. మహేశ్వరుఁడు అను మువ్వురు కొమాళ్లఁ బడసెను.

ఇట్లు పడసిన పుత్రత్రితయమునందు రెండవవాఁడగు

భాస్కరమంత్రి

ఆంధ్రమహాపురుషులగు కవితిక్కన, ఖడ్గతిక్కనలకుఁ బితామహుఁడు. భాస్కరమంత్రి 'ఆర్యశిరోమణి'; గుంటూరి విభుఁడు; 'సారకవితాభిరాముఁడు'; 'శాపానుగ్రహశక్తియుక్తుఁడు'; 'సాహిత్యవిద్యాపారీణుఁడు'; 'విబుధశ్రేయస్క

రుఁడు'; 'అర్థార్థిలోకావనవ్యాపారవ్రతుఁడు'; 'అమలాచారుఁడు'; 'గౌరీపతిశ్రీపాదప్రవణాంతరంగుఁడు'; 'ధర్మమార్గపథికుఁడు.'

పండ్రెండవ శతాబ్దాంతమున నాంధ్రభూమి పూర్వచాళుక్యచోడచక్రవర్తుల పాలనలో నుండెను. చందవోలు రాజగు పృథ్వీశ్వరమహారాజు పూర్వచాళుక్యచోడచక్రవర్తులకుఁ బేరునకుమాత్రము ప్రతినిధియై విక్రమసింహపురము మొదలుకొని సింహాచలపర్యంత మాకాలమునఁ దెలుఁగు మాగాని నేలుచుండెను.

మన భాస్కరమంత్రి ఈపృథ్వీశ్వరమహారాజు నధికారముక్రింద గుంటూరుసీమను బరిపాలించి ప్రథితకీర్తి సముపార్జించెను. కావుననే ఈతఁడు దశకుమారచరిత్రమునందును, నిర్వచనోత్తరరామాయణమునందును గుంటూరివిభుఁడుగాఁ బేర్కొనఁబడినాఁడు.

ఈ మంత్రిభాస్కరుఁడే ఆంధ్రమునఁ దొలుఁదొల్త రామాయణము రచియించెననియు, ఆపుస్తక మాయనపేరనే భాస్కరరామాయణ మని వ్యవహరింపఁబడుచున్నదనియు, ఏకారణముననో ఆగ్రంథమునం దరణ్యకాండముతప్ప తక్కిన కాండము లన్నియు నుత్సన్నము లయ్యెననియు, ఆ యుత్సన్న భాగములను హుళక్కి భాస్కరాది కవిపుంగవులు పూరించిరనియుఁ గాళ్లులేని కథయొకటి మనలో వ్యాపించియున్నది.

సత్యప్రియు లీకథన మంగీకరింపఁజాలరు.

భాస్కరమంత్రి తాతతండ్రులు కృష్ణామండలములోని వెల్లటూరిలో నివసించిరి. ఉద్యోగధర్మమున భాస్కరా

మాత్యుఁడు తననివాసము వెల్లటూరినుండి గుంటూరునకు మార్చుకొనియెను.

భాస్కరమంత్రికి కొమ్మాంబయందు ౧. కేతన, ౨. మల్లన, 3. సిద్ధన, ౪. కొమ్మన అను సుతచతుష్టయము కల్గెను.




భాస్కరమంత్రియొక్క ఈనలుగురు పుత్రుల వంశాభివృద్ధుల విడిగాఁ దెలిసికొందము.

## 1
## కేతన

ఇతఁడు భాస్కరమంత్రి జ్యేష్ఠపుత్రుఁడు. కేతన పితామహునకువలెఁ గమ్మనాటిచోడరాజాస్థానమునందు గొప్ప కొలువులు చేసి ప్రభుసన్మానములంది ప్రసిద్ధిచెందినవాఁడు. అభినవదండి విరచితమైన దశకుమారచరిత్రమం దీకేతనమంత్రి ఇట్లభివర్ణింపఁబడినాఁడు:

చ. కవితకు ముఖ్యుఁ డీతఁ డనఁ గామితవస్తువు లిచ్చువాఁడు నా
నవరసభావకుం డితఁ డనన్ బురుషార్థపరాయణుండు నా
నవునవ రాజనీతివిషయజ్ఞుఁ డితం డనఁ గీర్తిచంద్రికా
ధవళితదిక్కుఁడై నెగడె ధన్యుఁడై కేతనమంత్రి యిమ్మహిన్.

—ఆ. ౧, ప. ౩౭.

ఇతఁడు బ్రహ్మమాంబయందు ౧. భాస్కరుఁడు, ౨. గుండన, ౩. నల్లసిద్ధన అను ముగ్వురు సుతులఁ బడసెను. అభినవదండి వర్ణనమునుబట్టి కేతనామాత్యుని పుత్రులును, పౌత్రులును అఖండితశౌర్యదానములచేఁ గీర్తిగౌరవములు పొంది వెలుగొందిరని నిర్ణయించుట సాహసమును, సత్యదూరమును గానేరదు.

(కేతన వంశవృక్షము)




## 2

### మల్లన

మల్లన భాస్కరమంత్రిద్వితీయపుత్రుఁడు. ఇతఁడును

అగ్రసోదరునకువలెనే కమ్మనాటిచోడులయొద్ద మంత్రిత్వము వహించినవాఁడు.

మల్లనమంత్రి మిక్కుటమైన దేహదార్ఢ్యము కలవాఁడు; ప్రతాపశాలి; 'భాగ్యసమగ్రుఁడు'; 'పరమదయాపరతంత్రుఁడు'; 'హరిపూజాపరుఁడు.'

ఈతఁడు మాచమ్మయందు మనుమసిద్ధి యను పుత్రరత్నమును బడసెను. దశకుమారచరిత్రమం దీమనుమసిద్ధి ఇట్లు వర్ణింపఁబడినాఁడు:

సీ. సుకవి జిహ్వాచకోరికలకుఁ దనకీర్తి
పదనైన చంద్రాతపంబు గాఁగ
నాపదార్తజనసస్యములకుఁ దనకృపా
దానాంబు వమృతంపువాన గాఁగ
వనితాజనుల మాపులను తూఁపులకుఁ దన
ప్రన్ననిమేను లేపంబు గాఁగ
మహనీయ నృపనీతిమణులకుఁ దనమాట
లాలితశాణోపలంబు గాఁగ
ఆ. వె. వినుతి కర్హుఁ డయ్యె వివిధవిద్యాభ్యాస
చరితుఁ డభవచరణ సరసిజాత
మధుకరాయమానమానసుం డప్రతి
మానవిమలబుద్ధి మనుమసిద్ధి.

—ఆ. ౧., ప. ౩౦.

(మల్లనవంశవృక్షము)

మల్లన=మాచమ్మ

|

మనుమసిద్ధి

## 3

### సిద్ధన

సిద్ధన భాస్కరామాత్యుని తృతీయపుత్రుఁడు. అన్న దమ్ములు నలువురిలో నితఁడు మిక్కిలి ప్రయోజకుఁడు.

విక్రమసింహపురవిభుఁడగు తిక్కజననాథాగ్రణికి ఆప్త మంత్రియు, సేనాపతియు నై కీర్తికెక్కిన దీసిద్ధనామాత్యుఁడే. ఉదాత్తనృపనీతియం దితఁడు బృహస్పతిసమానుఁడు, 'సామాద్యుపాయపారగుఁడు.' ఇతనిసాయమున తిక్కజననాథుఁడు తన రాజ్యమును గాంచీపురముపర్యంతము విస్తరించెను.

సిద్ధనామాత్యునకుఁ బ్రోలాంబయం దేడ్వురు తనయులు జనన మొందిరి.

(సిద్ధన వంశవృక్షము)

సిద్ధన=ప్రోలాంబ

(ఖడ్గ) తిక్కన=చానమ్మ | భాస్కరుఁడు | కేతన | మల్లన | నారాయణ | పిన్నభాస్కరుఁడు | పెమ్మన

(తిక్కన=చానమ్మ): సిద్ధన | కొమ్మన | ఇమ్మడి | ముమ్మడి

### సిద్ధనామాత్యుని అగ్రనందనుఁడగు
### తిక్కన

కొట్టరువువారి వంశములో సుప్రసిద్ధపురుషుఁడు. ఈతఁడు వీరధర్మము నెఱపి రణతిక్కన, ఖడ్గతిక్కన అను పౌరుషనామము లందినాఁడు.

ఈ తిక్కన అన్వయోద్ధారకుఁడు. తిక్కజననాథాగ్రణి

యనంతరమందు విక్రమసింహపురమున రాజ్యమేలిన మనుమ సిద్ధిరాజునొద్ద ఇతఁడు సేనాని; మంత్రిమణి.

ఎఱ్ఱగడ్డపాటియేలికయగు కాటమరాజునకును, మనుమ సిద్ధిరాజునకును పసులమేపుబీళ్ల విషయమై పొసఁగిన పోరునందు విక్రమపౌరుషాదులు నెఱపి వీరస్వర్గము సూఱలాడిన దీర్ఘన్య చరిత్రుఁడే. ఈతనిభార్య వనితాశిరోమణియగు చానమ్మ.

దశకుమారచరిత్రమం దీ రణతిక్కన ఇట్లు వర్ణింపఁబడి నాఁడు:

సీ. వేఁడిన వర్థార్థి వృథపుచ్చ నేరని
దానంబు తనకు బాంధవుఁడు గాఁగ
నెదిరిన జముఁడైన బ్రదికిపోవఁగ నీని
శౌర్యంబు తన కిష్టసఖుఁడు గాఁగ
శరణుచొచ్చిన శత్రువరుఁడైన రక్షించు
కరుణయె తనకు సంగడము గాఁగఁ
బలికినఁ బాండవప్రభుఁడైన మెచ్చని
సత్యంబు తనకు రక్షకుఁడు గాఁగ
తే.గీ. జగతి నుతికెక్కె రాయవేశ్యాభుజంగ
రాజ్యరత్నాకరసుధాంశుమూర్తి రాజమూర్తి
గంధవారణ బిరుద విఖ్యాతకీర్తి
దినపతేజుండు సిద్ధయ తిక్కశౌరి.

—ఆ. ౧., ప. ౭౭.

ఖడ్గతిక్కనభవనము నొకకవి కమనీయముగ వర్ణించి యున్నాఁడు. చూడుఁడు:

సీ. విరళవాదంబు వేదనినాదంబు
పాయక యెప్రొద్దు మ్రోయుచుండు

భూసురప్రకరంబు సేసలు చల్లఁగఁ
బాయ కెన్నియో కుటుంబములు బ్రదుకు
బ్రాహ్మణావళికి ధారలుపోసిన జలంబు
సతతంబు ముంగిట జాలువాఱు
రిపులకొసఁగిన పత్రికలపుత్రికలను
బాయక కరణముల్ వ్రాయుచుంద్రు
తే. గీ. మానఘనుఁడైన తిక్కనమంత్రి యింట
మదనసముఁడైన తిక్కనమంత్రి యింట
మహితయశుఁడైన తిక్కనమంత్రి యింట
మంత్రిమణియైన తిక్కనమంత్రి యింట.

—చాటుధార.

'నెల్లూరుప్రాంతమునఁ గల పట్టుపురాయిగ్రామానకుఁ దూర్పుభాగమునఁ బినాకినీనదీతీరమునఁ దిక్కనపా డను స్థలము గలదు. అస్థలమందు గుట్టమీఁద రాతిను జెక్కిన శిల యొకటి నేఁటికిని గలదు. అది తిక్కనప్రతిమ యని స్థలజ్ఞులు చెప్పుదురు. ఈవిషయము ప్రాచ్యలిఖితపుస్తకభాండాగార మందలి చారిత్రకసంపుటములం దున్నది.'

(చాటుపద్యమణిమంజరి. ౧-వ భాగము)

## 4

### కొమ్మన

కొమ్మన భాస్కరమంత్రి కడగొట్టుతనయుఁడు; కేతన, మల్లన, సిద్ధనల 'కూరిమితమ్ముఁడు.' తండ్రియనంతరమం దీకొమ్మన గుంటూరిసీమను బరిపాలించెను. ఈతఁడు 'దండా ధీశుఁడు;' 'పవిత్రశీలుఁడు;' 'సాంగవేదవేది.'

గుంటూరిసీమను బరిపాలించు సమయమున నీతఁడు

చందవోలురాజగు పృథ్వీశ్వరరాజు అధికారముక్రింద నుండెను. పదమూఁడవశతాబ్దాదిని విక్రమసింహపురాధీశ్వరుఁడు, తెలుఁగు చోడుఁడు ఐన తిక్కరాజు ఉక్కుమిగిలి పృథ్వీశ్వరరాజు నోడించెను. అట్లగుట నాపృథ్వీశ్వరరాజు తెలుఁగుచోడుల కొలువుంలోఁ బ్రవేశించుటయు, నేలికతోఁబాటు కొమ్మనదండ నాథుఁడుకూడ తిక్కరాజుకొలువులోఁ జేరుటయు, నిజస్థానము గుంటూరినుండి నెల్లూరుకు మార్చుటయు సంభవించెను.

కొమ్మన లౌకికాధికారధూర్వహుఁ డగుటయే కాక వైదికాచారనిష్ఠాపరుఁడై వేదములను సాంగోపాంగముగ నభ్యసించిన ప్రాజ్ఞుఁడు.

(కొమ్మనవంశవృక్షము)

కొమ్మన=అన్నమాంబ
|
కవి తిక్కన
|
కొమ్మన

దశకుమారచరిత్రయం దీతఁ డీవిధముగ నభివర్ణింపఁ బడినాఁడు.

సీ. స్వారాజ్యపూజ్యుఁడో కౌరవాధీశుఁడో
నాఁగ భోగమున మానమున నెగడె
రతినాథుఁడో దినరాజతనూజుఁడో
నాఁగ రూపమున దానమున నెగడె
ధరణీధరేంద్రుఁడో ధర్మసంజాతుఁడో
యనఁగ ధైర్యమున సత్యమున నెగడె
గంగాత్మజన్ముఁడో గాండీవధన్వుఁడో
యనఁగ శౌచమున శౌర్యమున నెగడె

తే. గీ. సూర్యవంశజ భూపాల సుచిరరాజ్య
వనవసంతుండు బుధలోకవత్సలుండు
గౌతమాన్వయాంభోనిధిశీతకరుఁడు
కులనిధానంబు కొట్టరు కొమ్మశౌరి.

—ఆ. ౧., ప. ౮౧.

సదాచారసంపన్నయు, సుగుణశీలయు, మహాపతివ్రతయు నగు అన్నమాంబ ఈతని కులవధూరత్నము. ఆమెను గేతనకవి ఇట్లని వర్ణించినాఁడు:

సీ. పతిభక్తి నల యరుంధతి పోలె నేనియు
సౌభాగ్యమహిమ నీసతికి నెనయె
సౌభాగ్యమున రతి సరియయ్యె నేని భా
గ్యంబున నీయంబుజాక్షి కెనయె
భాగ్యంబునందు శ్రీ ప్రతియయ్యె నేనియుఁ
దాలిమి నీలతాతన్వి కెనయె
తాలిమి భూదేవి తగసాటియగు నేని
నేర్పున నీపద్మనేత్ర కెనయె
తే. గీ. యని యనేకవిధంబుల నఖిలజనులు
పొగడ నెగడెఁ గృపాపరిపూరితాంత
రంగ కొమ్మనామాత్యు నర్ధాంగలక్ష్మి
యఖిలగుణగణాలంకృత యన్నమాంబ.

—ఆ. ౧., ప. ౮౪.

కులనిధానమైన కొట్టరు కొమ్మశౌరి, అఖిలగుణగణాలంకృతయగు అన్నమాంబల పుత్త్రుఁడు మహాకవియైన తిక్కన సోమయాజి.

## కవితిక్కన

తిక్కన సోమయాజిని అభినవదండి ఇట్లు అభివర్ణించు చున్నాఁడు:

సీ. సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁ డనిన వీఁ
డను వాలుకకుఁ దొడవైనవాఁడు
చిత్తనిత్యస్థితశివుఁ డెవ్వఁడనిన వీఁ
డను శబ్దమున కర్థమైనవాఁడు
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁడనిన వీఁ
డని చెప్పుటకుఁ బాత్రమైనవాఁడు
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁ డనిన వీఁ
డని చూపుటకు గుఱియైనవాఁడు
తే. గీ. మనుమసిద్ధిమహీశ సమస్తరాజ్య
భారధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
కొట్టరువు కొమ్మనామాత్యు మూర్తిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి.

—దశకుమారచరిత్ర: ఆ. ౧., ప. ౭౭.

ఈతఁడు భారతములోని విరాటపర్వముదొట్టి పదేను పర్వములను 'ఆంధ్రావళి మోదముం బొరయ,' 'బుధసంతోషంబు నిండార' నాంధ్రీకరించిన కవిబ్రహ్మ, కావ్యశిల్పి. 'భారతీసుస్థితిసంభావితపదసదనుఁడు;' 'నిఖిలకళాసంవేది'; 'పండితపుండరీకనవపంకజబాంధవుఁడు'; 'దానపయోధారాపల్లవితవిప్రధాత్రీజుఁడు.' తిక్కన శుభచరిత్రుఁడు; నృపమాన్యుఁడు; చతురాననసన్నిభుఁడు; బలసూదనవిభవుఁడు; అమాత్యశేఖరుఁడు.

తిక్కనసోమయాజి నిజస్థానము నెల్లూరుపురము. అతని

తాతయుఁ దండ్రియు గుంటూరిపురవాసులే. అయినను తిక్కన తండ్రి కొమ్మనదండనాథుఁడు తన యేలికయగు పృథ్వీశ్వరగాజపజయ మొందిన బదంపడి నిజస్థానము గుంటూరనుండి నెల్లూరుకు మార్చుకొనియెను.

మఱియు దశకుమారచరిత్రయందు మూలఘటిక కేతనకవి 'నా రచింపంబూనిన కృతి కధీశ్వరుండైన కొట్టరువు తిక్కనామాత్యునకు నిజస్థానంబగు విక్రమసింహపురంబు వర్ణించెద' నని విస్పష్టముగ వ్రాయుచున్నాఁడు.

అట్లగుట నెల్లూరే తిక్కనసోమయాజి నిజస్థానమనుట యం దసత్యతాసంశయమునకుఁ దావులేదు.

అభినవదండిచే వర్ణింపఁబడినట్లు తిక్కన 'అభిరూపభావభవుఁడు.' అతని తల్లియగు అన్నమాంబయు, తండ్రియగు కొమ్మనయు సురూపయుతులు. సుందరదంపతులకుఁ బుట్టిన తిక్కకవిరాజు స్ఫురద్రూపి యగుటలో విరుద్ధ మేమున్నది?

కేతనవచనములలో తిక్కన- 'కనకగిరితటీసంకాశవక్షస్థలీభాగుఁడు'; 'శ్రీరమణీరమణీయమహోరస్థలివిజితకాంచనోర్వీధరవిస్తారితబలుండు;' 'కల్పకపరాభవకరణధురీణదీర్ఘబాహుండు'; 'జలజనుభగనేత్రుఁడు'; 'వియన్మణితేజుఁడు'; 'పవిత్రమూర్తి.'

వీనినిబట్టి తిక్కనామాత్యుఁడు విశాలవక్షుఁడనియు, బలకాయుఁడనియు, ఆజానుబాహుఁడనియు, సువిశాలనేత్రుఁడనియు, తేజోమూర్తి యనియు మనము నిర్ణయింపవచ్చును.

తిక్కన కవిమాత్రుఁడే కాఁడు. అతఁడు యోధుఁడు. గంటము బట్టుకొని కవితారంగమున నెంతి స్వేచ్ఛగా విహరింపఁగల్గునో కరవాలము గీలించి కదనరంగమున నంతి

స్వేచ్ఛగా విహరింపఁగల్గిన పరాక్రమశాలి, తిక్కన పితృపితామహులవలె వాహినీపతిత్వము వహించిన వీరుఁడు. 'తిక్క దండాధీశా!;' 'తిక్కచమూపా!' అని అభినవదండి అనుసంధించిన సంబోధనలబట్టి మన మావిషయము నిశ్చయమని నమ్మవచ్చును.

తిక్కన బొడ్డుమాణిక్యముగాఁ బుట్టిన యదృష్టశాలి. ఆతని పితృపితామహులు రాజాస్థానములందు గొప్పకొలువులు చేసి ప్రభుసన్మానము లంది సిరిసంపదలతోఁ దులఁదూగిన భోగదేవేంద్రులు. తిక్కకవినాథాగ్రణియు మనుమసిద్ధిమహీవల్లభునకుఁ గరుణాపాత్రుండై నిజకులక్రమాగతమగు మంత్రిపదవి నధిష్ఠించి,

గీ. అందలంబు గొడుగు లడపంబు వీఁకట్టు
చామరములు జమలిశంఖములును
గంబగట్లు భూమి కానికగాఁగఁ బెం
పెసఁగు రాచపదవు లెల్లఁ బడసి.

—దశకుమారచరిత్ర: ఆ. ౧., ప. ౨౧.

సంపత్సమేతుండై రాజ్యసుఖము లనుభవించిన సుఖవాసి.

మనుమభూపాలునివలనఁ బొందిన ఐశ్వర్యమును మాత్రమే కాక కవితిక్కన గణపతిదేవచక్రవర్తివలన నెనిమిదిగ్రామములను, విశేషమైన యైశ్వర్యలాభమును బొందినాఁడు.

కావుననే, ఆతఁడు అష్టైశ్వర్యములఁ జూఱలాడిన అనుభోగి యనుట.

కవితిక్కన నెఱదాత; 'సతతదానవినోది;' పితృపితామహులవలె దానధర్మము లొనర్చి ఆశ్రితభరణుండై పేరు

పొందిన విద్వద్భోగభాగ్యుఁడు. యాగాదిబహువిధకర్మ లొనర్చి భూరిదక్షిణలచే సర్థార్థులఁ దనిపిన ఈవికాఁడు తిక్కకవి. అతఁడు 'కావ్యరసముం గొనియాడి' విద్వద్గరిష్ఠులకుఁ బెక్కుల్లు అగ్రహారములుగా నొసఁగిన 'బుధారాధనవిరాజి,' విశేషించి 'కవిసరోజమార్తాండుఁడు.'

తిక్కన 'సుకవీంద్రబృందరక్షకుఁడు.' ఆనాఁటి ఆంధ్ర సారస్వతప్రపంచమునంతను నిరంతరముగఁ బరిపాలించిన కవి రాజు.

ఉభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునఁ బారగుఁ డగుటచేఁ గవితచెప్పి యీయుభయకవిమిత్రు మెప్పింప నాఁటివారు తపస్సు ధారపోసిరి. సోమయాజి తాను గావ్య శిల్పియుఁ, గవిబ్రహ్మయు నగుటయేగాక సమకాలమువారల కవితారసమును గ్రోలి హృదయపూర్వకముగ వారలకు మెప్పు లందించి రసపిదుఁడుకూడ నైనాఁడు.

అతఁడు కేతనామాత్యవిరచితమైన దశకుమారచరిత్రకుఁ గృతిభర్త. భోజరాజీయము రచించిన యనంతామాత్యుని ప్రపితామహుఁడగు బయ్యనమంత్రికి 'భవ్యభారతి' అను బిరుద మిచ్చి గౌరవించిన కవితారసజ్ఞుఁడు. మార్కండేయపురాణము రచించిన మారనకు గురువు.

ప్రథమాంధ్రమహాకవియగు నన్నయభట్టారకుని 'ఆంధ్ర కవిత్వవిశారదుఁ'డని, 'విద్యాదయితుం'డని కొండాడిన విశాల హృదయుఁడు. వ్యాసభగవానుని 'భవ్యకవితావేశుఁ'డని నుతించిన 'కళావిదుఁడు.' తిక్కన శిష్యులఁ జేరఁదీసి కవితాభిక్ష పెట్టిన సారస్వతాభిమాని.

తిక్కన మనుమసిద్ధిమహీవల్లభుని మంత్రిమాణిక్యము.

అతఁడు 'సామాద్యుపాయవిదుఁడు;' 'నీతిచాణక్యుఁడు;' విశేషించి 'నీతినిపుణమతిజితపురుహూతామాత్యుఁడు.'

ఒకప్పుడు మన్మక్ష్మాపాలుఁడు రాజ్యరమఁ బోఁగొట్టుకొనఁగాఁ దిక్కన తన ప్రతిభా విశేషముచేఁ దిరిగి దానిని సంపాదించినాఁడు.

అక్కనబయ్యన లను సిద్ధిరాజుజ్ఞాతులు పోటగులై నెల్లూరిపై దాడినడచి మన్మభూపాలు నోడించి రాజ్యము నాక్రమించి తముకుఁదామే పరిపాలన చేయఁదొడఁగిరి.

తిక్కన 'రాజనయవిధాప్రయోజనవిశారదుఁ డగుట మనుమసిద్ధిపక్షము వహించి కాకతిగణపతిదేవచక్రవర్తిసముఖమునకుఁ బోయి సకలము నివేదించి 'నయవచస్సమగ్రతాచతురాస్యుఁ' డనిపించుకొనియెను. సోమయాజుల పటువాక్యశక్తికి మెచ్చి, యతనిని బహుప్రకారంబులఁ బూజించి, యెనిమిదిగ్రామము లొసఁగి, నవలక్షధనమును యజ్ఞకుండలములు నిచ్చి, ఆతని రాయబారమును శిరసావహించి కాకతీయాంధ్రచక్రవర్తి అపారసైన్యసమేతుఁడై దాడివెడలివచ్చి, అక్కనబయ్యనల నుక్కడించి మనుమసిద్ధిని బునరభిషిక్తుని గావించెను.

బళిరా! తిక్కనసోమయాజి స్వామిభక్తి, కార్యదక్షత! చేజారిపోయిన రాజ్యమునే తిరిగి సంపాదింపఁగల్గెను. సర్వజ్ఞుఁడగు మంత్రి సవదరించిన రాజ్యము సుస్థిరమై యుండుననుటలో నాశ్చర్యమేమి!

అట్లగుటనే తిక్కనను 'మన్మక్ష్మాపతిప్రాజ్యరాజ్యాంబునిధిశశి' యని కేతన సంబోధించియున్నాఁడు.

తిక్కన బ్రహ్మవేత్త. అతఁడు 'వేదాదిప్రకటవివిధ

విద్యాభ్యాసాపాదితమహత్త్వుఁడు'; 'సకలాగమార్థతత్త్వ విచారోదారుఁడు'; 'నానా వేద వేదాంగతత్త్వజ్ఞుఁడు.' భారత మందలి యాశ్వాసాద్యంతపద్యములం దిముడ్పఁబడియున్న ఉపనిషదర్థములఁ బరికించుచో తిక్కన 'వేదాదిసమస్తవిద్యావిభాసి' యని తెల్లమగును. శాంత్యానుశాసనికపర్వపాఠకులకు వేదాంతము, సాంఖ్యయోగము లందు సోమయాజికిఁ గల కుశలప్రవేశము తెలియవచ్చెడిని.

తిక్కన హిందూమతమును ఉద్ధరించినవారిలో నొకఁడు. ఆతఁడు గణపతిదేవచక్రవర్తి సభాభవనమున నద్వైతవాదమును సలిపి అనుమకొండనివాసులైన బౌద్ధులఁ జుల్కనగ నోడఁగొట్టి, బౌద్ధదేవాలయములఁ గూలఁద్రోయించిన హిందూమతాభిమాని.

తిక్కన కర్మిష్ఠి. కర్మకాండయం దాతనికి గాఢవిశ్వాసమున్నట్లు కనఁబడుచున్నది. 'మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుఁ' డాతఁడు. 'ఉదాత్తశ్రౌతస్మార్తకర్మతత్పరమతి;' 'వేదోదితకర్మవ్రతుఁడు;' 'సతతాధ్వరక్రియాకర్మఠపాణిపద్ముఁడు;' 'అధ్వరాబ్జదిననాథుఁడు;' 'సతతస్వాహాస్వధాదిశబ్దద్వయసంస్కృతహవ్యకవ్యసంతర్పితముఖశిఖిముఖనిలింప పితృవర్గుఁ' డై, 'వైదికమార్గనిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించిన' మహనీయచరిత్రుఁడు తిక్కన.

తిక్కన వినయనిధి. ఆతని సౌజన్యమును, వినయమును మెచ్చఁదగినవి. నాలుగుముక్కలు నోటఁబట్టగనే కన్నుమిన్నుగానక మా కుపమ మేమేయంచు గర్వించు దుర్విదగ్ధులవలెఁ గాక తిక్కన తాను కవిబ్రహ్మ, కావ్యశిల్పి యయ్యు సౌజన్యమును, వినయమును గోల్పోవని గభీరుఁడు.

ఈతని వినయసౌజన్యముల కీతనిగద్యయే ప్రబలనిదర్శనము. 'బుధారాధనవిధేయ;' 'బుధారాధనవిరాజి' అని వ్రాసికొనియున్నాఁడు. నిర్వచనోత్తరరామాయణమునందలి 'నూత్నసత్కవీశ్వరులను భక్తిఁ గొల్చి వారికృపన్ గవితావిలాసవిస్తరమహనీయుఁడైన నను' అనువాక్యమే సోమయాజి వినయసౌజన్యములను జాటిచెప్పు బూరగొమ్ము.

తిక్కన కుమారుఁడు కొమ్మన. కొమ్మననుండి యాతని వంశీయులు పాటూరివారయినారు. తిక్కన బహువిధయాగము లొనర్చి అర్థార్థులకు ధనము విరఁజిమ్ముటచే నాతని సంపద క్రమముగా నీడఁబోయినది. కావుననే కొమ్మన జీవయాత్రార్థము పాటూరికరణీకము సంపాదింపవలసినవాఁడయ్యెను. ఈ పాటూరు నెల్లూరున కైదారుమైళ్లదూరములో నున్న పల్లెటూరు. తిక్కనసంతతివా రిప్పటికిని ఆగ్రామమున నున్నారు.

తిక్కన ఆంధ్రమహాపురుషుఁడు; కూలంకషప్రజ్ఞాధురీణుఁడు; శ్రీమంతుఁడు; నిరర్గళధీమంతుఁడు; అముష్యాయణుఁడు; విశ్రుతవిశ్రాణుఁడు, కావ్యకళాజన్మభూమి; సారకవితానిర్మాణచాతుర్యుఁడు; నిరతిశయవివేకసాంద్రుఁడు; అన్వయోద్ధారుఁడు

అతఁడు ఆంధ్రఋషి; సోమయాజి; రాజ్యాంగవేత్త; బ్రహ్మవేత్త; కృతికర్త; కృతిభర్త; దండాధీశుఁడు, మంత్రిమాణిక్యము.

వేయేల? తిక్కన ఆంధ్రలోకమున అవతరించిన లోకోత్తరపురుషుఁడు; సర్వాంధ్రలోకపూజనీయుఁడు. కావున నతని నిట్లు కీర్తింతము:

సీ. సరసకవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
గొను ననుటధికకీర్తనకుఁ జెరువు
లలితనానాకావ్యములు చెప్ప నుభయభా
షలయందు ననుట ప్రశంసత్రోవ
యర్థిమైఁ జెకూర్చి నగ్రహారంబులఁ
గా నిచ్చుననుట పొగడ్తపొలము
మహితదక్షిణలైన బహువిధయాగంబు
లొనరించుననుట వర్ణనము దారి
తే. గీ. పరుని కొక్కని కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజములై పెంపుసొంపారి నెగడుపట్టి
కొమ్మనామాత్యుతిక్కని కొలఁది సచివుఁ
డింక నొక్కరుఁ డెన్నంగ నెంచఁ గలఁడు?
—దశకుమారచరిత్ర; ఆ ౧., ప. ౯౭.

౫

# తిక్కన నవ్వులు

కవిబ్రహ్మ తాను రచియించిన నిర్వచనోత్తరరామాయణ ములో, భారతములో అనేకవిధములైన 'నవ్వుల'ను ప్రయో గించియున్నాఁడు.

పలువిధములైన పరిస్థితులలో పలువిధములైన 'నవ్వు లను' ఆ కవిగ్రామణి వ్రాసియున్నాఁడు. ఆ పలువిధములైన నవ్వులతో నాతఁడు తన పాత్రల వ్యక్తిత్వమును లెస్సగఁ బరి పోషించుకొనినాఁడు.

నిదర్శనములను బరికింపుఁడు:

ప్రబలశత్రువు తనచేతులలో మడిసినను అర్జునుఁడు నవ్వఁడు. యుద్ధము ప్రారంభించు ప్రతిసారియు నతఁడు నవ్వును.

ఇఁక ధర్మరాజుసంగతి. అతఁడు గంభీరముగ నుండును. కాని తఱచు నవ్వఁడు.

'దుస్తరబలభాసి' యైన భీముఁడు తిక్కనరచనలో 'హర్షావేశలఘుచారిత్రుఁడు.' అతఁడు ఎప్పుడు నవ్వినను 'పెలుచ' నవ్వును.

శ్రీకృష్ణుఁడు అర్జునునితో సంభాషించునపుడు తఱచు నవ్వును.

శృంగారఘట్టములందు తిక్కన స్త్రీపాత్రలకు ప్రాయిక ముగా 'ఎలనవ్వు,' 'అల్లనవ్వు' మొదలయిన మృదుహాసములు హత్తించును. అనుశాసనికపర్వమున చతుర్థాశ్వాసమున

కైకేయీశాండిలీసంవాదమున తిక్కన ఒకపాత్రచేత స్త్రీలు 'పెలుచనవ్వురా' దని చెప్పించినాఁడు.

తిక్కన్నను చూచి తరువాతి తెలుఁగుకవులు పలువురు అతని నవ్వులను తమకావ్యములందు చక్కగా సంతరించుకొని నారు. ఆముక్తమాల్యదలోని అంకురితస్మితము, కాశీఖండము లోని కటికినవ్వు, ద్విపదహరిశ్చంద్రలోని మంచివెన్నెలవంటి మందహాసము మున్నగువానికి తిక్కన ఒరవడి పెట్టినాఁడన వలయును.

గౌరనమంత్రి విశేషప్రచారములోనికిఁ దెచ్చిన 'పకపక నవ్వు' కాని, శ్రీనాథుఁడు విరివిగా వాడిన 'ముసిముసినగవు' కాని తిక్కన వాడియుండలేదు.

తిక్కన రచియించిన మహాభారతములోని పదునైదు పర్వములును, నిర్వచనోత్తరరామాయణమును చదివినవారికి అతఁడు ముప్పదిరెండురకముల నవ్వులను వాడియుండుట స్పష్టమగును.

ఆ ముప్పదిరెండునవ్వులు ఏవి యనిన:

౧. పిన్ననవ్వు
౨. చిఱునవ్వు
౩. అల్లన నగవు
౪. అలతి నవ్వు
౫. మందస్మితము
౬. హర్షమందస్మితము
౭. అంతస్స్మితము
౮. జనితమందస్మితము
౯. ఉద్గతమందస్మితము
౧౦. అనాదర మందస్మితము
౧౧. సాదర దరహాసము
౧౨. తిన్నని నవ్వు
౧౩. లేఁతనవ్వు
౧౪. కొండొకనవ్వు
౧౫. పెలుచనవ్వు
౧౬. ఉబ్బుమిగిలిన నవ్వు
౧౭. గేలిగొను నవ్వు
౧౮. ఒత్తిలి నవ్వు

౧౯. అపహాసము
౨౦. రోషకలితసంబో హాసము
౨౧. ఉద్భటహాసము
౨౨. కలకల నవ్వు
౨౩. ఎలనవ్వు
౨౪. ప్రౌఢస్మితము
౨౫. బెట్టునవ్వు
౨౬. కన్నుల నవ్వు
౨౭. కన్నుల నిప్పులు రాల నవ్వు
౨౮. కినుకునూనిన నవ్వు
౨౯. కినుకుముసుంగు నవ్వు
౩౦. కటికినవ్వు
౩౧. నవ్వుగానినవ్వు
౩౨. ఎఱ్ఱినవ్వు

ఇందులో మొదటి పదునాలుగు చిన్ననవ్వులుగాను- ౧౫, ౧౬, ౧౭, ౧౮, ౧౯, ౨౦, ౨౧, ౨౨, సంఖ్యలుగలవి పెద్దనవ్వులుగాను- మిగిలిన పదియు గొప్పనవ్వులుగాను మనము విభజింపవచ్చును

ఈనవ్వులలో ప్రతిఒకదానికిని తిక్కన కావ్యమున పరమ ప్రయోజన మున్నది. ఆ ప్రయోజనగ్రంథము ప్రస్తరింపఁ దగినది.

పైనఇచ్చిన ముప్పదిరెండు రీతుల నవ్వులలో ఒక్కొక్క దానికి రెండుమూడు ఉదాహరణములను పరామర్శించుటవలన కావ్యమున ఆ నవ్వులమూలమున సాధితమైన పరమప్రయోజనము అవగత మగును.

# 1

## చిన్న నవ్వులు

### —: ౧. పిన్న నవ్వు :—

కర్ణార్జునుల ద్వంద్వయుద్ధమున

చ. అలిగి కడంగి సూతసుతుఁ డచ్యుతపార్థులఁ దీవ్రబాణపం
క్తులఁ బొదవం బరాక్రమకుతూహలి యవ్విజయుండు పిన్నన

వ్రాలని ముఖాంబుజంబునకు నొప్పఁగ దద్రథరథ్యకేతు సూ
తులను దదీయగాత్రమును దూపుల వెల్లి మునుంగఁజేసినన్.

—కర్ణ. ప. ౧౧౮, ప. ౨౮౯.

కర్ణుఁడు అలిగి కడంగి తీవ్రబాణపంక్తులతో పొదవినాఁడు. పరాక్రమకుతూహలి ఐన అర్జునుఁడు కర్ణుని పోటును పిన్ననవ్వుతో ఎదుర్కొనినాఁడు. శత్రుయుద్ధనైపుణ్యాతిరస్కారసూచకమైన ఈ పిన్ననవ్వు అర్జునుని వీరత్వమునకు ఒక మానదండమై ఉన్నది.

ఉద్యోగపర్వము తృతీయాశ్వాసము ౫౨-వ పద్యము, భీష్మపర్వము ప్రథమాశ్వాసము ౧౨౫-వ పద్యము, ద్వితీయాశ్వాసము ౨౮౯-వ పద్యము, తృతీయాశ్వాసము ౭౫-వ పద్యము, చతుర్థాశ్వాసము ౪౨-వ పద్యము మున్నగు తావులందు ఈ పిన్ననవ్వు ప్రయోగింపఁబడినది.

—: ౨. చిఱునవ్వు :—

పిన్ననవ్వు, చిఱునవ్వు ఇతరకవుల రచనలలో పర్యాయపదములు కావచ్చును. కాని తిక్కనరచనములో ప్రత్యేకప్రయోజనములను కలిగియున్నవి.

భారతమున శ్రీకృష్ణునిపరముగా ఉన్న రెండు చిఱునవ్వుఘట్టములను ముందుగాఁ బరామర్శింతము:

గాంధారి శ్రీకృష్ణునకు శాప మిచ్చుచు

1. తే. అరయ దిక్కెవ్వరును లేని యగ్గలంపుఁ
గుత్సితంపుఁ దెఱంగునఁ గూలువాఁడ
విట్లు మీవధూజనములు నేడ్చువారు
పతుల సుతులను బంధులఁ బనివి పనివి.

క. అని ఘోరంబుగఁ బలికిన
దీని విపులమనస్కుఁడైన విష్ణుఁడు చిఱువ

వ్వఁ నానన మొప్పఁగ న
వ్వనితకు నిట్లనియె గౌరవస్తుత్యముగన్.

—స్త్రీ. ఆ. ౨., ప. ౧౬౦.

2. అయోమయంబగు భీమప్రతిరూపంబు భగ్నంబుచేసి యది నిజమైన భీముఁడే యని పెంపున నెడఁద నిర్భర హర్షంబు నొందియు ధృతరాష్ట్రుండు యెదురుమెచ్చు నకై భీమునిం బేర్కొని హాహాకారంబు లెసంగ రోదనంబు చేసినఁ జిఱునవ్వునం దన వదనకమలంబొప్ప త్రికాలవేదియగు కమలనాభుఁ డతని కిట్లనియె:

తే. అడల నేటికి నీ చేతఁబడఁడు భీముఁ
డిప్రుడు భంజింపఁబడినది యినుపరూపు

—స్త్రీ. ఆ. ౧, ప. ౧౩౪.

విరాటపర్వము పంచమాశ్వాసము ౧౭౪-వ పద్యము; భీష్మపర్వము ద్వితీయాశ్వాసము ౧౨౨-వ పద్యము; ద్రోణపర్వము చతుర్థాశ్వాసము ౫౬-వ పద్యము; కర్ణపర్వము ద్వితీయాశ్వాసము ౨౩౦-వ పద్యము; తృతీయాశ్వాసము ౩౦౦-వ పద్యము; శల్యపర్వము ప్రథమాశ్వాసము ౧౩౯-వ ౧౬౦-వ పద్యములు; ద్వితీయాశ్వాసము ౯౭-వ పద్యము; శాంతిపర్వము ద్వితీయాశ్వాసము ౩౪౧-వ పద్యము; సౌప్తికపర్వము ప్రథమాశ్వాసము ౧౧౬-వ పద్యము; నిర్వచనోత్తరరామాయణము చతుర్థాశ్వాసము ౯౨-వ పద్యము మున్నగు తావులయందు ఈ చిఱునవ్వు ప్రయోగింపఁ బడినది.

చిఱునవ్వను తిక్కన కొన్ని తావులయందు చిఱుతనవ్వు అని కూడ వాడియున్నాఁడు. 'సెలవిపై చిఱునవ్వు చిలికెడు మోము' అనియు, 'చీఁకటి విరియించు చిఱునవ్వు' అనియు గౌరనమంత్రి హరిశ్చంద్రలో ఈనవ్వును ప్రయోగించినాఁడు.

—: 3. అల్లననగవు :—

ఈరీతి నవ్వునే 'అల్లనవ్వు,' 'అల్లని నగవు' అని కూడ తిక్కన పేర్కొనియున్నాఁడు.

ఈ అల్లననగవుకు కొన్ని నిదర్శనములు:

ఆ. కౌరవేశ్వరుండు గనువిచ్చి దిక్కులు
గలయఁజూచి పార్థుఁగాంచి కడఁగి
యదరఁజూచుటయును నమరనదీసూనుఁ
డతని కిట్టు లనియె నల్లనగుచు.

క. ఇంత యెఱుంగవు పైన్యము
లింతవడిం దలలు చీర లెఱుఁగక మోహా
క్రాంతంబులయ్యెఁ బనిదెగఁ
గాంతేయుఁడు సారఁడు గాని క్రౌర్యంబునకున్.

—విరాట: పు ౧౦౫. ప. ౨౧౪.

భీష్మపర్వము ద్వితీయాశ్వాసము ౧౬౯-వ పద్యము, తృతీయాశ్వాసము ౨౮౮-వ పద్యము, ౩౯౬-వ పద్యము, ద్రోణపర్వము ప్రథమాశ్వాసము ౩౮౧-వ పద్యము, ద్వితీయాశ్వాసము ౧౦౪-వ వచనము, కర్ణపర్వము తృతీయాశ్వాసము ౧౮౦-వ పద్యము, శల్యపర్వము ప్రథమాశ్వాసము ౨౧౭-వ పద్యము, సౌప్తికపర్వము ప్రథమాశ్వాసము ౧౦౦-వ వచనము, ౧౮౦-వ పద్యము, నిర్వచనోత్తర రామాయణము అష్టమాశ్వాసము ౩౮,౪౨ పద్యములు, దశమాశ్వాసము ౫౦-వ పద్యము, అనుశాసనికపర్వము ద్వితీయాశ్వాసము ౧౮౯-వ వచనము, తృతీయాశ్వాసము ౨౪౩-వ వచనము, అశ్వమేధపర్వము ప్రథమాశ్వాసము ౯౪-వ వచనము, ద్వితీయాశ్వాసము ౯౫-వ పద్యము, తృతీయాశ్వాసము ౩౬-వ పద్యము, చతుర్థాశ్వాసము ౭౬-వ వచనము, విరాటపర్వము ద్వితీయాశ్వాసము ౪౫-వ పద్యము, చతుర్థాశ్వాసము ౧౬-వ పద్యము మున్నగు తావులందు ఈనవ్వు ప్రయోగింపఁబడినది.

స్త్రీపాత్రలకు సాధారణముగ తిక్కన ఈనవ్వును హత్తించును. నిదర్శములు:

(1) నారదపంచచూడాసంవాదమున నారదుఁడు వనితా స్వభావమేర్పడ చెప్పుమనఁగా అవ్వనిత అల్లనగుచుఁ 'దగునయ్య వనితకు వనితల దుశ్చేష్టితములు వాక్రువ్వంగన్' అనియె.

—అనుశాసనిక. ఆ. ౨, ప. ౧౬౯.

(2) శునస్సఖునికి అరుంధతి పతివ్రతాధర్మము చెప్పుచు అల్లనవ్వె.

—అనుశాసనిక. ఆ. ౩, ప. ౨౮౬.

—: ౮. అలతి నవ్వు :—

స్థూలదృష్టితోఁ జూచువారికి అల్లననగవు, అలతినవ్వు ఒక్కకుదుటికిఁ జెందినవిగాఁ దోఁచును. కాని తిక్కనరచనలో ఈరెండురకముల నవ్వులకును ఎంతో అంతరువు ఉన్నది.

అలతినవ్వుకు నిదర్శనము:

ద్రోణుని ఐదవనాఁటి యుద్ధమున దుర్యోధనుఁడు పాండవబలమువలన చీకాకునొందిన కురుసైన్యంబును రక్షింపుమని కోరఁ గర్ణుఁ డుబ్బి 'నాదు నాతెంపును బెంపునున్' అని బీరములు పల్కె. అది చూచి కృపాచార్యుండు అలంతినవ్వుతో 'మును ఘోషయాత్రను బదంపడి గోగ్రహణంబునందుఁ బేరుగొనిన నీకు నిట్ల నుట దగు, కొవ్వులు దక్కుము.' అని కర్ణుని ఉపాలంభించెను.

—ద్రోణ: పుట ౨౭౭. ప. ౬౮.

భీష్మపర్వము ద్వితీయాశ్వాసము ౧౭౩-వ పద్యము, శల్యపర్వము ప్రథమాశ్వాసము ౨౧౨-వ పద్యము, ద్వితీయాశ్వాసము ౩౯౭-వ వచనము, అనుశాసనికపర్వము చతుర్థాశ్వాసము ౪౧౬-వ పద్యము, అశ్వమేధపర్వము తృతీయాశ్వాసము ౧౪౫-వ పద్యము మున్నగు తావులందు ఈనవ్వు వాడఁబడియున్నది.

—: ౫. మందస్మితము :—

మందస్మితము సౌందర్యవర్ధకమని తిక్కన నిశ్చితాభిప్రాయము. రామాయణమునందును, భారతమునందును తిక్కన తన ఈనిశ్చితాభిప్రాయమును వెల్లడించియున్నాఁడు.

నిర్వచనోత్తరరామాయణము సప్తమాశ్వాసమున రావణుని దిగ్విజయము వినిపింపఁగా విని రాముఁడు:

మ. అనినం జిత్తము చోద్యమంద రఘువంశాధీశ్వరుం డిట్టులా
 తనికిన్ బీరము సెల్లెఁ గాని యొకటం దద్విక్రమక్రీడ మా
 న్ప నొకం డైనను జాలఁ డయ్యెనుడు భూపాలాగ్రణిం జూచి య
 మ్ముని మందస్మితసుందరుం డయి మనోమోదంబుతో నిట్లనున్.

భారతము కర్ణపర్వము ద్వితీయాశ్వాసము (పద్యము ౩౭౯)న

మ. .....రాధేయుండు దివ్యబాణనిహతిం గౌంతేయుసైన్యంబు వె
 ల్లను నొప్పించిన బీఱువోయె నది యుల్లాసోగ్రుఁడై ధర్మనం
 దనుఁ డమ్మేటి మగండు గిట్టుటయు వాతం డల్గి వెల్లేసినన్
 విను మందస్మితసుందరుండగుచు నవ్వీరుండు ధీరోద్ధతిన్.

అనియు తిక్కన మందస్మితసుందరసమాసమును వాడియున్నాఁడు.

మందస్మితముతోడనే సుందరశబ్దమును సమాసించుట విశేషమైనది. తిక్కన్న సుందరపదప్రయోగము ఉపజ్ఞామహితమైనది. కొన్ని నిదర్శనములు చూడుఁడు:

'ఉగ్రసుందరమైన రణము'
'అల్పకోపసుందరమైన వదనము'- అశ్వమేధ. ఆ4. ప31.
'సన్నాహసుందరమైన సేన'- ని. రా. ఆ 6-ప 24.
'వినయసుందరుఁడు'- ని. రా. ఆ 9- ప 97.

మందస్మితమునకు మఱియొక నిదర్శనము:

కర్ణుని ధాటికి ఓర్వలేక శిబిరముచేరిన ధర్మరాజు సేమం బరయుటకు కృష్ణార్జునులు పోయిరి. వారు రాధేయు వధించి వచ్చిరని తలంచి ధర్మరాజు డెందం బలర మందస్మితంబుతో నభినందించె.

—కర్ణ. పుట ౮౭ ప. ౫౮.

మందస్మితమునకుఁ బర్యాయపదములుగా మందహాసము, దరహాసము, దరస్మితము, కొంచెపునగవు మున్నగునవి తిక్కన వాడినాఁడు. ఈరకపునగవును గౌరనమంత్రి 'మంచివెన్నెల వంటి మందహాసము' అని అభివర్ణించినాఁడు.

తిక్కన రచనమున శృంగారలలితమైన మందహాసము నకు ఒకమంచి నిదర్శనము:

చ. అలసత యొప్ప నల్లన రతాంతమునం బ్రియునొద్దఁబాసి యె
 చ్చెలికడ కేగుదెంచు సరసీరుహనేత్రవిలోచనంబులం
 దలఁకెడు మందహాసము...

—ని. రా ఆ ౬., ప ౫౪.

హాసము, మందహాసము, దరహాసము, మందస్మితము, దరస్మితము, కొంచెపునగవు మున్నగు పర్యాయపదములతో వ్యవహరింపఁబడిన మందస్మితమునకు తిక్కన రచనములలోని ఇతర నిదర్శనములు:

మందహాసము

మందస్మితము

శాంతి. ఆ ౫. ప ౨౦౭.
భీష్మ. ఆ ౭. ప ౧౫౭.
ని. రా. ఆ ౩. ప ౮.
ని. రా. ఆ ౧౦. ప ౧౯.
అను. ఆ ౫. ప ౩౭౧.
ఆశ్వ. ఆ ౨. ప ౫.
విరా. ఆ ౧. ప ౧౯౨.
విరా. ఆ ౫. ప ౩౧౯.

*

కొంచెపునగవు

శాంతి. ఆ ౨. పు ౧౧.
ని. రా. ఆ ౩. ప ౫.

*

హాసము

దరహాసము

దరస్మితము

శాంతి. ఆ ౧. ప ౪౭.
కర్ణ. ఆ ౨. ప ౨౭౭.
కర్ణ. ఆ ౨. ప ౨౮౫.
కర్ణ. ఆ ౩. ప ౧౯౭.
శల్య. ఆ ౨. ప ౭౩.
ని. రా. ఆ ౩. ప ౨౪.
ని. రా. ఆ ౭. ప ౧౧.
విరా. ఆ ౧. ప ౨౦౪.
విరా. ఆ ౨. ప ౨౪౦.
ఉద్యో. ఆ ౧. ప ౧౦౩.
ఉద్యో. ఆ ౩. ప ౫౭.

—: ౬. హర్ష మందస్మితము :—

మందస్మితమునకు హర్ష శబ్దము ఉపసర్గగాఁ జేర్చి తిక్కన కల్పించిన వైశిష్ట్యము క్రింది నిదర్శనమువలన అవగతము కాఁగలదు.

తే. హర్షమందస్మితముతోడ నమ్మురారి
యప్పుడ హయముల మెయివెట్టునట్లు సేసి
తతిమి నీరులు ద్రావించి తడవి మగుడఁ
దెచ్చె మనయోధు లెల్లను బిచ్చలింప.

—ద్రోణ. పుట ౨౧౯. ప. ౧౬౩.

—: ౭. అంతస్మితము :—

'శుచిస్మిత'మని నన్నయ ఒకచో అపూర్వముగ ప్రయో

గించియున్నాఁడు. తిక్కన ప్రయోగించిన అంతస్స్మితము, జనితమందస్మితము, ఉద్గతమందస్మితము అను మూఁడును కూడ ఇట్లు అపూర్వమైనవే.

అంతస్స్మితము తరువాతిది జనితమందస్మితము. ఈ జనితస్మితమునే ఆముక్తమాల్యదకారుఁడు (చతుర్థాశ్వాసము 39-వ పద్యమున) అంకురితస్మిత మని వాడియున్నాఁడు. జనితమందస్మితము మీఁదటిది ఉద్గతమందస్మితము.

అంతస్స్మితమునకు నిదర్శనము:

తే. కన్నియల కాటగఱపుచు నున్న నీవు
నకట సైరంధ్రి యిప్పు డేమయ్యె దేని
ఖేద మొదవించుకయుఁ దేమిఁ గాదె పస్మి
తాననంబుతో నన్నిటు లడుగు టెల్ల.

అని ద్రోవదియనఁగా రిపుమర్దనంబు తనకు పేరవు గాకునికి గుప్తసాభిజ్ఞానంబుగాఁ దెలిపిన బలసూదన సూను పలుకులు విని పాంచాలి యంతస్స్మితకమనీయ కపోల యగుచు...

—విరాట. ఆ 3. పు ౪౯.

గుప్తసాభిజ్ఞానపు మాటలకు ఈ యంతస్స్మితము ఎంతయు అర్హమై ఉన్నదికదా!

—: ౨. జనితమందస్మితము :—

పాత్రల సంభాషణావసరముల ఇది పలుచోటుల వాడఁబడినది. 'నవ్వి ఆననసీమ తోఁప' మున్నగు ప్రయోగము లన్నియు ఈ కిందుటికిఁ జెందినవే.

జనితమందస్మితమునకు ఒక చక్కని నిదర్శనము:

జనకసులభాసంవాదసందర్భమున

క. తన లోచనదీప్తుల న
మ్మనుజపతి మొగంబునందు మల్లడిగొనఁ జే
సిన నమ్మహాత్ముఁ డప్ప
ద్మనయనతలఁ పెఱిఁగి జనితమందస్మితుఁడై.

—శాంతి. ఆ. ౩. ప. ౧౭౨.

—: ౯. ఉద్గతమందస్మితము :—

ద్రోణుని నాలవనాఁటియుద్ధమున అర్జునుఁడు సైంధవుని తలఁదునిమి కురుబలముల ధోడరి గెలిచినపుడు కృష్ణమూర్తి ఇట్లే కర్ణునికూడ నోర్చితివయేని నాకు ప్రీతియగు ననియె. అప్పుడు అర్జునుఁ డిట్లనెను:

చ. ..............మహాత్మ! భవత్కరుణం బ్రతిజ్ఞ యే
ను నెఱపఁగంటిఁ బాండవమనోరథసిద్ధి భవద్దయాసమృ
ద్ధి యగుట వింతయే భవదధీనులకున్ విజయంబు బ్రాఁతె నీ
పను బొనరించవార మట భారము నీయది గాదె యెప్పుడున్.

ఆ. అనుడు నుద్గతమందస్మితాస్యుఁ డగుచు
దనుజమర్దనుఁడు...

—ద్రోణ. ఆ. ౫., పుట. ౨౬౮., పద్యము ౧౦.

—: ౧౦. అనాదరమందస్మితము :—

పాంచాలీపాండవులు విరటుపాలఁ దమ మెలఁగవలయు పనుల నిశ్చయించుకొను సమయమున ధర్మనందనుఁడు ద్రుపదనందన కిట్లనియె—

క. మన వంశంబును వృత్తం
బును బెంపును గావఁజాలు పుణ్యసతివి దు
ర్జనులగు కులువల తలఁపులు
గనుఁగొని యేమఱక మెలఁగఁగావలయుఁ జూమీ!

వ. అనిన విని యూర్జ్ఞసేని యనాదరమందస్మిత సుందరవదనారవింద యై 'గౌరవభారం బెడలంగనీక పాతివ్రత్యాచారముమై వర్తింతురు సైరంధ్రీజాతి వారు' అనినది.

—విరాట: పుట. ౧౨., పద్యము ౧౧౧.

తిక్కనయొక్క ఈఅనాదరమందస్మితప్రయోగముతోఁ శ్రీనాథుఁడు శృంగారనైషధములో 'అయ్యంబుజాక్షి యక్షిభ్రూవిక్షేపవిభ్రమంబున ననాదరంబు దెల్పిన' దను ప్రయోగమును పోల్పవచ్చును.

—: ౧౧. సాదరదరహాసము :—

అనాదరమందస్మితమునకుఁ బూర్తిగా వ్యతిరేకమైనది సాదరదరహాసము. దీనినికూడ తిక్కన వాడియున్నాఁడు.

సాదరదరహాసమునకు నిదర్శనము:

అర్జునునకు ఉత్తరను అప్పగించుచు విరాటుండు

గాదిలికూఁతు నుపలాలించి బృహన్నలదెసం గనుంగొని సాదరదరహసితరుచిరాననుండై యిమ్ముగువ నీకు నాట గఱపందగు పాత్రంబగునే యని అడిగి...

—విరాట. ఆ. ౧, ప., ౨౮౮.

—: ౧౨. తిన్ననినవ్వు :—

తిక్కయజ్వ కల్పించిన చిన్ననవ్వులలో 'తిన్ననినవ్వు' అనున దొకటి.

నిర్వచనోత్తర రామాయణము సప్తమాశ్వాసము ౯౭-వ పద్యమున కవితిక్కన ఈనవ్వును వాడియున్నాఁడు. చూడుఁడు:

క. లీల నటు లసురవల్లభుఁ
గేలిపాత్రంబుఁ జేసి క్రీడించిన యు

వ్యాలి భవదస్త్రమున కర
పాలియుఁ జాలమి నుతింపఁజాలఁడె యొందున్.

క. అని మునిపతి యివ్విధమున
దనుజపతిం జెప్ప రామధరణీపతి తి
న్ననినవ్వు మెఱయ నాతని
వినితిమి యిఁక నొకటి వినఁగ వేడుక యనుచున్.

తిక్కన కల్పించిన ఈ తిన్ననినవ్వును గౌరనమంత్రి పుణికి పుచ్చుకున్నాఁడు. లోహితాస్యుని గురించి:

'తిన్ననినగ వాటించు నీమోము
కన్నులపండువుగాఁ జూడకున్న'

అని చంద్రమతి విలపించినట్లు ద్విపదహరిశ్చంద్రోపాఖ్యానమున గౌరన వర్ణించియున్నాఁడు.

ఈ తిన్ననినగవును తన తొలికబ్బమగు నిర్వచనోత్తర రామాయణములో వాడినంతగా తన మలికబ్బమగు భారతమున తిక్కన వాడియుండలేదు.

—: ౧౩. లేఁత నవ్వు :—

తిక్కన తన తొలికబ్బమున ఎక్కువగాను, మలికబ్బమున తక్కువగాను వాడిన చిన్నవవ్వులలో లేఁతనవ్వు ఒకటి.

సీ. అల్లన మధురంపు సల్లాపరచనకు
లేఁతనవ్వున నునుఁబూఁత పూయ

—ని. రా. ఆ ౧., ప ౫౫.

చ. ...వనపాలికాకగపుటీకలి త స్తబకంబు పుచ్చె మె
ల్పున పతి లేఁతనవ్వునఁ గపోలతలంబులఁ గాంతి వింతగాన్.

—ని. రా. ఆ ౮. ప ౨౫.

ఉ. సిగ్గును లేఁతనవ్వుఁ గదిసెం గమలానన ముద్దుమోమునన్.

—ని. రా. ఆ ౮., ప ౮౭.

అని ఇత్యాదిగా తిక్కన తనరామాయణమున రసోల్లాసమధురముగా ఈలేఁతనవ్వును పలుతావులఁ బ్రయోగించి ఉన్నాఁడు.

ఈలేఁతనవ్వును తిక్కన భారతమున సకృతుగమాత్రము వాడినాఁడు. నిదర్శనము:

సైరంధ్రిఁ జూచి రాగరసమగ్నుఁడైన కీచకుని వారించి చూచెదగాక యని సుధేష్ణ

సీ. తెలిగన్నుఁగవకు నెచ్చెలియైన లేఁతన
వ్వొలయంగ సరసంపుఁబలుకు వలికి

—విరాట: ఆ ౨., ప. ౪౮.

—: ౧౮. కొండొక నవ్వు :—

ఈనవ్వును తిక్కన తన తొలి, మలి కబ్బముల రెండింటి యందును సమానముగా వాడియున్నాఁడు.

నిదర్శనములఁ బరికింపుఁడు.

భారతమున అర్జునుఁడు వీరావేశంబునఁ గౌరవానీకంబు నాలోకించునప్పుడు ఉత్తరుఁడు

ఆ. పుట్టినంతనుండి యిట్టివి యెన్నఁడుఁ
గాన నెందుఁ బట్లు గాన చోద్య
మంది యంతరంగ మవశతఁ బొందిన
కతన నింద్రియముల కడఁక దక్కి.

తే. అనినఁ గొండొకనవ్వొలయంగఁ జూచి
యింద్రనందనుఁ డాతని కిట్లు అనియె

నేను గలుగంగ నీ కేమి యెలమి వాహ
నముల కుబ్బుగ సంచోదనంబు సేయు.

—విరాట. ఆ ౫., ప ౧౧౭.

అశ్వమేధపర్వము ప్రథమాశ్వాసము ౨౧౭-వ పద్య మునఁ గూడ ఈనవ్వు కూర్పఁబడియున్నది.

ఇఁక ఈనవ్వుకు రామాయణమునుండి ఒకనిదర్శనము:

రాముఁడు లోకాపవాదభీతుఁడై తన్ను విడనాడిన వృత్తాంతము లక్ష్మణునివలనఁ దెలిసికొని సీత చింతించి

క. పలుకు లుడిగి పెద్దప్రొ ద్దా
కులదృష్టి మఱందిఁజూచుఁ గొండొకనవ్వుం
దలయూఁచు ముక్కుపై నం
గుళి యిడు వెఱఁగందు వగలకుం గొలువిచ్చున్.

—ని. రా. ఆ. ౬., ప. ౧౯.

## 2

## పెద్దనవ్వులు

ఇట్లు తిక్కన తనరచనలందుఁ బదునాలుగు రకములఁ జిన్ననవ్వులను ప్రయోగించియున్నాఁడు. ఇఁక అతఁడు వాడిన పెద్దనవ్వులను పరామర్శింతము. అతఁడు ఏడురకముల పెద్ద నవ్వులను వాడియున్నాఁడు. వానిని వివరించుకొందము.

—: ౧౫. పెలుచనవ్వు :—

పెద్దనవ్వులలోఁ దొలుత చెప్పఁదగినది పెలుచనవ్వు.

తన గదాదండమునఁ దొడలు విఱిగిపడిన దుర్యోధనుని చూచి భీముండు 'పెలుచనవ్వి' తనవారిని నాలోకించి

ఆ. శంక లేక కడఁగి సభ కట్టు పాంచాలి
వంటరానిదాని నొంటిచీర

తోన యున్న సాధ్వి వేవలివట్టి యీ
డ్పించి నతనిఁ జూడుఁ డంచుఁ బొదలి.

—శల్య. పుట ౨౦౭, పద్యము ౨౫౨.

ఈ పెలుచనవ్వుకు మఱియొక నిదర్శనము.

భీష్ముని యష్టమదివసయుద్ధమున సునాభుఁడు విక్రమోద్ధతిఁతో భీముని

ఆ. ...దాఁకుటయు బకాంతకుఁ డంత్యకా
లాంతకుండువోలె నలిగి బొమలు
ముడివడంగ నొక్క వెడఁదయమ్ముఁ దల
నతికి బైచి పెలుచనవ్వె నధిప.

మఱిరెండు నిదర్శనములు:

కర్ణపర్వము ద్వితీయాశ్వాసము ౧౪౭-వ పద్యమున కాకి హంసను యుద్ధమునకు రమ్మనఁగా ఆ హంస పెలుచ నవ్వెను; నిర్వచనోత్తర రామాయణము చతుర్థాశ్వాసము ౧౬-వ పద్యమున రావణుఁడు వానరవదనంబు వట్టు లున్న నందిమొగ మప్డు దేరకొనంగఁ జూచి కడుఁ బెల్చ నవ్వెను.

ఈ రెండు నిదర్శనముల కేమిగాని మొదట నిచ్చిన రెండునిదర్శనములలోను పెలుచనవ్వినవాఁడు భీముఁడే. అనుశాసనికపర్వము చతుర్థాశ్వాసము ౩౪౭-వ పద్యమున కైకేయీశాండిలీసంవాదమున తిక్కన స్త్రీలు పెలుచనవ్వరాదని తెల్పి ఆసంగతి శాండిలిచేఁ జెప్పించినాఁడు. స్త్రీలకుఁ గూడ దని స్పష్టముగఁ దెల్పిన- ఇతర పురుషపాత్రలకు అంతగా హత్తింపని ఈ పెలుచనవ్వును తిక్కన భీమునకును, రావణునకును హత్తించుటలో విశేష మున్నది.

రావణుఁడు రాక్షసుఁడు. తిక్కనదృష్టిలో భీముఁడును ఇంచుమించు అట్టిఁడే. భీముఁడు 'వైరిని వ్రచ్చి పచ్చినెత్తు రెత్తికొని క్రోలిన క్రూరాత్ముఁడు' అతనిది 'వృకవిధము. అసురభంగి.' అశేషబంధుమారణమునకు ఆతని కెప్పుడును విచారము కల్గలేదు. భీమునినవ్వు హింసాప్రియము; హింసాకరము. శత్రుమారకసంతోషసూచకము.

—: ౧౬. ఉబ్బుమిగిలిననవ్వు :—

ద్రోణుని నాలవనాఁటి యుద్ధమున కురుకుమారుల నేవురఁ గూల్చిన భీము నొప్పించుటకై కర్ణుఁడు—

ఆ. కదిసి డెబ్బదేను గాండంబు లాతని
మేనఁ బఱపి యుబ్బుమిగిలి నవ్వె.

—ద్రోణ. పుట ౨౫౭., పద్యము ౨౧౩.

—: ౧౭. గేలికొనునవ్వు :—

హంసతో డీకొని పోరాడుచున్న కాకిని మాచి
ఇతర వాయసములు అధికస్వరంబుల మొఱయుచు
హంసంబుల గేలికొని నవ్వె.

—కర్ణ. ఆ ౨. ప ౬౭.

—: ౧౮. ఒత్తిలిననవ్వు :—

భారతయుద్ధానంతరము దుర్యోధనుఁడు అశ్వత్థామను పాండవులను పరిమార్చుటకుఁ బంచెను. ఆతఁడు కృతవర్మ కృపాచార్యులఁ దోడ్కొని పాండవశిబిరంబున కభిముఖముగా అప్పటికెలని కనతిదూరంబుగాఁ జని యారథికవరు లాలించి

క. అందలివార లెల్లను జయంబునఁ బొంగుచుఁ బేరలుంగు లం
దంద చెలంగఁగాఁ బలుక నార్వఁగ నొత్తిలినవ్వ నాకసం

బందినయట్టి క్రోఁత విని యక్కడవోవఁగ నుల్కి రఘ్రద
మ్యుం దడవన్ వడిన్ వెడలుమూఁకలు క్రోయుటగాఁ దలంచుచున్.

—సౌప్తిక. ఆ ౧., ప ౫.

—: ౧౯. అపహాసము :—

ఈ హాసమునకు కొన్ని నిదర్శనములు:

1. చ. కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజముఖ్యులు మత్స్యనుద్యమ
స్ఫురణము చూచి పార్థుఁ డనుబుద్ధిఁ గలంగఁగ......

అని ఉత్తరుఁ డనునప్పుడు తెల్పి దేశంబున నునికిం జేసి

క. విని ద్రుపదధరణిపతి నం
దన సామర్థ్యాపహాసతరళహృదయుఁడై
చని తద్వృత్తాంతము మె
త్తని పలుకులఁ జెప్పె నింద్రతనయునితోడన్.

—విరాట ఆ ౪., ప ౧౩.

2. గీ. అమ్మహీనాథుఁ డయ్యుపహాస మెఱిఁగి
బొమలు ముడివడఁ గనుఁగవఁ బొడముఁ గెంపు

—శల్య. ఆ ౨. ప ౯౮.

భారతములో ఉత్తరకుమారప్రజ్ఞలఘుట్టము అతివేల
మైన హాస్యమునకు ఆటపట్టు; కావున ఇక్కడ తిక్కన అప
హాసము ద్వారుక్తిగఁ బ్రయోగించినాఁడు.

కౌరవసేనాబలమునుచూచి భయపడి పరుగెత్తు ఉత్త
రుని పట్టుకొనబోవుచున్న అర్జునునిగాంచి కౌరవబలంబు
నందు

ఉ. అజ్ఞులు కొందఱప్పు డపహాసము సేయుచు గూఢరూపరే
ఖాజ్ఞతలేమిఁ దద్వికృతకాయమునీఁదను దృష్టినిల్పఁగా

విరాట. ఆ ౪., ప ౭౪.

—: ౨౦. రోషకలితంబౌ హాసము :—

మ. ...గ్రక్కున లేచి రోషకలితంబౌ హాస మానూఁతు నె
మ్మన ముద్వేగముఁ బొందఁజేయు బలసామగ్రి సముజ్జృంభణం
బున వానిందలవట్టి తంచుటయు నేపుం జేవయుందోఁప వాఁ
డనుమానింపక జెట్టదల్చికొని కోపాటోప దీప్తాంగుఁడై.

—విరాట. ఆ. ౨, ప., ౩౧౦.

—: ౨౧. ఉద్భటహాసము :—

గోగ్రహణమునాఁడు అర్జునుఁడు గౌరవసైన్యంబుల నుఱుమాడుచు నుద్భటహాసోల్లాసభాసురముఖుండగుచు.

—విరాట ఆ. ౪., ప. ౨౯.

—: ౨౨. కలకలనవ్వు :—

తిక్కన ఉపయోగించిన పెద్దనవ్వులలో ఇది చాల మనోజ్ఞమైనదిగ నున్నది.

ద్రోణుఁడు, భీష్ముఁడు మొదలగు పూజ్యార్హుల 'మాన్యులఁ జంపుట మగపాడిగాదు' అని అర్జునుఁడు 'భండనంబు సేయకుండువాఁడ'.........అనిన విని కలకలనవ్వి నారాయణుండు నగున కిట్లనియె—

చ. వగవఁగ నేమియుం దగనివారికినై హృదయంబు గుందఁగా
వగచెదు బుద్ధి మాటలును వావిరి నాడెదు నీవు పండితుల్
వగతురె యున్నవారికి నవశ్యవిధేయతఁ జన్నవారికిం
దెగు వగలెల్లఁ జిత్తము ప్రదీప్తవివేకమయత్వ మొందినన్.

—భీష్మ. పుట ౨౩., పద్యము ౧౯౪.

ఈ కలకలనవ్వును తిక్కన శ్రీకృష్ణపాత్రపట్ల ఎక్కువగా వాడిఉన్నాఁడు.

అర్జునునితో సంభాషణావసరమున శ్రీకృష్ణుఁడు కల

కల నవ్వీన ఘట్టము పైన ఉదాహరితమై ఉన్నది. ఇఁక భీము నితో సంభాషణావసరమున శ్రీకృష్ణుఁడు కలకలనవ్వీన ఘట్టమును ఒకదానిని పరామర్శింతిము.

రాయబారమప్పుడు శ్రీకృష్ణునితో భీముఁడు 'యెవ్విధమున నైనను సంధి సేయువలయు' నని అనును. 'అనుటయుఁ బిన్ననవ్వు నగి యంబుజనాభుఁడు వల్కె నెన్నఁడున్ విన నివి భీముపాలఁ గడువింతలు వింటిమి...

క. వెఱ పెట్టిదియో యెన్నఁడు
నెఱుఁగని నీయట్టివాని కిట్టివి యో యీ
పిఱికితన మింత యలవడఁ
గఱపినవా రనుచు శౌరి కలకల నవ్వెన్.

—ఉద్యోగ. ఆశ్వా ౩, ప. ౫౨.

పిన్ననవ్వుతో ప్రారంభమై శ్రీకృష్ణుని భాషణము ఈ సందర్భమున కలకలనవ్వుతో పర్యవసిత మయ్యెను. ఈనవ్వుల తోనే తిక్కన శ్రీకృష్ణపాత్రను లెస్సగఁ బోషించినాఁడు. 'సహోదరు లాజి నాయానపడుట కోర్వమియుఁ, గౌరవులఁ జంపనొల్లమియును గలుగు నెయ్యంబుపెంపునఁ గరుణ నార్ద్రుఁ డైన పవనజుఁ బురికొల్ప నాత్మఁ దలఁచి' శ్రీకృష్ణుఁడు ఈ సందర్భమున తన సంభాషణమును పిన్ననవ్వుతో మొదలు పెట్టి కలకలనవ్వుతో ముగించినాఁడు.

ఇక్కడ భీముని పురికొల్పుటకు శ్రీకృష్ణుఁడు కలకల నవ్వినాఁడు. పైన ఇచ్చిన నిదర్శనములో అర్జునుని పురికొల్పుటకు శ్రీకృష్ణుఁడు కలకలనవ్వినాఁడు.

శ్రీకృష్ణునిచే కలకలనవ్వించుటే కాక తిక్కన శ్రీకృష్ణునిచే రెండుతావులయందు కలకలనవ్వును ప్రస్తావింపఁజేసినాఁడు.

తిలకింపుఁడు :

1. కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవుల దుర్ణయంబు సెప్పుచు కపటనెత్తంబు నెపంబుగా మిమ్ము వెడల నడుచునప్పుడు దుర్యోధన దుశ్శాసన శకుని సూతనందనులు పుయిలోటదక్కి కలకలనవ్వుచుం బలికిన పలుకు లుగ్గడింపవచ్చునే.

—ఉద్యోగ. ఆ. 3., ప 3౭.

2. శ్రీకృష్ణుఁడు ద్రౌపది నూరార్చుచు

క. అలనా! యడుగుము నీ యే
డ్పులకోలఁదియె కురునృపాలపుత్రకళత్రం
బుల యేడ్పు లింక వానిం
గలకలనవ్వుచు వినంగ గాలంబయ్యెన్.

—ఉద్యోగ. ఆ 3., ప ౧౨౧.

ఇట్లు శ్రీకృష్ణునిచే రెండుతావులందు కలకలనవ్వును ప్రస్తావింపఁజేసిన, శ్రీకృష్ణునిచే రెండుఘట్టములందు కలకల నవ్వును ప్రయోగింపఁజేసిన తిక్కన భారతమున మఱియొక తావున (శల్యపర్వము-ఆ ౨. ప ౪౭), నిర్వచనోత్తరరామాయణమున ఒకతావున (ఆ ౮. ప 3౪) ఈ కలకలనవ్వును వాడినట్లు కనిపించుచున్నది.

## 3

## గొప్పనవ్వులు

ఇంతవఱకు తిక్కన వాడిన పిన్ననవ్వులను, పెద్దనవ్వులను దృష్టాంతీకరించుకొని ఉంటిమి. ఇఁక తిక్కన గొప్ప నవ్వులను ఉదాహరించుకొందముగాక !

—: ౨౩. ఎలనవ్వు :—

ఈఎలనవ్వు తిక్కనకు చాలప్రియమైనదిగాఁ గనిపించుచున్నది. శృంగారఘట్టములందును, సమరసందర్భములందును ఆకవిగ్రామణి ఈనవ్వును వాడియున్నాఁడు.

శృంగారఘట్టము లందలి ఈనవ్వునకు నిదర్శనము:

అష్టావక్రుని చిత్తశుద్ధిఁ బరీక్షించుటకు ఉత్తరదిశ స్త్రీరూపము దాల్చి అతనిం గవయ నూంకించెను. ఆతఁడు పోవ నుద్యమించె. అప్పు డమ్మృగాక్షి ఎలనవ్వొలయ 'కార్య మగుటయు సరిగమగాక' అనియె.

—అనుశాసనిక. ఆ ౨., ప ౧౬.

ఇఁక సమరసందర్భములందలి ఈనవ్వునకు నిదర్శనములు.

ఉత్తరునివలన శమీవృక్షంబునుండి దివ్యాయుధంబులు తీయించి ధరించి యెలనవ్వొలయంగ నెక్కె నేడ్తెఱ రథమున్.

—విరాట. ఆ: ౪, ప: ౧౬౫.

గోగ్రహణమునాఁటి యుద్ధమున తన్ను గవిసిన కౌరవ బలమును

క. కనుఁగొని యెలనవ్వొలయఁ బ
దనమున గురుదంపుఁజెన్ను దలకొనఁగా న
ర్జునుఁడు విరాటసుతున కి
ట్లనుఁ గేవలవీరరసమయాత్మకుఁ డగుచున్.

—విరాట. ఆ ౫., ప ౩.

భీష్ముని యష్టమదివసయుద్ధమున భీముఁడు గురుండగు ద్రోణాచార్యుని మూర్ఛ మునుంగ నేసిన

మ. ధనురాచార్యునిఁ జూచి తత్తనయుఁడున్ ధాత్రీశుఁడున్ భీము మా
ర్కొని రాతం డెలనవ్వు చెన్నుగ గదాఘోరాకృతిం దేరు డి
గ్గి......

—భీష్మ. ఆ. 3., ప. ౧౨౯.

ఇక్కడ ఎలనవ్వు నవ్వినవాఁడు భీముఁడు. భీముఁడు సాధారణముగఁ బెలుచనవ్వినట్లును, ఉబ్బుమిగిలి నవ్వినట్లును వర్ణితుఁడై ఉన్నాడు. అట్టి భీముఁడు ఇక్కడ ఎలనవ్వు నవ్వినట్లు వర్ణితుఁడు కావుటకుఁ గారణ మేమి? తేరు దిగి భీముఁడు ఇక్కడ గదాయుద్ధము చేసినాఁడు. గదాయుద్ధము భీముని అభిమానయుద్ధము. అగుటనే అతఁడు ఈఘట్టమున ఎలనవ్వు నవ్వినట్లు తిక్కన అభివర్ణించినాఁడు.

యుద్ధావసరమున ఈఎలనవ్వును భీమార్జునులకే కాక ధర్మరాజునకుఁ గూడ తిక్కన హత్తించియున్నాఁడు. చూడుఁడు:

శల్యుఁడు, ధర్మరాజు యుద్ధము చేయునప్పుడు

చ. బరవస మొప్ప మద్రపతి పాండవముఖ్యునిమీఁదఁ గాండముల్
గురిసిన నానృపాలుఁడు నకుంఠితుఁడై పదు నాల్గుతూపు ల
న్నరపతిమేనఁ గ్రుచ్చి యెలనవ్వున నొప్పిన నమ్మహీశు పే
రురమున నాటె సారథికిఁ దోకక సముజ్జ్వలబాణ మేత్తెఱన్.

—శల్య. పుట ౧౮౭., ప ౧౮౬.

—: ౨౮. ప్రౌఢస్మితము :—

తిక్కన వాడిన ప్రౌఢస్మితమునకు నిదర్శము నిర్వచనోత్తర రామాయణమునఁ గలదు.

వాలి రావణునిఁ జంకలో నిఱికించుకొని నాలుగు సముద్రములను ముంచి నిజపట్టణోపవనభూమికిఁ దెచ్చి సుఖోపవిష్టుఁడై

శా. కోపంబాఱినఁ జంక వాపి ధరణిం గూర్చుండఁగాఁ బెట్టి ని
ష్పాపోల్లాసకటాక్షు మల్లి నొలయం బ్రౌఢస్మితజ్యోత్స్నల
జ్జాపూరావృత తన్ముఖాబ్జములపై సాంద్రంబుగాఁ జూపి ని
ర్వ్యాపారామరసుందరీప్రకరగర్భస్రావణున్ రావణున్.

—ని. రా. ఆ ౭., ప ౮౭.

—: ౨౫. బెట్టునవ్వు :—

భీష్ముఁడు నకులునకు ఖడ్గప్రభావంబు తెలియం గెఱిం
గించు ఘట్టమునఁ ఈనవ్వు అభివర్ణితము.

తే. హరుఁడు బెట్టుగ నవ్వి పెల్లార్చుటయును
విని సముద్ధత రయమున దనుజకోటి
మునుగఁ బఱతెంచి తాఁకిన మునుముకొని వ
ధించి యిల యెల్ల నెత్తుటముంచె నతఁడు.

—శాంతి. ఆ 3., ప ౮౮౭.

—: ౨౬. కన్నులనవ్వు :—

భారతమున ఈ కన్నులనవ్వును తిక్కన రెండు, మూడు
తావులయందు వాడిఉన్నాఁడు.

భీష్ముని ప్రథమదివసయుద్ధమున

చ. సరభసుఁడై యుధిష్ఠిరుఁడు శల్యునిఁ దాఁకుడు నాతఁ డమ్మహీ
శ్వరు మహనీయచాప మనివారణఁ ద్రుంచిన నొండు విల్లు భీ
కరతర శీఘ్రలీలఁ గొని కన్నులనవ్వుచుఁ బాండవాగ్రజుం
డరిబల ముక్కుదక్కఁ వడి నాతనిపైఁ గురిసెన్ శితాస్త్రముల్.

—భీష్మ. ఆ. ౧., ప ౨౫౪.

మఱిరెండు నిదర్శనములు:

క. పెన్నుమునుఁగఁ దివియఁగ లే
కున్నను ద్రావఁదగు నీరు లొదవిన హయముల్

నిన్ను గెలిపించు వనవుఁడుఁ
గన్నుల నగి యర్జునుండు గల విలి యనుచున్.

—ద్రోణ. పుట ౨౧౯., ప ౧౯౨.

సీ. ..........................

...లోచనముల నవ్వ నెఱయఁ
గృపుని నాలోకించి క్రీడి తద్వతుష్ఠ
లంబునఁ గ్రూరభల్లంబు నాట.

—విరాట. ఆ ౫., ప ౧౫౦.

—: ౨౭. కన్నులనిప్పులురాలనవ్వు :—

తనపాత్రలచే కన్నులతో నవ్వించుటే కాక కన్నుల నిప్పులురాలునట్లును తిక్కన నవ్వించినాఁడు. చూడుఁడు:

భీష్ముని చతుర్థదివసయుద్ధమున దుర్యోధనుఁడు

ఉ. తమ్ములు వీఁగినం బలి యుదగ్రత భీము నెదిర్చి యార్చుచుం
దొమ్మిది యమ్ములం దనువు దూఁటులు సేసిన నూతఁ బిల్చి వే
గమ్ము రథమ్ముపై కరిగి కన్నులనిప్పులురాల నవ్వి యొ
క్కమ్మడి నాతఁ జేసె నృపు నుగ్రగతిం బది నారసంబులన్.

—భీష్మ. పుట ౫౭., ప ౨౩౨.

అమానుషగదాశక్తిసముద్దాముఁడగు భీమునకు ఈ నవ్వు ఎంతయు సముచితమై యున్నదికదా!

—: ౨౮. కినుకనూనిననవ్వు: —

ద్రోణుని నాల్గవనాఁటియుద్ధమున వృషసేనుండు లోనగుఁ నెనమండ్రు రథికు లొక్కపెట్ట పెల్లేసిన నర్జునుండు 'కినుక నూనిన నవ్వు రౌద్రరసంబు నలంకరింప' వారిని అందఱను నిలువరించె.

—ద్రోణ. ఆ. ౩., ప ౨౨౫.

ఈనవ్వును తిక్కన మఱియొకచోటకూడ వాడి యున్నాఁడు.

కంకుఁడు

చ. కురుబలమేల దైత్యసురకోటులు వచ్చిన గెల్వరాదె యు
త్తరునకు వాబృహన్నల రథంబున దుర్దమలీల నుండగన్
వ. అనిన విని సక్రోధహాసోల్లాసవికృతాననుండై మత్స్యమహీనాథుండు

—విరాట ఆ. ౫., ప ౨౫౮.

కినుక నూనిన నవ్వుకు సక్రోధహాసము సంస్కృతభాషాపర్యాయపదము కదా!

—: ౨౯. కినుకముసుంగు నవ్వు :—

ద్రోణాచార్యుని రెండవనాఁటి యుద్ధమున భగదత్తుఁడు సుప్రతీక మను ఏనుఁగును బంపి పాండవసైన్యంబులం గలంచు చుండిన వానిపై అర్జునుండు ఎత్తిపోవుచుండ సుశర్మ అడ్డు వచ్చెను. అర్జునానుమతిని కృష్ణుండు తేరు మరల్చెను. అప్పుడు—

చ. ..........................................మోమునం
గినుక మునుంగు నవ్వొలయ గ్రీడి త్రిగర్తుని చాపదండకే
తనములు ద్రుంచి..............................యా
తని నవలీల నొంచిన నతండు వెసంబడి మూర్ఛవోయెను.

—ద్రోణ. పుట ౧౮౯. ప ౩౮౮.

కినుక నూనిన నవ్వుకును ఈనవ్వుకును ఉన్న భేదము గమనింపఁదగినది. ఆనవ్వు కినుకను పూసినది ఈనవ్వు కినుకలో మునిఁగిపోయినది. కినుక నూసిన నవ్వులో ప్రాధాన్యము నవ్వుది. కినుక మునుంగు నవ్వులో పై చేయి కినుకది.

## —: ౩౦. కటికి నవ్వు :—

ధర్మరాజువలన అభిమన్యునిమరణము విని అర్జునుఁడు కొలఁదిపడరాని దుఃఖమున పొగిలి

ఆ. అవుడు గఱచి యొత్తునగు నాననంబుతో
బొమలుముడిచి చెమట వొడమ మేను
కంప మొందఁ గనలు గదిరిన కటికన
వ్వొసక మెసఁగ నవ్వ కిట్టు లనియె.

మ. వినుఁడీ నాదు ప్రతిజ్ఞ నీవు నిఖిలోర్వీనాథులున్ సింధురా
జా నపశ్యంబును నెల్లి సంపుగు భయస్థుండై నినుం జొచ్చినన్
వనజాక్షున్ శరణంబు వేఁడినను గర్వంబేది నన్నుం డగం,
గనినం బోరు దొఱింగిపోయిన నెఱుంగంగాని సత్యవ్రతా!

—ద్రోణ. పు ౨౦౮., ప ౨౨౫.

అభిమన్యుమరణకారణమున ఉదయమునొందిన సైంధవమరణసిద్ధిగాఁ గల నవ్వు కటికినవ్వుగాక మఱియొకటి యెట్లగును? ఈ కటికినవ్వు ఒకమరణమువలన మఱియొకమరణము గొఱకుఁ బొడమిన నవ్వు.

శ్రీనాథుఁడు కాశీఖండమున దీనిని వాడియున్నాఁడు.

## —: ౩౧. నవ్వగాని నవ్వు :—

ద్రోణుని మూఁడవనాఁటి యుద్ధమున పద్మవ్యూహంబు భేదించుకొనిపోయి అభిమన్యుఁడు కురుసైన్యంబును పీనుంగు పెంటలు సేసిన నప్పు డక్కుమారు నాలోకించి వికాసభాసిత వదనుం డగుచు గురుండు గురుపత్ని నెఱనుడాఁకఁ బలుకవల యునను తలంపున నతండు వినుచుండం గృపాచార్యుతో నిట్లనియె—

ఉ. తమ్ములు నన్నలుం జెలులుఁ దండ్రులు మామలు భృత్యులుం బ్రమో
దమ్మునఁ దేల నిట్లు వడిఁదాఁకెడునే విజయాత్మజుండు ఘో
టమ్ములుఁ గుంజరమ్ములు బడల్పడఁ దేరులు నుగ్గుగాఁగ నా
నమ్మిన యోధవీరులు వినాశము భంగము నొంది నొక్కఁడున్.

ఆ. అనిన వెలుకఁ బాతి యతిదీనమగు నాన
నమున నవ్వుగానినవ్వు నెఱయ
సౌమదత్తి కర్ణశల్యాదులగు యోధ
జనులతోడ నిట్టు లనియె విభుఁడు.

—ద్రోణ. పుట ౧౨౨, ప ౪౪.

దుర్యోధనుని 'వెలరుపారునట్టి వగ'కుఁ దగిన నవ్వే కదా ఇది. అతఁడు నవ్వినాఁడు. కాని అది నవ్వు అనిపించు కొనదు. కావుననే లోకజ్ఞుఁడగు తిక్కన దానిని నవ్వుగాని నవ్వు అన్నాఁడు.

"బలిమిక్రోలున నవ్వు దళుకొత్తినను మొగం
బెల్లఁ దానై యున్న వెల్లఁదనము"

—హరివంశము.

అను ఎట్టిన వర్ణనమును,

సైరంధ్రియెడ కామాయత్తుఁడైన కీచకుని వర్ణించుచు

"కడువికారంబుగా నోడ లెల్ల విఱుచుచు
మలఁగి రిత్తకు రిత్త నెలఁగి నవ్వు"

—విరాట. ఆ ౨., ప ౨౧౦.

అను తిక్కనప్రయోగమును ఈసందర్భమునఁ దడవ నగును.

—: ౩౭. ఎట్టి నవ్వు: —

ద్రోణుని మూడవనాఁటి యుద్ధమున పద్మవ్యూహము

భేదించుకొనిపోవుచున్న అభిమన్యుని కర్ణుఁడు కదిసిన అతని

తే. ...భుజవీర్య శౌర్య విశేషభంగి
సరకుగొనక యుబ్బాలుండు సమదలీలఁ
బెనఁగ నయ్యంగరాజు డస్సిన నెఱింగి
యతనితమ్ముఁ డయ్యర్జునసుతునిఁ దాఁకి

చ. హయములమీఁద సూతుపయి నాతనియంగములందు నస్త్రసం
చయ మడరించినం గమలచారుముఖంబున నెఱ్ఱనవ్వు చె
న్నయి విలసిల్ల భల్లమున నన్నరసూనుఁడు ద్రుంచె విద్విష
ద్భయదవిలాసబాహుసముదగ్రత వాని శిరంబు గ్రక్కునన్.

—ద్రోణ. పుట ౧౭౩., ప. ౫౪.

కవిచమత్కారమువలన నవ్వుకు రంగు హత్తింపఁబడినది. ఈ రంగునవ్వు ఇక్కడనే కాక తిక్కన రచనలో మఱియొక తావునఁ గూడ దొరకుచున్నది. చూడుఁడు:

ధర్మజుం డశ్వమేధదీక్షం బూని పుడమిఁ దిరుగవిడచిన హయమును బట్టిన త్రిగర్త దేశాధిపతులను అర్జునుఁడు—

చ. వలవదు పొం డనంగ నిలువంబడ కేపున సూర్యవర్మ య
బ్బలియునిమీఁదఁ గ్రూరశరపంక్తి నిగిడ్చినఁ ద్రుంచెఁ జిప్పయ
మ్ముల నది యెఱ్ఱనవ్వు తనమోమున తమ్మికి శేఁతయొండయై
చెలువము చెన్ను వింతలుగఁ జేయఁగ నావిజయుండు భూవరా!

—అశ్వ: పుట ౨౭౮., ప ౮.

ఇందులో ద్రోణపర్వములోని ఎఱ్ఱనవ్వు అభిమన్యునిది; అశ్వమేధపర్వములోని ఎఱ్ఱనవ్వు అభిమన్యుజనకుఁడయిన అర్జునునిది. పాండవవీరులలో అగ్రగణ్యులయిన అర్జునునకును, అతని కుమారుఁడైన అభిమన్యునకును విశిష్టమైన ఈఎఱ్ఱనవ్వును తిక్కన హత్తించుట ఒక విశేష మనక తీరదు.

చూడ్కికి ఎఱ్ఱరంగు హత్తించి ఎఱ్ఱనిచూడ్కి అనుట కవులకుఁ బరిపాటివిషయము. ఈపరిపాటివిషయమునకు తిక్కన్నయే మొదటివాఁడై ఉన్నాఁడనినను సత్యదూరముకాదు. తిక్కకవి ఎఱ్ఱనిచూడ్కి వర్ణనమును తిలకింపుఁడు:

అర్జునుఁడు దుర్యోధనునితో యుద్ధంబు సేయుచుండఁగా వికర్ణుండు వచ్చి

ఉ. వీఁక నెదిర్చి యిట్లు కురువీరులకుం బ్రమదం బొనర్చువాం
డాఁకినఁ గ్రోధవేగసముదగ్రత 'నెఱ్ఱనిచూడ్కిఁ' జూచి పే
రాఁకలితోఁడనున్న జము నాకృతి భీషణరేఖ యొప్పఁగా
బ్రేఁకని నారసంబుదొడి క్రీడి కరిన్ దృఢముష్టి నేసినన్.

—విరాట. ఆ. ౫, ప ౧౯౩.

చూడ్కికి ఎఱ్ఱరంగు హత్తించి ఎఱ్ఱనిచూడ్కి అని వర్ణించుటను తెనుఁగుకవులు పలువురు చేకొనిఉన్నారు. కాని నవ్వుకు ఎఱ్ఱరంగు హత్తించి ఎఱ్ఱనవ్వు అని వర్ణించుట తెనుఁగుకవులలో తిక్కనకు ఒక్కనికే చెల్లిన విషయ మన్నను అతిశయోక్తి అనిపించుకొనదు.

నవ్వు అనునది మానవుని అనన్యగుణములలో నొకటి. కావుననే ఆంగ్లకవి ఒకఁడు 'ఈప్రపంచములో మానవుఁడు తప్ప మఱి యేజంతువుకాని నవ్వలేదు' అనినాఁడు. ప్రాణులలో మానవునికి ఒక్కనికే గల వరప్రసాదములలో నవ్వు ఒకటి. అట్టి విశేషవరప్రసాదమైన నవ్వును ఆంధ్రకవిగ్రామణి తిక్కన సోమయాజి పలురకములుగా ప్రవచించియున్నాఁడు. ఈవిషయ మును తెలిసినఁగొలఁదిని తిక్కనప్రజ్ఞ ఆహాపుట్టించునదిగా నున్నది.

నవ్వు ప్రేమభావము ధరించు రంగు అని ఫ్రెంచికవి ఒకఁడు అనినాఁడు. ఆంధ్రకవి తిక్కన వాడిన అన్ని నవ్వులను పరికించినవారికి నవ్వు ఒక్క ప్రేమభావమును ధరించు రంగు మాత్రమే కాక అది యుద్ధభావము ధరించు రంగుకూడ కాగలదనుట స్పష్టమగును. కవితిక్కన విశేషవిశిష్టత ఇందే కలదు.

మహాసీయుఁడు కాలి స్టినీసు నవ్వును గుఱించి ఇట్లు చెప్పియున్నాఁడు :

'మానవుని వ్యక్తిత్వప్రాచుర్యమునకు చిహ్నము నవ్వు; స్వాతంత్ర్యభావప్రకటనకు గుఱుతు నవ్వు; తనకుఁ ధారసపడు కష్టములకు దాను దాసుఁడను కానని మానవుఁడు చేయు సుందరసూచన నవ్వు.'

మహాభాగుఁడు హెన్రీవార్డుబీచరు నవ్వును గూర్చి ఇట్లు చెప్పియున్నాఁడు:

'పువ్వులు నవ్వలేవు. నవ్వు అను అలంకారము వానికి లేదు. కాని నవ్వలేని మొగమును- వికసింపలేక తొడిమలోనే ఎండిపోయిన మొగ్గవంటిది- అని మాత్రమే చెప్పవలసియుం డును ...నవ్వు అనునది ముఖము అను గవాక్షములోని వెలుతురు. ఆ గవాక్షముమూలమున హృదయము తన ఆనంద మును, ఆమోదమును చూపును, ...మణులు, వజ్రములు నేత్రములు మిఱుమిట్లుగొల్పునట్లు ప్రకాశింపవచ్చును. కాని నవ్వునప్పుడు మానవుని నేత్రములలోఁ గానవగు ప్రకాశమందలి దివ్యత్వము ఆ రాళ్ళకాంతిలో లేదు...హాసము పగటి వంటిది. గంభీరత రాత్రి వంటిది. మృదుహాసము ఆ రెండిటిని అనుసంధించు ఉషఃకాలమువంటిది.'

మహనీయుఁడు కాలిస్తనీసు, మహాభాగుఁడు బీచరు నవ్వును గుఱించి చెప్పిన ఈమాటలు మాన్యములైనవి. కాని తిక్కనకవి వివరించిన ముప్పదిరెండురకముల నవ్వులను తిలకించినవారికి ఆ మాన్యవచనములు సామాన్యములైనవిగా, అసమగ్రమైనవిగాఁ దోఁచితీరును.

౬

# వరూధిని మాయలు

'కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్'

మనుచరిత్రమందలి స్త్రీపాత్రములలో వరూధిని శృంగారపుం బ్రోవు. ఆమె గంధర్వాంగన. అందును వేశ్య. అట్లగుట హావభావశృంగారాదిసుకుమారచేష్టలచేఁ బురుషుని వశ్యము కావించుకొనఁగల్గిన చదురాలు.

వైషయికేచ్ఛావిముఖుఁడగు ప్రవరుని దన టోపీలోఁ బడవైచుటకై ఆమె సల్పిన మోహంపుసటలు, చేసిన యుక్తివాదములు, పోయిన పోఁకలు, పచరించిన మాయలు వరూధిని శృంగారరసాలవాల మనుటకు నిదర్శనములు.

నలకూబరసన్నిభుఁడగు ప్రవరుని దిలకించినతోడనే 'ఝళంఝళత్కటకసూచితవేగపదారవిందయై' లేచినది. ఇది ముందు వరూధిని చేయఁబోవు మాయలకు మచ్చు.

తెచ్చికోలునునుసిగ్గు దొంతరలాందోళింప ఆమె వెను వెంటనే 'పూచిన యొక్క పోఁకనునుబోదియ మాటునఁ' జేరినది. తానచ్చటనుండి తనివార 'విలోకనప్రభాపీచికలం దదీయపదవీకలశాంబుధిని వెల్లిగొల్ప' వచ్చును. పైఁగాఁ బ్రవరుని ఊరింపవచ్చును.

త్రిలోకమోహనకరమగు సౌందర్యరాశి మెఱుపువలెఁ గని పించి అంతలో దృష్టిపథమునుండి తొలఁగుటచేఁ జూపఱకారూప రాశిని మఱలఁజూడ నాసక్తియు, నాతురతయు నెసరేఁగును.

అతిపరిచయముచే నెట్టిదాసి విలువమైనను సన్నగిల్లు ననుట వరూధిని ఎఱిఁగిన పాడి. కావుననే ఆమె తనరూపము ప్రవరునకు ఊరించిఊరించి చూపవలెనని పోఁకబోదియుఁ జేరినది. ఊరీఊరని ఊరుగాయవలెఁ గనిపించియుఁ గనిపించని సౌందర్యరాశి అత్యంతసౌఖ్యావహముగదా!

తన్నుజూడఁ బ్రవరున కాసక్తియు, నాతురతయుఁ బుట్టు నాయొసపరిభాగులాడి వేసిన ఎత్తుగడ ఇది.

కొంతతడ వాతని రూపరేఖావిలాసములకుఁ జొక్కుట తోడనే ఆమెకు లజ్జాపరిత్యాగమునకు వలయు రసపారవశ్యము గల్గినది. 'కాముకస్య కుతో లజ్జా' అని కదా పండితోక్తి.

అట్లగుట నామె స్త్రీజనస్వభావసిద్ధమగు లజ్జ వీటిఁ బుచ్చి, 'అంఘ్రికటకంబుల్ మ్రోయ' నడచివచ్చి, అడ్డము నిల్చినది- ప్రవరుఁడు ముందుకు సాగిపోకుండుటకై. వచ్చిన వారికి నెదురుసన్నాహము చేయుట లోకమర్యాద.

ఎదురుగా వచ్చిన ఎమ్మెలాడిని విలోకించి విభ్రాంతుఁడై ప్రవరుఁడు తనకథ నెఱిఁగించినాఁడు. అంతట నామె ఒసపరివన్నెలు, చిన్నెలు నెఱపి సెలవివాఱ నవ్వినది. నూత్న పురుషునితో సంభాషింప నుంకించు మటుమాయలాడి పచరించు నెఱనీటు లేకదా ఇయ్యవి!

నవ్వి ఆమీఁద ఆమె నర్మగర్భముగా నిట్లన్నది:

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరివేఁడెదు? భూసురేంద్ర! యే
కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించు లా
గింతయుఁ గాక, నీ వెఱుఁగవే మునువచ్చిన త్రోవచొప్పు; నీ
కింత భయంబులే కడుగ నెల్లిదమైతిమె? మాట లేటికిన్.

ఈవచనములచే నుత్తరకథావిస్తృతికి మూలసాధన మగు శృంగారరసోద్రేకము గల్గించుటకు బీజములు విత్తయత్నించినది.

'ఇంతిలు కన్నులు' అనుటచే నాతనిరూపుపైఁ దన చూపు నిలిచినదని సూచించినది. 'ఏకాంత' మనుటచే భయ సంకోచాదుల కిసుమంతయుఁ దావులేకుండుటయు, 'జవరాంద్ర' ననుటచేఁ దనభోగ్యతాసౌభాగ్యమును దెలియఁ జేసినది.

అంతతో విల్వక నిజాభిజాత్యము నేకరువుపెట్టి తన అతిశయముల నభివర్ణింప నారంభించినది

పుట్టుక సుధాబ్ధిలో; చంద్రుఁడును, లక్ష్మియుఁ దోడఁ బుట్టినవారు; త్రాలనుగూడఁ గరఁగించు గాంధర్వము కులవిద్య; కళాశాస్త్రమర్యాద దొండాకుపసరుతో నేర్చినది; యజ్ఞకర్మలు ఊంకువలు; మేరుపర్వతప్రదేశములందుఁ గల్పవృక్షములనీడఁ బచ్చరాచట్టుగమి రచ్చపట్టు; పద్మసంభవవైకుంఠ భర్గసభలు సాముగరిడీలు; ప్రాణసఖు లన్ననో! ఉదార గుణాఢ్యలు, శృంగారరసాలవాలములు నగు రంభాదులు; విహారవనసమూహములో,! 'నభోవాహినీలహరీశీతలగంధవాహపరిఖేలన్మంజరీసౌరభగ్రహణేందిందిరతుందిలంబులు.'

ఇట్లు అతిశయములు వర్ణించి తన అభిలాష నర్మగర్భముగా వెల్వరించినది.

ఈయతిశయవర్ణనము చొక్కపొడివలెఁ బనిచేయుకుండునా? కోరినదే తడవుగాఁ బ్రవరుఁడు తన ఇంట నాతిథ్యముఁ గైకొనకుండునా? అనుకొన్నది.

'కుసుమశరాసన !'— అని సంబోధించినది. ఇది సాభిప్రాయమైన సంబోధనముగాని అటుకొటుమాట కాదు.

'సముదంచన్మణిభవనాసీనత' సేద దీఱుచున్నది. ఆహ్వాన ములోఁ గూడఁ దన అతిశయవర్ణనము మేళవించినది. 'మా యింటి విందవై తివి' అని తానే అని వేసినది. మఱియు

'తే. కుందనముఁబోలు మేను మధ్యందినాత
పోష్మకాతిఁ గంది వడఁదాఁకె నొప్పులొలుకు
వదన మస్మద్గృహంబు పావనము చేసి
బడలికలు వాసి చనుము'

అని వేఁడికోలు.

'కుందనమువంటి మేను, ఒప్పులొలుకు వదనము.' అతిథి సత్కారముచేయు నెపమున అతిథిబ్రాహ్మణుని అంగసౌందర్య ప్రశంస యేలనో? ఏమో? గంధర్వాంగనల లోగుట్టు విమర్శ కుల కెట్లు తెలియును?

ఎంతవఱకు నడుచుచున్నది వరూధిని వాక్యావసానము? తన అతిశయవర్ణనముచేఁ బ్రవరుని వశగొల్పం జూచినది. చక్కని మాటలాడి సత్కరింప నెంచినది. ఇంతెదనుక మాట లఁ దేటల మరపి మెప్పించి బుట్టలోఁ బెట్టఁదలఁచినది.

కాని ఈపలుకు లన్నియు సముద్రమథనమువలెనే ఫలించినవి. పరమశ్రోత్రియశిఖామణియగు ప్రవరుని చిత్తమునకు వరూధిని మహిమాతిశయము, అభిలాషవిశేషము, అత్యంతభోగత్వము- ఇవి యేమియు గ్రాహ్యము కాలేదు.

ఆతనిమనమున శృంగారరసము మొలకెత్తించుట ఇంత వఱకు కుంపటిలోఁ దామర మొలపించుటయే ఐనది. అగుఁగాక! వరూధిని అంతతో నిరుత్సాహము చెందినదా? లేదు.

వాని బేలతనమునకు లేఁతన వ్వానసీమఁ దాండవింపఁ జేసినది, వరూధిని.

అక్కడి విశేషములఁ జూపి భ్రమపెట్టఁ దలంచినది. 'ఎక్కడి యూరు! కాలు నిలువ కింటికిఁ బోయెద నని కలవ రించెదవు. ఇక్కడి రత్నకందరములు, నందనచందనోత్కర ములు, గాంగసైకతములు, లవలీనికుంజములు- మీనాకటీర నిలయములకు సరిరాకపోయెనా!' అని చచ్చుతెగవేసి అడిగి నది. వీని కాశపడి బ్రాహ్మణుఁ డుండకపోఁడని ఆమె అభి ప్రాయము.

వరూథిని అంతతో నూరకున్నదా! లేదు.

అడుగఁబోయెడు అంగనకు సిగ్గెందులకు? లజ్జించిన కార్యము సానుకూలము కావలదా! చల్లకుం బోయి ముంతో దాఁచిన లాభమేమి! వ్యవహారముపట్ల లజ్జ కూడదని నిర్ణ యించి స్త్రీజనస్వభావసిద్ధమగు బెట్టుసరి తీసి గట్టునబెట్టి కుండ బ్రద్దలుకొట్టినట్లు

ఉ. నిక్కము దాఁప నేల? ధరణీసురనందన! యింక నీపయిం
జిక్కె మనంబు నాకు......'

అని చెప్పివైచినది.

మాయమర్మములు చంకఁబెట్టి పల్కిన ఈమాటలకైన 'దమ్మేఁడు చిక్కకుండునా?'

అబ్బే! ముదిగొమ్మ వంగునా!

'వ్రతులై దినములు గడపెడు విప్రులఁ గామింపఁ జనునే? నేను ఆహితాగ్నిని. నేఁ డిల్లు చేరకుండిన సమస్తధర్మ ములు దూలును' అని ప్రవరుని ప్రతివచనము.

ఈయద్దుకట్టుమాట లామెకు రుచించునా?

వాని వైరాగ్యభావమునకు వరూథినికి వదనమున విన్నఁబాటు 'ఇంచుక' దోఁచినది.

విన్నఁబాటైననుఁ'ఇంచుకయే.' ఏలయందురా? ఎట్లయిన బాఁపని మోహసముద్రమున ముంచలేకపోవుదుమా అను ధైర్యముండఁబట్టి.

సాభిప్రాయసంబోధనలు, అతిశయవర్ణనలు, మర్మవచనములు ఇవి అన్నియుఁ జెవిటికి సంకూదినట్లగుట. ఇఁక వానితోఁ బ్రసక్తియుఁ, బ్రయోజనము లేదయ్యెను.

కాఁగా నిప్పుడిఁక యుక్తివాదములో బోల్తా వేయించవలెను.

'ఉ. భావజరూప! యిట్టి యభిప్రాయము వైదికకర్మనిష్ఠలం
బోవఁగ నింక భోగములఁ బొందుటయెన్నఁడు? యజ్ఞకోటులం
బావను లౌటకున్ ఫలము మా కవుఁగిళ్ళ సుఖించుటేకదా!'

అని ముదలకించినది.

'అప్రయత్నలబ్ధమగు గంధర్వాంగన పొందే కాదు. కామోద్రేకకరములగు కస్తూరి, జవాజి, పచ్చకర్పూరము, పన్నీరు, ఫలపుష్పములు, రత్నభూషణములును గలవు. కావున భోగపరుఁడవై అనుదినము ననుఁగూడి రమింపుము' అని చాటుమాటు లేక వచించినది.

ఆపై నిందనమునకు దొరకొన్నది: 'గంధర్వాంగనల పొందు గాదని సంసారాంధువునఁ బడియెదవు' అన్నది.

అటుపిమ్మట విషయలోలత్వము మంచిదని నిరూపింప విశ్వప్రయత్నము లొనర్చినది. 'వెన్నవలెఁ గరఁగు నలివేణులఁ గౌఁగిటఁజేర్చు భాగ్యములు ఎన్నిభవములఁ గలుగును?' అని ఊరించినది.

మీ కర్మనిష్ఠలు, యజ్ఞకోటులును మా కవుఁగిళ్ల సుఖం

పనేకదా ?' అని ప్రశ్నించినది. 'సశరీరస్వర్గసుఖము' పోనా డకు మన్నది.

ఇహలోకమునందే ఇంద్రియవాంఛలు దనివిదీరఁ జూఱఁగొనువాఁడే ఉత్తముఁడని నిరూపింప సాహసించినది.

కంటిరా ? కాముకురాలి మిట్ట వేదాంతములు !

విషయాపేక్షఁ దగిలి 'బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుఁ' డగుటకు వ్రతనిష్ఠ, వైరాగ్యము గల ప్రవరుఁ డొప్పుకో లేదు.

యుక్తివాదముకూడఁ జెడినది. ఇఁక నీశ్రోత్రియ బ్రాహ్మణుని పల్టీకొట్టించుటకు శరణ్యము శాస్త్రవాదమే.

'బ్రాహ్మణుఁడు, అందును శ్రోత్రియుఁడు కదా ! ఒక్క సారి శాస్త్రవాదమునం దూఁపిచూచెదము; అప్పుడైన మన వలలోఁ బడకుండునా ?' అని ఆలోచించినది.

'డెందము నిశ్చలమై యెక్కడ నిర్వృతినొందునో యట్టి ఆనందమే బ్రహ్మముగాని నీవు చెప్పు బ్రహ్మానందము లే' దని ప్రవరుని వాదమునకు ఖండనము చేసినది. ఇందులకు 'ఆనందో బ్రహ్మ' అను శ్రుతివాక్యప్రమాణముఁ జూపినది.

దీని కాతఁడు ఏమి బదులాడెనో తిలకించితిరా ?

'నా కరణుల్ దర్భలు నగ్నులు ప్రియములైన ట్లన్య ముల్ గావోడల్ తిరమే ? చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మానాలపైఁ దేనియల్' అని ఖండనమండన మొనర్చి తన విషయభోగవైముఖ్యమును, వైరాగ్యమును వెల్లడించినాఁడు.

శాస్త్రవాద మిట్లు చట్టుబండలై పోయినది. ప్రవరుఁ డన్ననో నమలరాని నారికేళమైపోయినాఁడు. కామశాస్త్రోపా

ధ్యాయిని యట్లు వచించియు వరూధిని శాస్త్రవాదమునఁ బ్రవరునితో నెదిరి యొుద్ధారింప లేకపోయెను!

వరూధిని కామశాస్త్రోపన్యాసము ప్రవరుని వేదాంతో పన్యాస మెదుట చిచ్చుపొంత వెన్నయైనది. అగుట ఆమె కేమియుఁ దోఁచినది కాదు. మాంట లేకపోయినది. హృదయరా జ్జము జల్లనినది. మోము వెల్లనైనది. పట్టలేక ఆమె 'వనిత తనంతఁ దా వలచివచ్చినఁ జుల్కనగాదె యోరికిన్' అని తన్నుఁ దా నిందించుకొన్నది.

స్త్రీలకుఁ బెట్టని భూషణమగు బెట్టుసరి యు ? పోయినది. కార్యమా ? నెఱవేఱలేదు. వ్రతము చెడినను ఫలము దక్కక పోవుట అభాగ్యము కాక మఱియేమి?

సామదానభేదోపాయము లిట్లు పోఁకకుఁ జెల్లకుండుటచే నామెకు ఆతుర్దా అతిశయించినది. ఇఁక బలవంతమాంఘున్యాన మట్లు చేయఁగూడదా అని సమాలోచించుకొన్నది. బలాత్కా తియే కాని వేఱుదారి లేదని నిశ్చయించినది.

మితముదప్పిన 'రతిసంరంభము' ఆమెను విల్వాసచ్చినది కాదు. 'కామాతురాణాం నభయం నలజ్జా' అని ఆర్యోక్తి.

ఉండఁబట్టలేక ఆమె 'ప్రాంచద్భూషణ బాహుమూల రుచితో,' మెరమెరపాటుతో', మోహాతిరేకముతోఁ బైపా టున ప్రవరుని కౌఁగిలించినది.

పరిరంభణప్రయోగము బ్రహ్మాస్త్రమువలెఁ దిరుగు లేనిదని ఆమె తలంపు. అవును, నిజమే. పరిరంభణము కంటె బలవత్తరమైన మోహనపరికర మేది ? వశ్యాంజనము వలె నిది పనిచేయునని వరూధిని యూహ.

ఆమె యూహ సరియైనదా ! కాదు. సతులమాయలు

ధీరచిత్తములఁ గలంచునా? ఎన్ని చేసినను రోఁకటికిఁ జిగురులు పుట్టునా?

అకాముకుఁడగుట ప్రవరుఁడు పరిరంభణప్రక్రియలో నున్న వరూథినిని త్రోచివైచినాఁడు.

అందులకుఁ గోపము పెల్లుబ్బినది వరూథినికి. క్రేగంటఁ జూచి మురమురలాడుచు

'ఉ. పాటున కింతు లోర్తురె? కృపారహితాత్మక! నీవు త్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొనుమంచుఁ'

జూపి (ఏమీ లేనప్పుడు ఏడ్పులే శృంగార మనునట్లు) వేదన నెప మిడి కలస్వనముతో విలపించినది.

తనకుఁ దానై వలపుఁగొనిన పురుషుఁడు దనకుఁ బ్రతికూలవృత్తి నున్నతఱి ఆతని హృదయము తనయందు అనురాగాయత్తమును, ఆతని మనము తనయందు లగ్నమును అగునట్లొనర్చుటకు అంగనలకుఁ గల అంతిమోపాయము కంటఁ దడి పెట్టుటే కదా!

వరూథిని 'కన్నుఁగవ ధవళరుచులు కావి గొన నతికరుణముగాఁ' బ్రలాపించినది. అంతతో నూరకొనలేదు. ప్రవరుని జూచి యలమటఁ బల్కినది.

అలమటయే కాని ఆశాపరిత్యాగము గాలేదు. 'ఇనుప కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్లఁ దామరసనేత్ర లిండ్ల బందా' లని గాఢముగ నమ్మిన వరూథిని కంతలో ఆశాత్యాగమగునా?

'ఆ. ఆడువారిఁగన్న నర్థంబుఁ బాడగన్న
సారమైన రుచుల చవులఁగన్న

అయ్యగారికైన నాశలు గలుగవా?
విశ్వదాభిరామ! వినుర వేమ!

ఆ. కాంచనంబుపైనఁ గాంతలపైనను
బమ్మకైనఁ బుట్టు రిమ్మతెగులు
తోయజాక్షి విడుచు దొరయెవ్వరును లేరు
విశ్వదాభిరామ! వినుర వేమ!'

అని కవి గానము చేయుచున్నాఁడు.

అట్టిచో నాశాపరిత్యాగమున కవకాశ మెక్కడ!

త్రోవతప్పిన భూసురుఁడు వంటయింటి కుందేలువంటి వాఁడు కదా! ఎక్కడికిఁ బోఁగల్గునను మొండిధైర్యము. ఒక్కింత తడవునకైన బుద్ధి తిరుగక పోవునా? మనసు కరఁగక పోవునా? అను అడియాస. అట్లగుట ఆమెకు అలమటయే కాని ఉత్సాహభంగము కల్గలేదు. ఆమె ఆశ నిరాశ చేసికొనలేదు. సకాంక్ష పెట్టుకొని ఉవ్విళ్లూరినది.

కామశాస్త్రోపన్యాసముచే నామెకు రేణువంతయు లబ్ధి లేకపోయినది. పైఁగాఁ బ్రాణము విసిగిపోయినది. అందుపై నాఉపన్యాసము ఉట్టిమీఁదఁ బెట్టి అహింసయే పరమ ధర్మమని వరూధిని ఉపన్యసించినది. తిలకింపుఁడు:

ఉ. చేసితి జన్మముల్ దపము చేసితి నంటి దయావిహీనతం
జేసిన పుణ్యముల్ ఫలము పొందునె? పుణ్యము లెన్నియేనియుం
జేసిన వాని సద్గతియె చేకుఱు భూతదయార్ద్రబుద్ధి; కో
భూసురవర్య! యింత దలపోయవు నీ చదువేల చెప్పుమా?

సద్గతికి దయ ప్రధాన మని నిగ్గు తేల్చినది. ఈనీతి నినుమంతయుఁ దలపోయని అతని చదువు అజాగళస్తనప్రాయ మనుటకుఁ గూడ సాహసించినది.

అంతతోఁ బోక అంకుపురాణములు విప్పి అంకుతనము మంచిదనియే చచ్చు తెగవేసి చాటినది. చూడుఁడు:

సీ. వలిపెట్టిరే బాడబులు పరాశరుఁబట్టి
దాశకన్యాకేళిఁ దప్పుసేసి
కులములో వన్నె తక్కువయయ్యెనే గాధ
పట్టికి మేనక చుట్టరికము
ననువుకొండై వెల్పునాగవాసముఁగూడి
మహిమ గోల్పడియెనే మాందకర్ణి
స్వారాజ్యమేలంగ నీరైరె సుర లహ
ల్యాజారుఁడైన జంభాసురారి

గీ. వారికంటెను నీమహాత్మ్యంబు ఘనమె?
పవనపర్ణాంబుభక్షులై నవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చు లెల్లఁ
దామరసనేత్రి లిండ్ల బందాలు గారె!

జారత్వము సర్వవిధముల సమర్థనీయమును, ఆచరణీయమును, శ్లాఘాపాత్రమును అని బోధించి సాధించుటకై వరూధిని పురాణములనుండి నిదర్శనముల నెత్తి చూపి ప్రవరుని జయింపఁ దలఁచుఁగొనినది.

ఈ కాముకవచనములకుఁ బ్రవరుఁడు ఏమని మాఱు పల్కెను? మౌనమే భూషణ మనుకొని చల్లఁడల్లగా జాఱినాఁడు.

ప్రవరుని మోహములోఁ బడవేయు వరూధిని ఎన్ని పోకలు పోయినదో చూచితిరిగదా!

తొలుత చక్కనిమాట లాడినది. అటుపిమ్మట తన అభిజాత్యమును, వైభవాతిశయమును వివరించి వర్ణించినది.

ఆపైఁ బ్రవరుని కుటీరనిలయములకుఁ దన తాపునకును గల తారతమ్యము వ్యక్తీకరించినది. అతఁ డేదియు లక్ష్యపెట్ట కుండుటచే బలాత్కారముగా మీఁదఁబడి ఆశ్లేషించినది. అప్పుడుకూడఁ బ్రవరుఁడు కొంచుకువడలేదు. అంత వరూధిని దయాదాక్షిణ్యములు చూపుమని వానిని వేఁడికొన్నది.

కాని కార్యము లేకపోయినది. ఆమె పన్నుగడ లన్నియు విపన్నము లైనవి.

తుదకు వరూధిని అనురాగము 'దుర్లభజనానురాగ మై'నది.

అట్లగుటనే కవి ప్రవరునిగూర్చి ఇట్లని పాడుచున్నాఁడు:

'ఆ. వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్ష సేయు జారకామినులకు
భోగబాహ్యమయ్యెఁ బూచిన సంపెంగ
పోలుపు మధుకరాంగనలకుఁ బోలె.'

# ౭

# ప్రవరుని సంసారసుఖము

ఆంధ్రకవితాపితామహుఁడు తన మనుచరిత్రమున ప్రవరుని సంసారమును వర్ణించి చిత్రించుటలో నాదర్శప్రాయమగు నొక సుఖకుటుంబమును మనమునం దిడుకొనియుండును. సమష్టి కుటుంబములలోఁ బూర్వము ఆర్యు లెట్టిసౌఖ్యమును బొందిరో ప్రవరుని సంసారచరిత్రమును పఠించువారికిఁ బెద్దనార్యుఁడు ప్రస్ఫుటము చేసెను.

వాసయోగ్యమైన గ్రామమున కాఁపురమును, పెక్కుచందాలం బందు మాన్యక్షేత్రములను, ఒకప్పుడును తఱుఁగని పాఁడిని, అతిథిజనుల రాకపోకలచే పావనమైన గృహమును, ఇలుదీర్చు తలిదండ్రులను, అనుకూలవతియగు భార్యను, శుశ్రూషావికస్వరహృదయంబగు శిష్యగణమును ఇచ్చి కావ్యబ్రహ్మ పెద్దనార్యుఁడు తన సృజించిన ప్రవరునకు అనంతమగు సంసారసుఖమును కూర్చినాఁడు.

ప్రవరునకు సంసారమున అట్టి అనంతసుఖమును కూర్చిన కారణగుణములను విడఁదీసి వివరించి పరామర్శింతము.

—: వా స యో గ్య త :—

ప్రవరుని సంసారసుఖమునకు మూలదుంపయైనది ఆతఁడు కాఁపురమున్న అరుణాస్పదపురముయొక్క వాసయోగ్యత.

ఎట్టి సంసారమైనను సుఖవంతమైయుండుటకు ఉండు ఊరు తృణకాష్ఠజలసమృద్ధమై యుండవలయును, నదీతీర

భూములు ఎల్లప్పుడును జనాకీర్ణములును, సుభిక్షములును నై యుండుటకుఁ గారణములు అవి తృణకాష్ఠజలసమృద్ధములై యుండుటే.

ప్రవరుని స్వగ్రామమగు అరుణాస్పదము వరణాద్వీపవతీ తటాంచలమున విలసిల్లినది. అగుటచే నది తృణకాష్ఠజల సమృద్ధమై యుండెననుటకు సందేహము లేదు.

మఱియు ప్రవరునివంటి కర్మఠునకు వరణవంటి 'ఎప్పుడు నెడతెగక పాఱు నేఱు' అనంతమగు వినియోగసుఖము నీయఁ జాలును.

అంబరచుంబియైన అచ్చటి వప్రముతీరు, చంద్రమండలమునందలి జింకను సయితము తెల్లఁగాఁ జేయుఁజాలు అచ్చటి పాలగచ్చుమేడల యొప్పు, ముదిమదిదప్పిన సరస్వతీనాథుని మెచ్చని అచ్చటి విప్రుల విద్యాప్రౌఢి, బంటునంపి భార్గవునైన బింకమున బవరమునకుఁ బిలపించు నచ్చటి రాజుల శౌర్యసంపద, ధనాధినాథుఁడైన కుబేరునిసయితము పోషింపఁగల నచ్చటి కోమటుల ధనసంపద, ఆదిభిక్షువు భైక్షమైన మాన్పఁజాలు నచ్చటి శూద్రుల హలముఖాత్తవిభూతి, రంభాదులనైన నోరయఁ గానెకొంగువ వారించి కడపఁగల యచ్చటి వెలయాండ్ర నాట్యరేఖాకళాధురంధతానిరూఢి అరుణాస్పదపురముయొక్క వాసయోగ్యతకును, అచటి పౌరుల సుఖజీవన స్థితికిని ప్రబలనిదర్శనములై యున్నవి.

ఇట్లు సుఖజీవనమునకు వలయు అనుకూలవాతావరణమును గలిగి ఆ పట్టణము జనాకీర్ణమై మహీకంఠహారతరళస్ఫూర్తిని విడంబించినది.

అట్టి సుఖజీవనస్థితికిఁ దావలమైన వాతావరణముగల

పట్టణరాజమున ప్రవరుఁడు 'శమంబు దమంబు గల' విద్యా వంతుఁడును, 'శీలము కులము గల' ధనవంతుఁడును అయిన పౌరుఁడై విలసిల్లెను.

ఈసంగతి ప్రవరుని సంసారసుఖమున కేదును లోపము లేదన్న విషయమును తెల్లము చేయుచున్నది.

అరుణాస్పదపురముయొక్క వాసయోగ్యత ప్రవరుని సంసారసుఖమునకు మూలమంప యైనది.

—: ధ నా ఢ్య త :—

ప్రవరుని అనంతమైన కుటుంబసౌఖ్యమునకుఁ దోడ్పడిన రెండవ కారణము అతని ధనాఢ్యత.

ఉన్న ఊరు ఎంత మంచిదైనను, ఎంత తృణకాష్ఠజల సమృద్ధిగలదైనను చేతఁ బైసాలేక 'నిత్యాశనశూన్యంబగు దైన్యంబు'న నున్నవాఁడు అచ్చట సంసారసుఖ మనుభవింప నేరఁడు.

ఉ. సంపదచేతఁగాని కొనసాగవుసువ్వె గృహస్థధర్మముల్.

—పాండురంగమాహాత్మ్యము.

అనికదా అనుభవజ్ఞు లందురు.

మ. బలవద్దైన్యము వక్త్రిగహ్వరము గాఁ బాల్పట్లఁ గొన్నట్టి య
ప్పాలు మైచాఱలు గాఁగ బాలరుదితంబు ల్మ్రోఁగుటల్గాఁగ

—కేయూరబాహుచరిత్ర

దారిద్ర్యశార్దూలము ఏయింటియందు తిరుగాడుచుం డునో ఆ యింటియజమానునికి శాంతిసుఖములు చంద్రమామ ఘటికలు.

ప్రవరునిసంసారమును ఎప్పుడును ఋణ మను పాతకము

తాఁకలేదు; దారిద్ర్య మను శార్దూలము చూడలేదు. ఏమందురా ? ప్రవరుఁడు ధనాఢ్యుఁడు. దేహి అని ఒకరిని చేయిచాఁచి యాచింపవలసిన అవసర మాతనికి లేదు. అతని మాన్యక్షేత్రములు పెక్కుచందముల పండుచుండును. అగుటచే నాతని యింటియందు ఒకప్పుడును పాఁడిపంటలు తఱుఁగవు.

ఇంతటి సంపన్నుఁడు కావుననే అతఁడు అర్ఘమూలమైన అతిథిపూజ చేసి, సిరికిం దరమైన దానర క్తిని చూపి గృహస్థాశ్రమధర్మము నిర్వహింపఁగలిగినను సంతోషసుఖమును పొందినాఁడు.

ధనసంపద, కృషిసంపద యున్నగు సంపదలకుఁ బేరు మోసిన అరుణాస్పదపురమున ప్రవరుఁడు మాన్యక్షేత్రము లందుఁ బెక్కుచందాలం బండిన పంట, ఒకప్పుడును తఱుఁగని పాఁడి అను కృషిసంపద; బహుధనమూలకమైన వివిధాధ్వరముల నిర్వహించిన ధనసంపద; అనారతాధ్యాపనతత్పరమైన విద్యాసంపద కలిగిన పౌరుఁడై సుఖియించెను.

—: జీవత్తాతపాదత్వము :—

ప్రవరుని సంసారసుఖపాదపమునకు దోహదముచేసిన మూఁడవ కారణము అతని జీవత్తాతపాదత్వము.

ఉన్నఊరు మంచిదియైనను, పిసిగికొని తినుటకుఁ గావలసినంత యున్నను చిన్నటనాఁటనే తల్లిదండ్రులను గోల్పోయి కుటుంబభారమును వహింపవలసిన సంసారికి పూర్తిసుఖ ముండదు, సరికదా అతనికి గృహచ్ఛిద్రములు చెవులులేని వేదన గల్గించును.

చిన్నతనముననే సంసారనిర్వహణభారమును పూనిన

వారికి సంసారసుఖము మనఃక్లేశమలినము కాకతప్పదు. చూడుఁడు:

చ. జనకభుజావనీజముల చల్లనినీడ వసించియుండు నం
దనులు జగంబున న్సుఖులు తండ్రి మృతుం డయి చన్నఁ జిన్ననాఁ
డ నిజకుటుంబభారము గడంగి వహించుచుఁ దీవ్రదుఃఖ వే
దనబడు వారపుణ్యులు విధాతృనిచేఁత భుజంగమేశ్వరా!

—మార్కండేయపురాణము

అనికదా సారమతులు వచియించెదరు.

ప్రవరుని విషయమున నిట్టి కష్టములు లేవు. ప్రవరుఁడు జీవత్తాతపాదుఁడు. అగుటనే ఈవిషయమున ఆతని కెట్టికష్టములును లేవనుట.

సంసారశకటచోదనమునఁ దమ చీము నెత్తురులు వెచ్చించి యేళ్లుగడపిన ఆతని తల్లిదండ్రులు పురాణదంపతు లగు పార్వతీపరమేశ్వరులవలె సుఖులై కూడియుండి ఇంటి పెత్తనము చక్కఁబెట్టుచుండిరి.

ఎట్టి లోపాలోపము లున్నను అనుభవశాలులు, అనురాగయుక్తులు నగు తల్లిదండ్రులే సవరించుకొనిపోవుచుండఁగా ఆ కుటుంబి హృదయము సంసారవిషయమున ఆందోళితము కాలేదు; చింతావకుంఠితము కాలేదు. ఆతని సౌఖ్యతురంగమునకు కశాఘాత మనునది లేనేలేదు. ప్రవరునకు సంసారమున సుఖమే కాని బాధ్యత లేదు; అనుభవమే కాని శ్రమ లేదు.

—: అ ను కూ ల కు ల కాం త :—

ప్రవరుని కుటుంబసుఖమునకుఁ గారణభూతమైన మఱి యొక విషయము అనుకూలపతియగు భార్యవలని లాభము.

వాసయోగ్యమైన గ్రామము, తఱుఁగని పాఁడిపంటలు,

ఇలుదీర్చెడి తలిదండ్రులు ఉన్నను సంసారికి వహ్నిసాక్షికమగు సఖ్యమున జన్మాంతమువఱకు పార్శ్వవర్తినియై మెలఁగు కుల కాంత అనుకూల కాదేని ఇనుమంతయైన శాంతిసుఖములు లభింపవు.

క. చెప్పినపని యొనరించిన
యప్పణఁతుక కల్గ గహము మది సదనమగున్
జెప్పినపని యొనరింపని
యప్పణఁతుక కల్గ సదన మది గహనమగున్.

—చాటుధార.

అనుమాట మంచిఅనుభవముమీఁద చెప్పినదికదా!

భార్యవిషయమునఁగూడ ప్రవరాఖ్యుఁడు మంచి యదృష్టవంతుఁడు. 'కమనీయకౌతుకశ్రీవిధిఁగూఁకటుల్ నొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ' అతనిని సౌఖ్యావహయై సేవించుచుండెను.

అభ్యాగతసేవాపరతంత్రసకలజీవనుఁడైన ప్రవరాఖ్యునకు ఆతనిభార్య సర్వవిధములఁ దగినది. ఎంతమంది అతిథులు వచ్చినను ఆమె వండుటకుఁ జిరాకుపడదు. అతిథులు అర్ధరాత్రి వచ్చినను ఆమె ఆనందముతో వారికిఁ గావలసిన పదార్థముల నెల్ల వండిపెట్టును. సహధర్మచారిణి సౌజన్యము వలన ప్రవరుని అతిథిపూజాభిలాష కార్యరూపము దాల్చెను. అందువలన ఆతఁడు గృహమేధిప్రవరుఁడయ్యెను.

'వలపున్, ననుపున్, దగవున్, బ్రియంబునున్' సోమిదమ్మవలన నాతనికి నిండారినవి. సహధర్మచారిణి తలలో నాలుకయై తెన్నెప్పుడును ఎడఁబాసి యుండని పదదాసియై సేవించుచుండ ప్రవరుఁడు అనంతమగు సంసారసుఖ మనుభవించుచుండెను.

—: విభవానుగుణవితరణ :—

ప్రవరుని సంసారసుఖమునకుఁ గారణభూతమైన వేఱొక విషయము 'విభవానుగుణమైన ఆతని వితరణోన్మేషంబు.'

ధనమునకు గతులు మూఁడు: భోగము, దానము, నాశము అని. 'కట్టక, కుడువక, యొరులకుఁ బెట్టక' 'ధనము గాఁపున్నదయ్యాలఁ దఱుమువారి' సంపదకు గతి నాశనమే, అట్టిది సుఖ మీయఁజాలదు,

సుఖకరమైన లక్ష్మికి త్యాగభోగములు రతులు. భగవంతుఁడు తన కిచ్చిన సంపదను తా ననుభవించుటవలన కలిగెడి ఆనందము ఆ సంపదలోఁ గొంత యితరులకుఁ బంచి యిచ్చుటవలనఁ గలిగెడు తృప్తితో మిళితమైనప్పుడే కుటుంబి జీవనము అవంధ్యజీవన మగును; ఆతని సంసారసుఖము సమగ్రమగును.

ప్రవరుని ధనసంపద భోగము, దానము అను రెండు గతులను బొంది ఆతనికి సావధికముగాని సంసారసుఖము నిచ్చినది.

> 'చెక్కుటద్దములందు జిగివెల్లువలు చిందు
> రమణీయమణికుండలములు'

చెవులకు—

> 'పసిఁడిప్రాఁతచెఱంగు మిసిమిదోఁపఁ జెలంగు
> నరుణాంశుకోత్తరీయంబు'

భుజములమీఁద—

> 'సరిలేని రాకట్టు జాళువామొలకట్టు'

నడుముకు—

'కాశికాముద్ర యిడిన యుంగరము'

వ్రేలికి—

'పసిఁడితోరము'

బాహువునకుఁ—

బెట్టి ఆతఁడు తన ధనమును భోగించినాఁడు. అతిథి జనులకుఁ బెట్టి ఆతఁడు తన ధనమును త్యాగము చేసినాఁడు.

ప్రతిదినమును ప్రవరుని గృహాంతరమున అతిథిజనములు పావనస్నానవిధాన్నపానములచేత సంతృప్తులగుచు ఆఅభ్యాగత సేవాకాంక్షకు ఫలసిద్ధియు, ఆతని గృహస్థధర్మమునకు వినియోగమును గలిగించి ఆతనికి తృప్తిసుఖముల నిచ్చుచుండెను.

—: విధేయశిష్యగణము :—

ప్రవరుని కుటుంబసౌఖ్యమునకు సహకారియైన మఱి యొండు విషయము 'అజస్రశుశ్రూషావికస్వరహృదయం' బగు ఆతని శిష్యగణము.

వటువులకు విద్యగఱపి వేదవిద్యాపారంపర్యముగ వెలయించుట ఆర్యవిప్రులకు విధ్యుక్తధర్మము. అంబురుహగర్భకులాభరణమును, అనారతాధ్యాపనతత్పరుండును అయిన ప్రవరుఁడా కారణమున శిష్యులను చేరఁదీసి వారికి వేదవిద్యల నేర్పెను.

అట్లగుట నాతఁడు స్వధర్మసేవ యథామతిని నిర్వహించితిని గదా యను సంతోషసుఖమును బొందఁగల్గినాఁడు.

ఇట్టి సంతోషసుఖమే గాక ప్రవరునకు ఆతని శిష్యుల వలనఁ బ్రత్యేకసుఖముకూడఁ గలిగినది. ఆతనియొద్ద విద్యాభిక్షను గొను విద్యార్థులు గురువునకు పంగనామములు పెట్టురకము గాక ప్రవరుఁడు అరుణోదయమున వరణానదికి స్నానమునకుఁ బోవునపుడు సయితము ఆతని ననుసరించుచు నెల్ల

వేళల నాతనికిఁ దోడునీడలై క్రీడించుచు సచ్ఛాత్రులై యుండిరి.

అట్లగుట వారు ప్రవరుని అనారతాధ్యాపనతత్పరత్వమునకు ఉచితోపయోగ్యవృత్తి నాపాదించి అందుచే ఆతని సంసారసుఖమునకు సమగ్రత్వమును సంపాదించిరి.

—: నియమబద్ధ జీవనము :—

ప్రవరుని సంసారసుఖమునకుఁ దోడ్పడిన మఱియొండు విషయము ఆతని నియమబద్ధమైన జీవనము.

ఎవఁడు తన జీవనమును నియమబద్ధ మొనర్చుకొనునో వాఁడు ఆరోగ్యవద్దేహుఁడును, సుఖియు నగును. పెందలకడ లేచుట, అరుణోదయమున శీతలజలస్నానము చేయుట, రమణీయప్రకృతికి వేలముపట్టుచు నదీతీరమున సమిత్కుశార్థము సంచరించుట – ఇత్యాది నియమములను ప్రవరుఁడు దినదినమును పాటించును.

సీ. వరణాతరంగిణీదరవికస్వరనూత్న
కమలకషాయగంధము వహించి
ప్రత్యూషపవనాంకురములు పైకొను...

బ్రాహ్మీముహూర్తమున ప్రవరుఁడు ప్రతిదినమును నిద్ర మేల్కొనును. అప్పు డాతఁడు శిష్యసమేతుఁడై నదికిఁ బోవును. అం దాతఁడు దోవతులు ఉదికికొని అఘమర్షణస్నానము ఆచరించును.

పిమ్మట ఆతఁడు సాంధ్యకృత్యమును దీర్చికొనును, సావిత్రిని జపియించును; ఆ నది సైకతస్థలిని కర్మసాక్షి కెఱఁగును. సస్యశ్యామలములైన ఆప్రాంతభూములందు ఫల

సమిత్కుశకుసుమాదిబహుపదార్థములను దేవతార్చనార్థము సంగ్రహించుకొని శిష్యులతో నింటికి వచ్చును.

ఇట్టి నియమముల నవలంబించి తదాచరణమునఁ 'బ్రజ దన్ను మెచ్చిచూడ' ప్రవరుఁడు ఉదంచితసౌఖ్యమునఁ దేలియాడెను.

—: నిత్యకృత్యనిర్వర్తనము :—

ప్రవరుని సంసారసుఖమునకు దోహదమొసఁగిన మఱియొక విషయము నిత్యకృత్యసత్కర్మకలాపనిర్వర్తనమువలన నాతనికిఁ గలిగిన తృప్తి.

లేఁబ్రాయముననే వివిధాధ్వరముల నిర్వహించిన తృప్తి; ప్రతిదినక్రమమున 'వేలిమి, సురార్చన, విప్రసపర్య' మున్నగు వైదికకర్మల నిర్వర్తించుచున్న తనివి- కర్మక్షితియైన ఆర్యావర్తదేశమునఁబుట్టి వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీక్షాపరతంత్రుఁడైన ప్రవరుని సంసారసుఖమును పోషించినవి.

తన సంసారసుఖమునకుఁ బోషణ మిచ్చిన వైదికకర్మనిష్ఠలయందు ఆతఁడు పూర్తిగ నిమగ్నుఁడయ్యెను గావుననే ఆతనికి అరణులు, దర్భలు, అగ్నులు ప్రియములైనట్లు అన్యములు గాకపోయెను.

ఆ నిత్యాగ్నిహోత్రికి—

మ. ......రేపును మాపు హవ్యములచేతన్ దృప్తుఁడౌ వహ్ని
సత్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము

అగ్గలమై యుండి ఆతని సంసారసుఖమును రెట్టించెను.

ఇట్లు వాసయోగ్యమైన గ్రామమున కాఁపురము గలిగి, పెక్కుచందాలంబందు మాన్యక్షేత్రములు కలిగి, ఒకప్పుడును తఱుఁగని పాఁడి కలిగి, అతిథిజనుల రాకపోకలచే పావనమైన

గృహము కలిగి, ఇలుదీర్చు తలిదండ్రులు కలిగి, సాధ్వ్యవహారయై భజియించు భార్య కలిగి, తోడునీడలైన శిష్యులను కలిగి ప్రవరుఁడు నిరవధికమైన సంసారసౌఖ్యమునందు ఓలలాడెను.

అట్టి ఆతని సుఖమునకు దివ్యత్వమిచ్చినది ఆకుటుంబము నందలి వివిధవ్యక్తులనడుమ నెలకొనిన పరస్పరప్రేమ. ప్రవరుని నిలయము నిజముగా ప్రేమనిలయము అనవచ్చును. చూడుఁడు:

ఆయింటియందు తల్లి ప్రాజ్ఞుఁడై యజ్ఞమునొనర్చి సోమయాజియైన తన కుమారుని పిట్టదోషము తగులునని యోమఱియేమో ఎపుడును సంధ్యలయందు నిలువెళ్ళనీక రక్షించును.

ఆయింటియందు తండ్రి తనయుని 'నిముసంబుగానక యున్న నూరెల్ల నరకము.'

ఆయింటియందు యజమానుఁడు తాను కార్యార్థియై యెక్కడకుఁ బోయినను కడువృద్ధులగు జననీజనకులకు భోజనము వేళ యతిక్రమించి వారు ఆఁకలిచే సోలుచుఁ, జింతతోఁ దన్నెదురుచూచుచు నుండకుండ వేళకే యింటికిఁ జేరుకొనుచుండును.

ఆయింటియందు యజమానురాలు పతికి అనుకూలవతియై ఆతని మనసులో వర్తించును.

ఆయింటియందు శిష్యులు గురువర్యునకుఁ దోడునీడలై క్రీడింతురు.

ఇట్లు ప్రేమసూత్రముచే నిబద్ధమైన వ్యక్తులుగల సంసారమునకు అధిపతియైన వానిసుఖము కొలందులువెట్టఁ దరము కానిది. వానికి భూతలమునందే సశరీరస్వర్గసుఖము సమకొనియె నన్నమాట.

ప్రవరుని అగ్గలమగు నిట్టి సంసారసుఖ మనుభవించు వానిఁగాఁ జిత్రించుటవలనఁ గావ్యమున సిద్ధించిన పరమప్రయోజన మేమి?

ప్రవరుని సంసారమువంటి సంసారమును 'సంసారాంధువు' అని- 'కౌగిలిఁ గో వెన్నవలె కరంగు నలివేణి,' 'తరుణి' యగు వరూధిని చెప్పినను పాఠకులు ఒప్పుకొనఁగలరా?

౧

# ప్రవరుఁడు - పెద్దన్న

తాను సృజించు పాత్రలలో కవి ఒక్కొక్కపాత్రను అభిమానపాత్రగాఁ జేకొనుననుట అనుభవజ్ఞులకు పునరుక్తవిషయము. అట్లు చేకొనిన అభిమానపాత్రకు కవి ప్రయత్నముగనో, అప్రయత్నముగనో స్వీయగుణములను అన్నిటినో, కొన్నిటినో అంకిత మొనర్చుట అరుదు కాదు.

ఆంగ్లనాటకకవిబ్రహ్మ షేక్సుపియరు తన 'టెంపెస్టు' రూపకములో 'ప్రోస్పెరో' పాత్రమున ఆత్మజీవితమును కొంత అనువుపఱచియున్నాఁడు. అట్లే మనుచరిత్రమున అల్లసాని పెద్దన్న ప్రవరునిగుణవర్ణనమున స్వీయగుణముల కొన్నిటిని పొసఁగించెనని విమర్శకదృష్టితో ఆ ప్రబంధమును పఠించు వారికిఁ దోఁపకమానదు.

మానదు కాదు, తప్పక తోఁచును.

ప్రవరునికథ వర్ణించు ఘట్టములే మనుచరిత్రమున రసకందాయములు. మిగిలినఘట్టములందు అట్టి రుచివిస్ఫూర్తి లేదు. ప్రవరుఁడు తనఅభిమానపాత్రగావుననే పెద్దన్న ప్రవరుని కథపట్టులను మనోహరముగ వర్ణించి విశేషరుచి చూపఁకలిగినాఁడని అనుకొననగును.

మారన మార్కండేయపురాణమునందలి స్వారోచిష మనుజన్మవృత్తాంతమును మూలముగాఁ గొని పెద్దన్న మనుచరిత్ర రచియించెను.

మార్కండేయపురాణమున

క. వరణాతటినీతటమున
వరుణాస్పద మను పురంబునం దతులగుణో
త్తరుఁడు గలఁ డొక్క ధరణీ
సురవరుఁ డశ్వినులకంటె సుందరుఁ డెంతున్.

చ. అతిసుకుమారమూర్తి ప్రవరాఖ్యుఁ డుదాత్తుఁడు వేదపారగుం
డతిథిజనార్చనాభిరతుఁడై చరియించుచు శైలకాననాం
చితసకలావనీతలవిశేషము లెల్లను బ్రీతిఁ గన్గొన
న్మతిఁ గడుఁ గోరుచుండ......

అని ప్రవరుఁడు అభివర్ణింపఁబడెను.

అట్లగుట మారన వర్ణించిన ప్రవరుఁడు

౧. సుందరసుకుమారమూర్తి;

౨. ఉదాత్తుఁడు, అతులగుణోత్తరుఁడు;

౩. వేదపారగుఁడు;

౪. అతిథిజనార్చనాభిరతుఁడు;

౫. సకలావనీతలవిశేషములఁ జూడఁగోరువాఁడు;

౬. ధరణీసురవరుఁడు.

ఇఁక పెద్దన్న వర్ణించిన ప్రవరుఁడు

౧. మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి, అలేఖ్యతనూవిలాసుఁడు;

౨. భాషాపరశేషభోగి;

౩. వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీక్షాపరతంత్రుఁడు;

౪. అంబురుహాగర్భకులాభరణము;

౫. అనారతాధ్యాపనతత్పరుండు;

౬. విషయేచ్ఛలేనివాఁడు;

౭. గురుజనభక్తికలవాఁడు;
౮. శిష్యులను జేరఁదీసి విద్య గఱపువాఁడు;
౯. నిర్దోషమైన సాలగ్రామదానముసయితము గ్రహింపని రాజసగుణము కలవాఁడు;
౧౦. ఒకప్పుడును ఇంటియందు పాఁడియు, పంటయు తఱుఁగని ధనాఢ్యుఁడు;
౧౧. అభ్యాగతసకలసేవాపరతంత్రసకలజీవనుఁడు;
౧౨. 'వలయు భోజ్యంబు లింట నవ్వారిగాఁ' గూర్చి మార్గస్థులకు సర్వకాలములందు అన్నదాన మొనర్చువాఁడు.
౧౩. తీర్థసందర్శనాభిలాషి.

ఈరెండువర్ణనములు పోల్చి చూచితిమేని ౧. బ్రాహ్మణవంశము, ౨. సౌందర్యము, ౩. వేదాధ్యయనము, ౪. అతిథిజనార్చనాభిరతి, ౫. తీర్థసందర్శనాభిలాష; ౬. విషయేచ్ఛ మొదలగు తుచ్ఛగుణములులేని ఉదాత్తత- అను ఆఱు ధర్మములును మారన, పెద్దన లిరువురు సమానముగ ప్రవరునియందారోపించిరని తేటతెల్లమగును.

౧. శిష్యశిక్షణము, ౨. రాజసగుణము, ౩. ధనాఢ్యత, ౪. భాషాపరశేషభోగిత్వము, ౫. దాననిరతి, ౬. గురుజనభక్తి అనునవి పెద్దన్న ప్రవరునియందు క్రొత్తగా అంకిత మొనర్చిన విశేషగుణములు.

సౌందర్యము, వైరాగ్యము, అతిథిసేవానిరతి, తీర్థసందర్శనాభిలాష మున్నగు ప్రవరునిగుణములు ఉత్తరకథావిస్తృతికి మూలబీజములు.

పెద్దన్న క్రొత్తగా ఆరోపించిన శిష్యశిక్షణము, రాజస

గుణము, ధనాఢ్యత, భాషాపరశేషభోగిత్వము మున్నగు అతనిగుణములు తరువాతికథను పెంపొందించుట కెట్లును సహకారులుగావు.

కాకపోవుటతో సరిపోయినదా ! అవి కథాసారస్యమునుగూడ చెడఁగొట్టుటకుఁ గొంతవఱకుఁ దోడ్పడినవి.

ఎట్లందురా ! భాషాపరశేషభోగియైన ప్రవరుఁడు వరూథిని కామశాస్త్రోపన్యాసమునకు వాయెత్తలేకపోవుట యొక గొప్పలోపము.

అగుచో నొకప్రశ్న.

ఉత్తరకథావిస్తృతికి ఉపయోగపడకుండుటయే గాక కథాసారస్యమునుకూడ చెడఁగొట్టుటకు తోడ్పడిన ఈ కొత్తగుణములు ప్రవరునియందు పెద్దన్న ఏల ఆరోపించెను !

దీని కొక్కటే జవాబు.

తా నభిమానపాత్రముగాఁ జేకొనిన ప్రవరునియందు స్వీయగుణములను కొన్నిటిని హత్తించ పెద్దన్న ముచ్చటపడినాఁడు. అవి కథాసారస్యమును ఒక్కింత డిందుపాటునొందించునను భయముకాని, ఉత్తరకథావిస్తృతికి సహకారము కావను చింతకాని అట్టిముచ్చటలో ఆతనికి తట్టనేలేదు.

పెద్దన్న ప్రవరునియందు నూతనముగ ఆరోపించిన శిష్యశిక్షణము, రాజసగుణము, ధనాఢ్యత, భాషాపరశేషభోగిత్వము, దాననిరతి, గురుజనభక్తి అను గుణములు ఆంధ్రకవితాపితామహుని స్వీయగుణములని మన మిఁక నిర్ధారణచేయవలసియున్నది.

అందుల కాతని జీవితచరిత్రమునుండి నిదర్శనములను ఎత్తి పరిశీలింతము.

—: ౧. శిష్యశిక్షణము :—

వేదవేదాంగములయందు అనంతకౌశలము గడించిన కోవిదుఁడగుటచే ప్రవరుఁడు శిష్యులను చేరఁదీసి వారికి విద్యాబుద్ధులఁ గఱపెను.

శిష్యులయందు ప్రవరునకు వాత్సల్య మధికము. తాను వరణానదికి స్నానమునకుఁ బోవునపుడుసయితము వారిని వెంట బెట్టుకొనిపోవును. శిష్యులతో నింత అరమరలు లేకయుండిన గురువు కావుననే ప్రవరుఁడు హిమాలయపర్వతమున 'మిన్నులు వడ్డచోట' నుండిపోయినప్పుడు

'కడఁ దోడునీడలై క్రీడించు సచ్ఛాత్రు
లింతకు నెంత చింతింతురొక్కొ'

అని (తల్లిని, తండ్రిని, భార్యను గూర్చి చింతించిన నోటితో) శిష్యులఁగూర్చి కూడఁ జింతించినాఁడు.

పెద్దన్నయు తాను ఆంధ్రకవితాపితామహుఁడుగావున కొంతమంది యువకులకుఁ గవితాశిక్ష యొసంగినాఁడు.

ఇందుకు నిదర్శనములు చూపవచ్చును.

భట్టుమూర్తి, తెనాలి రామకృష్ణుఁడు, పింగళి సూరనలు కవిత్వమున ప్రథమపాఠములు పెద్దన్నయొద్దనే చదివిరనుటకు కథలుగలవు.

భట్టుమూర్తి పెద్దన్నశిష్యుఁడనుకథను వసుమనుచరిత్రలరచనాసాదృశ్యము కొంత పోషింపకపోదు.

రామకృష్ణుఁడు ఆంధ్రకవితాపితామహుని శిష్యుఁడను కథకు

క. కవి యల్లసాని పెద్దన
కవి తిక్కనసోమయాజి గణుతింపంగాఁ

గవి నేను రామకృష్ణుఁడఁ
గవి యను నామంబు నీరుకాకికి లేదే?

అను రామకృష్ణునిచాటుపద్యము జీవము పోయుచున్నది. గురువును అమితపూజ్యభావముతోఁజూచు శిష్యునివలెనే ఈ పద్యమున రామకృష్ణుఁడు తన్ను ఎంతయో కొంచెపఱచుకొని పెద్దన్నకు కవిబ్రహ్మయగు తిక్కనతో సమానస్థాన మిచ్చి యున్నాఁడు.

ఇఁక పింగళి సూరన విషయము: అతఁడు పెద్దన్నకు మనుమరాలిపెనిమిటి అనికదా ఐతిహ్యము. అతఁడు పెద్ద నార్యుని శిష్యుఁడై యుండుటకు అవకాశముకలదని ఈ చుట్టరికము సూచించుచున్నది.

పింగళి సూరన, భట్టుమూర్తి, తెనాలి రామకృష్ణుఁడును అష్టదిగ్గజములలోనివారని బలవత్తరమైన జనశ్రుతి చాటుచున్నను వారు కృష్ణరాయలకాలమున గ్రంథములేవియు రచియించియుండలేదు. రాయలమరణానంతరము కొలఁది కాలమునకే వారు గ్రంథరచనకు దొడఁగిరి.

ఇట్లగుటచే వారు రాయలకాలమున పిన్నలై పెద్దన యొద్ద గురుశుశ్రూష చేయుచు 'భువనవిజయము'నందు ప్రాజ్ఞులతో నిరంతరగోష్ఠి, కవిత్వమున జిజ్ఞాస యొనర్చి అనుభవజ్ఞులైన పిదప గ్రంథముల రచియించిరనుట కెడ మెంతేనియుఁ గలదు.

—: ౨. రాజసగుణము :—

తనయోగ్యతను జూచి రాజులు నిర్దోషమైన సాల గ్రామదానమును ఈయవచ్చినను ప్రవరుఁడు తీసికొనఁడు. ఇది అతని రాజసగుణమును జాటుచున్నది. మహారాజు లిచ్చిన

మాన్యక్షేత్రములు కుటుంబపోషణమున కాధారమగుట ఆతనికి సమ్మతమే. కాని అట్టిరాజులే గౌరవించి ఇచ్చు నిర్దోషమైన సాలగ్రామదానపరిగ్రహణమునకు ఆతని రాజసగుణము అడ్డు తగిలినది.

ప్రవరునివలె పెద్దన్నయు రాజసుఁడే.

తనకు ఆంధ్రకవితాపితామహుఁడన్న బిరుదమిచ్చి అష్ట దిగ్గజములలో శ్రేష్ఠత్వమొసఁగి ఆదరాతిశయముతో గౌరవించిన కృష్ణదేవరాయ లొకప్పుడు ఏదేని కృతి రచింపుమని కోరఁగా రాజసగుణము గల పెద్దన్న

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పుత
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్
దొరకిన గాక యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే?

అని నిశ్శంకముగ నిరాకరించెను.

—: 3. ధనాఢ్యత :—

ప్రవరుఁడు 'ధనాఢ్యుఁడు.' ఆతని మాన్యపుభూములు 'పెక్కు చందాలన్ పండు'చుండును. కావున ప్రవరునిఇంట పాఁడిపంటలు ఎల్లప్పుడును కొల్లలుగా నుండును.

మఱి యిఁక పెద్దన్న ధనాఢ్యత మనము విచారింప నవసరము లేదు. విజయనగరసామ్రాజ్యనియంతయైన కృష్ణదేవ రాయలకు పెద్దన్న 'హితుఁడు.' అట్లగుట రాయలవలన అనే కాగ్రహారములను పొంది ఆతఁడు ధనాఢ్యుఁడై మహాభోగముల చూఱఁగొనినాఁడు. పైఁగా పెద్దన్న పరిపాలనాదక్షుఁడైన మాండలికుఁడు.

—: ౪. భాషాపరశేషభోగిత్వము :—

ప్రవరుఁడు భాషాపరశేషభోగి.

పెద్దనార్యుని భాషాపరశేషభోగిత్వమునకు మనుచరిత్ర యొక దర్పణము. మనుచరిత్రకృత్యాదిని కృష్ణదేవరాయలు కవితాపితామహుని 'చతురవచోనిధి' అని పేర్కొనుచున్నాఁడు.

—: ౫. దాననిరతి :—

ప్రవరుని దాననిరతి మెచ్చఁదగినది. దానతత్పరుఁడైన ఆతఁడు భోజనపదార్థములు కొల్లలుగాఁ దెచ్చి ఇంటియందుంచును. ఎంతమంది వచ్చినను, ఎప్పుడు వచ్చినను విసుగు విరామములులేక అతిథులకు అమర్చిపెట్టి ఆతని సహధర్మచారిణి అన్నపూర్ణను దలపించుచుండును.

పెద్దన్న దాననిరతి వెల్లడించుటకు బలవత్తరమైన నిదర్శనమొకటి కలదు. తాను కృష్ణరాయలవలన పొందిన కోకట మను అగ్రహారమున కాతఁడు శఠకోపపురమని ఆత్మగురుఁడగు శఠకోపయతి పేరుపెట్టి విప్రులకు సర్వాగ్రహారముగా దానముచేసెను. ఇదికాక ఆతఁ డనేకదేవాలయములకు భూదానములు చేసినట్లు నిదర్శనములు కలవు.

—: ౬. గురుజనభక్తి :—

ప్రవరుఁడు యజ్ఞమొనర్చి నలుగురిలో గౌరవప్రపత్తులు సంపాదించెను. అయినను ఆతఁడు ఇంటిపెత్తనమును స్వీకరింపలేదు. పార్వతీపరమేశ్వరులవలెనున్న తన తల్లిదండ్రు లనిన ఆతనికి అమితమగు భక్తి. అట్లగుట గృహకృత్యవిచారణ తలిదండ్రులకు వదలి ప్రవరుఁడు వారియాజ్ఞకుఁ బద్ధుఁడై యుండువాఁడు.

౯

# పారిజాతాపహరణ ప్రబంధపరామర్శ

క. లోకమునం గల కవులకు
నీ కవనపుఠీవి యబ్బునే? కూపనట
ద్భేకములకు, నాకధునీ
శీకరముల చెమ్మ! నంది సింగయ తిమ్మా!

—చాటుధార.

—: ఉపోద్ఘాతము :—

ఆంధ్రప్రబంధమణిహారమునఁ బారిజాతాపహరణమొక యమూల్యమణి. దీనియందలి చవి, చక్కన - జవము, జీవము కలిగి ఆంధ్రతావాసనల మిటారించి పరమళించు మృదుమధుర కవితఁ దనివితీఱఁ జూఱకొని కవికుంజరులు- 'ముక్కు తిమ్మనార్య ముద్దుపలుకు'- అను బిరుద మిడిరి.

ఈ రసవత్ప్రబంధరచయిత యగు నంది తిమ్మన 'భువనవిజయాఖ్యసంసద్భవన' మలంకరించిన అష్టదిగ్గజములలో నెన్నిక గన్న విద్వత్కవికుంజరుఁడు.

—: కవియుదంతము :—

తిమ్మన ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌశికగోత్రుఁడు; నంది సింగనకును దిమ్మాంబకును దనయుఁడు. 'సకలవిద్యావివేకచతురుండ'గు మలయమారుతకవీంద్రునకు మేనల్లుఁడు.

తిమ్మన 'కృష్ణరాయక్షితీశకరుణాసమాలబ్ధచతురంత

యానమహాగ్రహారసన్నానయుతుఁడు.' విద్యానగరమున ఆకాలమునందున్న 'శివాచార్య'పీఠాధిష్ఠాతల ముప్పురిలో నొకఁడును, 'శివపరాధీనమతియు' నగు అఘోరశివాచార్యున కీతఁడు శిష్యుఁడు. విశేషించి ఈతఁడు '(శ్రీ)మదుమామహేశ్వరవరప్రసాదలబ్ధసారస్వతాభినంది.'

నంది తిమ్మనకు ముక్కు తిమ్మన యని పౌరుషనామము కలుగుటకుఁ గారణ మింకను దెలిచాటుముచ్చటగనే యున్నది. ఇందుఁగూర్చి ప్రాకృతజనులలోఁ దలయుఁదోఁకయులేని కత యొకటి వ్యాపించి యున్నది. అది యేది అందురా?

శా. నానాసూనవితానవాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాఁకం దపం బంది యో
షానాసాకృతిఁ బూని సర్వసుమనస్సౌరభ్యసంవాసియై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్.

—వసుచరిత్ర. ఆ. ౨., ప. ౮౭.

అను నాసికావర్ణనపద్యరాజము నంది తిమ్మనరచన మఁట. రామరాజభూషణుఁడు దాని రామణీయకమున కలరి, విలిచి తన వసుచరిత్రమున నుటంకించుకొనెనఁట. అందుచే నితనికి ముక్కు తిమ్మన అనుపేరు కలిగిన దఁట. విశ్వాస్య మగునా?

ముక్కు పొడువుగనుండుటచే నీతని కీనామము కలిగి యుండుననుట సమంజసము; సంభావితము.

## —: కావ్యరచనకుఁ గారణము :—

రాజప్రేరణమే కావ్యకరణమునకుఁ దెలుగుసారస్వతమున విశేషకారణముగా నుండినది.

వేమనవలెఁ గేవలజిహ్వాచాపల్యము దీర్చుకొనుటకునై

పోతరాజువలెఁ 'కైవల్యపదంబుఁ జేరుటకునై', తిక్కనవలె 'నాంధ్రావళి మోదముం బొరయు'టకునై గ్రంథములు రచించినవారు ఆంధ్రవాఙ్మయమునం దరిది.

తిమ్మకవి ఈకావ్యము రచించుట జిహ్వాచాపల్యము దీర్చుకొనుటకుఁగాదు; కైవల్యపదముఁ జేరుటకుఁగాదు. నిజకవితాప్రాగల్భ్యప్రచురణార్థముకూడఁ గాదనుట అసమంజసమనఁజెల్లదు.

పారిజాతాపహరణకావ్యకరణమునకు హేతువు రాజప్రేరణ మంతకుముందే కాదు. ఏమందురా? రాజు తన్ను రావించుట, గ్రంథము రచించి కృతియిమ్మని కోరుట మొదలగువాని ఊసైన నీకవి యెత్తఁడయ్యె. దేవతాప్రార్థనమైన వెనువెంటనే కృతిపతివంశావళిని వర్ణింప దొరకొన్నాఁడు.

కావుటచే, ప్రణయకోపకారణమున విముఖులును, విరసులును నైన తిరుమలదేవికిని, రాయలకును సంధానము చేయుటయే ఈకృతి రచించుటకుఁ గల కారణ మను జనశ్రుతి సత్యమే అనుకొనవలయును.

రవరవలుపుట్టిన భార్యాభర్తలకు- సత్యభామకు, శ్రీకృష్ణునకు: తిరుమలదేవికి, రాయలకు- అనుసంధానము చేయవలయునను కవి యుద్దేశము పారిజాతాపహరణ ప్రథమాశ్వాసమున మిలమిల ఉరళించుచున్నది.

ద్వితీయాశ్వాసముదొట్టి అనవసరవర్ణనములు పెక్కులు తనకావ్యమునఁ దగిలించుకొనిన తిమ్మన ఈయభిప్రాయమే మనమున లేనిచోఁ బ్రథమాశ్వాసమునందును బురాదివర్ణనలు జొనిపి గ్రంథము పెంచియుండును.

శ్రీకృష్ణుఁడు సత్యభామ సరసపుటల్కఁ దీర్చు ఘట్ట

మును కృష్ణదేవరాయలకు సాధ్యమైనంతత్వరలో వినిపింపవల యునను కవిచంద్రుని ఆసక్తియే వర్ణనాంశములు కుంచించి కథావస్తువును ఆ ఘట్టమునకుఁ బరువెత్తించునట్లును, పురము మొదలగునవి వర్ణింపక ప్రారంభముననే కథావతరణ మొనర్చి కవి తనయుద్దేశమును అన్యాపదేశముగ, అనాలస్యముగ రాయలకు వినుచునట్లును జేసినది.

'పే రలుకం జెందినయట్టి కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే' అను అర్థాంతరన్యాసముచేఁ దన యభిమతము కృష్ణ రాయలకు నివేదించి కవి లబ్ధమనోరథుఁ డయ్యెను.

అట్లగుట తిరుమలదేవికిని, రాయలకును తిరిగి స్నేహము కల్పించుటయే ఏతత్కావ్యరచనకు హేతువని చేయెత్తి చెప్పనొప్పును.

అతిరహస్యస్థల మగు నంతిపురమున నడచిన ప్రణయ కలహవృత్తాంతము తిరుమలదేవి తిమ్మకవి చెవినూఁదుట పొసఁ గని విషయ మనుకొనఁ జెల్లదు.

తిమ్మన తిరుమలదేవి యరణపుకవి. అట్లగుట చనువు బలిమిని ఆమె తెలిపియుండవచ్చును. లేదా నెచ్చెలికత్తెలచేఁ జెప్పించి యుండవచ్చును.

మఱియు తిమ్మన వృద్ధుఁడగుట తిరుమలదేవికిఁ బితృ సముఁడు. కావున నాతనితో నెట్టిసంగతి వచించుటకును తిరు మలదేవి సందేహింప నవసరములేదు. చెలికారమ్మన నెట్టి గోప్యవిషయమునైన మనసుకెక్కిన మిత్రుల చెవినివేయుట లోకసహజము.

కాన, ఇది పొసఁగుఁబాటుకల విషయమే యనుటయం దసత్యతాసంశయము సమకూడుట కెడములేదు.

—: శైలి :—

పారిజాతాపహరణమందలి శైలి అమృతరసపూరము. అందు నీతఁడు తన కావ్యప్రథమాశ్వాసమున గూర్చిన ప్రతిపద్యము ఒక్కొక్క పనసతొన. 'శిరీషకుసుమపేశలసుధామయోక్తు' లితనివి కాని పెద్దన్నవి కావు. ఏమందురా? మనుచరిత్రమందలి శైలి సంస్కృత జటిలము.

చ. వెఱవక మీ కొనర్తు నొకవిన్నప మిట్టివి యెల్లఁ జూచిరా
నెఱకలు గట్టుకొన్న మఱి యేండ్లుపుబూండ్లును బట్టుఁ బ్రాయపుం
జిఱుతతనంబు మీ మొగము సెప్పక చెప్పెడు వద్దిరయ్య మా
కెఱుఁగఁదరంబె మీమహిమ లీరయెఱుంగుదు రేమిచెప్పెదున్.

—మనుచరిత్ర. ఆ ౧., ప ౨౩.

వంటి అచ్చతెనుఁగు పదములు పొందుకొనియుండు పద్యములు కవితాపితామహుని కవనమున నూటికి కొకటి, కోటి కొకటి.

కాని తిమ్మన కవిత్వమున నట్టివి కావలసినన్ని. నిదర్శనముగా నాలుగైదు పద్యము లుదాహరించెదను:

ఉ. చక్కనిదాన వంచు నెలజవ్వని వంచు జగంబులోనఁ బే
రెక్కినదాన వంచుఁ బతియెంతయు నా కనురక్తుఁ డంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీగుచు గణింపదు కాంతల సత్య యింతకున్
బ్రుక్కకయున్నె నీమహిమ సూచిన బోటులు విన్నవించినన్.

—ఆ ౧., ప [illegible].

ఉ. ఇన్నిదినంబులున్ సవతు లిందఱిలోఁ గడు గారవంబునం
గన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁ గప్పుకొనంగ నుండి యా

వన్నెయు వాసియుం దఱిఁగి వారు ననుం దలకెత్తి చూడఁగా
సన్నలఁ జాయలం బలుకనైతునె ప్రాణము లింత తీపులా!

—ఆ. ౧., ప ౮౮.

చ. మన మరయుం దలంచి యొకమార్గము వన్నితొ నవ్వుటాలకో
నను వెలిపించెదో యకట నాయెడ నిక్కము దప్పఁగల్గెనో
వనజదళాయతాక్షి! పగవాఁడనె నన్నిటు లేల చూడ వొ
క్కనిమిషమైన నీవు దయఁ గన్గొనకుండిన నిల్వనేర్తునే?

—ఆ. ౧., ప ౧౧౬.

ఉ. ఈ నయగారపుం బ్రియము లీపస లీమొగమిచ్చమాట లే
లా నిను నమ్మియుండిన ఫలం బిది తోడన కల్గె నాకు నీ
యానను మీ ననుం జెనకి యాఁటడి వెట్టిన నవ్వువారలం
గాన నెఱుంగనే పసులకాపరి భావజమర్మకర్మముల్

—ఆ. ౧., ప ౧౩౫.

ఉ. గట్టిన చేఁతలుం బసలు గల్లదనంబులు నీవు పుట్టఁగాఁ
బుట్టిన వెందులేని పలుఁబోకల మాయలు నీకు వెన్నతోఁ
బెట్టినవా యెఱింగియును బేలతనంబున నిన్ను నమ్మి నా
గుట్టును దేజము న్మగలఁ గోల్పడిపోయితి నేమి సేయుదున్.

—ఆ. ౧., ప ౧౨౭.

ఈ పద్యములందు సంస్కృతపదములు పరకపాటు. ఆ పరకపాటు సంస్కృతపదములైనను వాడుకలో లేని మారుమూలపదములు గావు.

సులలితాంధ్రపదార్భటిచేఁ బొంపెసలారి, ప్రతిభాప్రాగల్భ్యములతోఁ బదముల నేర్చి చేర్చిన సావు సంతనలచేఁ గొతుకులువడకయుఁ గుంటువడకయు నిక్కావ్యమందలి శైలి గొప్పరథమువలె నొయ్యారముగా సాగిపోవుచున్నది.

మధ్యయుగకవుల గ్రంథములలోఁ గన్పట్టు సంస్కృత సమాసముల యాడంబర మింత గా లేకుండుట యొక గొప్పవిశేష మనక తీరదు.

—: లలితశృంగారము :—

లలితశృంగారమున కీకావ్యరత్నము నిధానము.

శృంగారము శ్రుతిహితముగ వర్ణించినఁ గవులలోఁ దిక్కయజ్వ మేటి. అతని మార్గము పట్టి అనంతర కాలమున మంచన, జక్కన, అనంతామాత్యుఁడు మొదలగు కవిగ్రామణులు శృంగారమును సుకుమారముగ వర్ణించి ధన్యులైరి.

పచ్చిశృంగారమును ఆంధ్రమునకుఁ గొనితెచ్చినవాఁడు శృంగార శ్రీనాథుఁడు. ఆతనిఅడుగులలో నడుగులు వైచి కవన మల్లి పెద్దన్న దూష్యశృంగారమును పెంపొందించినాఁడు.

తిమ్మన అట్లుగాక శృంగారమును సుకుమారముగ, శ్రుతిహితముగ, సులలితముగ వర్ణించి సరసమతులకు సంతోషము సమకూర్చినాఁడు,

రతివర్ణన మొదలగు పచ్చిశృంగార మనిన నితనికిఁ దలయేరు. అట్టివి వివరింపవలసినచో నీతఁడు ముక్తసరిగ మూఁడుముక్కలలో ముగించును. సాయంకాలవర్ణనము, అంధకారవర్ణనము, నక్షత్రవర్ణనము, చంద్రోదయాదివర్ణనము మొదలగునవి చదువరులకు విసువుఁబుట్టునట్లుఁ బొడుగించి పెంచి వ్రాసిన కవియే శ్రీకృష్ణుని రాత్రిచర్యను వర్ణించుచో 'శయనాగారంబున వినోదకేళిం దేలి నిద్రాముద్రితనేత్రుఁడై శయనించె' నని సూక్ష్మముగఁ దేల్చి వైచినాఁడు.

మఱియు మురారి వైజయంతమున విడిసిననాఁటిరాత్రి సత్యఁగూడి 'మనోభూరాజ్యసౌఖ్యనిద్రాపారీణత నుండుచోఁ

ప్రభాతంబయ్యె' నని ప్రశంసనీయమగు ఒకకప్పదాటు వేసినాఁడు.

మెలకువతో, నేర్పుతో శృంగారరసపోషణ మొనర్చిన ఈవిద్వత్కవిరత్న మొక్కచో నావిషయమున ఔచితీభంగము చేసెను.

రుక్మిణీరమణితో నారదుఁడు

మ. అళినీలాలక! నీవు నీపతి రహస్యక్రీడ వర్తించు వే
ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు గల్పించు ను
జ్జ్వలదీపాంకురమై రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబు ల్దొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్.

—ఆ. ౧., ప ౬౦.

అని ఆడిన వచనములు తప్పక అనౌచిత్యమునకుఁ బాల్పడినవి.

పురాణదంపతుల సముఖమున నారదునివంటి లోకోత్తర పురుషుఁ డిట్టి పిచ్చుపెడకటైమాటలు ప్రేలుట దూష్యము.

శృంగారరసపరిపోషణమునఁ దిమ్మన కావించిన లోప మిది యొక్కటే.

—: పాత్ర గుణ పోషణము :—

పాత్రగుణపోషణము పెక్కురు ఆంధ్రకవులకు వింత విషయము. నన్నయ, తిక్కన, సూరన మున్నగువారు పాత్ర గుణపరిపోషణమునం దందెవేసిన చేతులు. తిమ్మకవికూడఁ గొంచెమించుమించు నంతవాఁడే.

పాత్రస్వభావపరిపోషణమును ఈకవి నిర్వహించిన తీరు దీనితరువాతివ్యాసమున విపులవివరణ మందియున్నది.

—: మా న వ స్వ భా వ ప రి శీ ల న ము :—

మానవస్వభావసూక్ష్మపరిశీలనము సునిశితప్రతిభులగు కవిరాట్టుల సహజగుణము. అట్టి పరిశీలనమున తిమ్మన గడి దేఱిన ఆంధ్రకవిరాజు.

నారదుని కలహప్రియత్వము, సమయోచితకార్యనిర్వాహణవైదుష్యము- నరకాసురదమనుని నక్కనైచ్యములు, మాయాకల్పనాచాతురి, సుకుమారశృంగారరసజ్ఞానప్రాగల్భ్యము- సత్యభామ రాజసము, అసూయాదిగుణములు సూక్ష్మబుద్ధితోఁ బరిశీలించి, పరామర్శించి అసదృశకౌశలముతో తిమ్మకవి చిత్రించినాఁడు.

—: ప్ర థ మా శ్వా స ము :—

పారిజాతాపహరణమనోహరకావ్యరత్నమున ప్రథమాశ్వాసమే రసకందాయము.

ప్రభావతీప్రద్యుమ్నమున ప్రథమ ద్వితీయ తృతీయాశ్వాసములు- మనుచరిత్రమున ద్వితీయాశ్వాసము- పాండురంగమహాత్మ్యమున తృతీయాశ్వాసము రుచివిస్తారము కలిగియున్నట్లు పారిజాతాపహరణమున ప్రథమాశ్వాసము విశేషరుచిరమై ఉన్నది.

పారిజాతాపహరణప్రథమాశ్వాసమునందలి పద్యములు జున్నుముక్కలు, రసాలవాలములు. అవి ఇక్షుదండములఁబోలె నింపెసలారి చమ్మఁదనము చిమ్ముచుండును.

ఇందలి పలుకుల తియ్యందనము చదువువారికి, వినువారికి నింపుఁబెంపు సంపాదించును. నోరూరునట్లు రసము చిల్కు రచనములు- ముద్దులుమూటగట్టి మురిపించుచుండు సులలితాంధ్రపదప్రయోగములు- నిగూఢములు, నిక్షిప్తములు

నగు మనోభావముల వెల్వరించు కవి పరిజ్ఞానపాటవమును ఈ ప్రథమాశ్వాసము తుదిముట్ట నెట్టుకొని చూపట్టుచున్నది.

వేయేల! ఈభాగమందలి కవిత్వసారస్యసారళ్యములు కవితాపితామహ, రామరాజభూషణాదులకు సైతము మబ్బినవి కావని చేయెత్తి చెప్పవచ్చును.

మఱియొక విశేషము: తులఁదూఁచితీఱిచినట్లు హత్తినది, ఈయాశ్వాసమందలి పదముల పొందిక. ఇందలి ప్రతిపదమును గంభీరార్థప్రతిపాదకమై యున్నది. కనుఁడు:

క. పూనుకొని మేలుగీళ్ళకు
లోనయి విహరించువారి లోక మెఱుఁగదో?
యా నరకాసురదమనుఁడు
దా నెఱుఁగఁడో? భోజకన్య తా నెఱుఁగదొకో?

—ఆ. ౧., ప ౯౧.

అని సత్య వేకరుచున్నది.

కృష్ణమూర్తినిగూర్చి 'నరకాసురదమనుఁ' డనుటలో విశేషార్థ మిమిడియున్నది. నరకాసురవధావసరమున నాథునకుఁ దాఁజేసిన సాహాయ్యము స్మృతిపథమునకుఁ దెచ్చుచున్న దన్నమాట, సత్య.

ఇట్లే 'లతాంతాయుధుకన్నతండ్రి' యను పదముకూడ సాభిప్రాయవిశేషమిళితము.

ఉ. ఈ లలితాంగిచంద మొకయించుక చూచెదనంచు ధూర్తగో
పాలుఁడు...

ఇచ్చో ధూర్తగోపాలపద మెంతటి అర్థగాంభీర్యముఁ దాల్చుచున్నదో సరసమతులకుఁ దెల్లమే.

ఇటులనే ఈయాశ్వాసమునఁ బ్రతిపదమునకుఁ గొం డంత విలువ.

స్వభావోక్తివర్ణనమున కీభాగము విడిది. ఆ వర్ణనము మనస్తోషజనకముగనుండి కవి విమలశేముషీవిశేషమును గుబా ళించుచున్నది.

శ్రీకృష్ణుఁడు సత్యభామ పాలయలుక తీర్చి అనున యించు ఘట్ట మందలి స్వభావోక్తిని 'కవితాప్రావీణ్యఫణీశుఁ' డును, రసజ్ఞుఁడును నగు రాయలు ఆలించి, మేలెంచి ఎం తలరియుండునో?

—: కందువ మాటలు :—

లోకోక్తిసంఘటనాపాటవము తిమ్మన కుగ్గుఁబాలతో నేర్చిన విద్య. సమయానుగుణముగఁ జక్కని జాతీయములు, లోకోక్తు లిమిడ్చి స్వభావోక్తిని వర్ణించు కవులలో నితని కితం డె సాటియనుట విశేషోక్తిగాదు. తిలకింపుఁడు:

క. అలరుంబోఁడుల లోపల
వలరుం బోఁడుములు నీకు వగ్గలమగుచున్
దలపూవాడక యుండుము
తలపూవు ధరించి నికచతామరసాక్షీ!

—ఆ. ౧., ప ౬౪.

క. పలుదెఱఁగు ముళ్ళమాటలు
కలహామె కల్యాణమని జగంబుల వెంటన్
మెలఁగెడు మానికి సహజము
వలదని వారింపవలదె వల్లభుఁ డతనిన్.

—ఆ. ౧., ప ౮౫.

'తలపూవు వాడక, ముళ్ళమాటలు, కలహామె కల్యా

ణము' మొదలగు చక్కని జాతీయములను ప్రస్తావనావసరము గుర్తించి పొందికగా హత్తించి తిమ్మన కావ్యమునకు వన్నెయు, వాసియుఁ దోడితెచ్చెను. అంతియేకాని ఇతడు తన కావ్యమున భట్టుప్రభువు కుచేలోపాఖ్యానమునందువలె స్థానమున: అస్థానమున, సమయమున: అసమయమున లోకోక్తులను, జాతీయములను ఉద్దేశపూర్వకముగ దూర్చి కావ్యశోభకు డిందుపాటు ఆపాదింపలేదు.

—: కథానిర్వహణము :—

కథానిర్వహణమున తిమ్మకవి సూరనకుఁ దీసికట్టయినను కవితాపితామహరామరాజభూషణులకంటె మిన్న.

ప్రథమప్రబంధముగాఁ జెలామణీయగుచున్న మనుచరిత్రమునందు వస్త్వైక్యము లేదు. వసుచరిత్రకు వస్తువే లేదనుట సత్యేతరముగాదు.

కావ్యమున కనువగువస్తువు, ఆవస్తువునకుఁ దగిన ఐక్యత పారిజాతాపహరణమునఁ జాలవఱకు సిద్ధించినవి.

ఈ కవికమలాసనుని కావ్యప్రపంచకల్పనాచాతుర్యమపూర్వము. భాగవత దశమస్కంధములోని యేఁబదితొమ్మిదవ యధ్యాయమునందు మూఁడుశ్లోకములలో నతిలఘువుగ వర్ణితమైన కథాలవము నెంచి తీసి, పెంచి పెంచి, మెఱుంగు పెట్టి సుకుమారప్రబంధముగఁ గ్రొత్త వెల్వరించెను.

మఱియొక విశేషము. పారిజాతాపహరణమున ప్రథమాశ్వాసమందలి వస్తురచన నాటకసంవిధానసిద్ధముగ నున్నది. పాత్రసన్నివేశము, సంభాషణ దృశ్యకావ్యసంప్రదాయధోరణిలో నున్నవి.

ప్రభావతీప్రద్యుమ్నమున దృశ్యకావ్యసంపూర్ణసంప్రదాయములు సంఘటిల్లుటకుఁ బారిజాతాపహరణమునందు సూచనగఁ జూపట్టు నాటకసంప్రదాయాదర్శమే చాలవఱకు దోహదమనుట సత్యసమీపము.

ఇక్కావ్యమందలి కథానిర్వాహణముకూడఁ బూర్తిగా నిర్దుష్టము, నిరుపమాన మనుటకు వీలుచాలదు. ప్రథమాశ్వాసమున గుత్తముగాఁ, బొంకముగా నున్న కథాప్రణాళిక అంతటి నుంచి సడలి, సన్నగిలి చవిఁగొల్పకున్నది.

ప్రథమాశ్వాసమున నున్న రసవిజృంభణము, ఉద్దీపిత భావములు, ఉత్సాహము మిగిలిన ఆశ్వాసములందు- సందర్భశుద్ధి లేని వర్ణనాంశములు పెచ్చుపెరుఁగుటచేఁ- గవి నిర్వహించుకొనలేకపోయెను.

వస్తురచనావిషయమున మఱియొక లోపముగూడఁ గానుపించుచున్నది. పారిజాతాపహరణముతోఁ దెంపుచెంది పర్యవసితముకావలసిన కథ పుణ్యకవ్రతాచరణ వర్ణనములో సంక్రమించినది.

తిమ్మకవియందు విశేషగౌరవముకలవారైనను గథాసంవిధానములో నిది యొక గొప్పలోప మనుటకు జంకరు. పుణ్యకవ్రతాచరణమున కిందుఁ బ్రసక్తిలేదు; ప్రయోజనము లేదు. గ్రంథము ననవసరముగాఁ బెంచుటకై తెచ్చిపెట్టుకొన్న విషయ మది.

—: వర్ణనములు :—

పురవర్ణనము మనప్రబంధములకుఁ దప్పని తద్ధినమైనది. తిమ్మనమాత్ర మట్టి దాస్యమునకు లోఁబడక పారిజాతాపహరణమున ద్వారవతీవర్ణనము చేయక తన స్వతంత్రత

చాటినాఁడు. పురవర్ణనములు చదివి చదివి నోళ్ళు కాయలు కాసిన, విని విని చెవులు చీములుకట్టిన ఆంధ్రప్రబంధపాఠక శ్రోతలకుఁ. పారిజాతాపహరణము కొలఁదియిడరాని ఆనందమును సంధానించును.

మాతలినోటఁ బెట్టి ప్రభావతీప్రద్యుమ్నమున పురవర్ణనమునకు సూరన నవీనచైతన్యము, నూతనమర్యాదను కల్గించి నట్లే తిమ్మనకూడ నొకసందర్భమున సూచనగఁ బురవర్ణనముఁ జేసి నవ్యత నాపాదించె ననఁజెల్లును.

చూడుఁడు:

ఉ. ఆరమణీలలామముల నందఱఁ గూడి యదూద్వహుండు త
ద్ద్వారవతీపురోపవనవాటికలం గృతకాద్రిసీమల
న్వారిధితీరకుంజసదనంబులఁ గేళితరంగిణీతటీ
కైరవిణీసహాయమణికల్పితసౌధముల న్వసించుచున్.

—ఆ ౧., ప ౪౦.

అనుటలోఁ బురోపవనవాటికలు, అందలి కృతకాద్రి సీమలు, మణిసౌధములు ప్రస్తావనవశమునఁ జమత్కారముగఁ జతురతతో సూచించియున్నాఁడు.

పురవర్ణనాదుల కెంబుస్తైన నెత్తక కథారంభమున నూత్నమర్యాద, స్వాతంత్ర్యముఁ జూపి కావ్యమును నీటుపఱచిన కవిచంద్రుఁడే ద్వితీయాశ్వాసము మొట్టి అలంకారికకవిత్వపు రొంపిలో దిగఁబడి అనవసరవర్ణనాంశములు దగిలించుకొని గ్రంథమును తడిపి మోపెడు చేసినాఁడు.

ఈవర్ణనములు ఉత్తరకథావిస్తృతికి సాధనములు కావు. రసపోషకములా? అంతకుముందే కావు. అసంగతములగు నిట్టి వర్ణనములు తిలకించి తిమ్మనయందు గౌరవప్రపత్తి

లు గల వితత్ప్రబంధపాఠకులు చింతిలక మానరు.

—: వీ ర ర స ము :—

ఖడ్గతిక్కనసోదరుఁడగు తిక్కనసోమయాజి వీరరసమును వర్ణించినట్లు, కృష్ణదేవరాయలవంటి వీరావతారముతోఁ జెలిమిగలిగి మెలఁగిన తిమ్మనకూడ వీరరసమును ఉత్తేజకరముగ వర్ణించియుండవలసినది.

కాని పారిజాతాపహరణమున వీరరసఘట్టములు చప్పగానున్నవి.

ఇందు తిమ్మన తప్పిద మేమియు లేదనవలయును. పారిజాతాపహరణప్రబంధరచననాఁటికే అతఁడు వయస్సుమీఱిన మానిసి. ముదుకఁడు నెట్టికశీల యగుఁగాని ఉద్ధతుఁడు గానేరఁడు. ఉద్ధతిలేని వీరరసము పేలపిండిగదా!

విశేషించి తిమ్మనశైలికి లాలిత్యము, లావణ్యము లున్నవిగాని ఉద్వేగము, ఉరవడి లేవు. శృంగారరసము చిలికి చిత్రించు శైలికి లాలిత్యలావణ్యములు ముఖ్యావసరములు. కావుటనే పారిజాతాపహరణమున శృంగారరసప్రధానము లగు ప్రథమ, ద్వితీయాశ్వాసములు తేనెతెఱలఁ బోలుచున్నవి. వీరరసముకూర్చు శైలికి ఉద్వేగము, ఉరవడి మెండుకొనియుండవలెను. అవి లేకుండుటనే ఈప్రబంధమందలి యుద్ధఘట్టములు రుచివిషయమునఁ గొంచెము తెట్టగిలి వెనుకానుచున్నవి.

—: అ పూ ర్వ శై లీ ప్ర యో ము :—

ఈ కావ్యమునందలి ఇట్టి చిన్నిలోపములమీఁద మన దృష్టిని కేంద్రీకరించుట పాఁడికాదు. అనేకాంధ్రప్రబంధముల

బో లేని అపూర్వవైశిష్ట్య మొకటి పారిజాతాపహరణమున నుండుట మనము ముఖ్యముగా గమనింపవలసియున్నది.

మనుచరిత్ర, వసుచరిత్ర, ప్రభావతీప్రద్యుమ్నము మున్నగు ఆంధ్రప్రబంధములు ప్రాయికముగా నాయికానాయకుల పరిణయవృత్తాంతములతో పర్యవసితము లగుచున్నవి. పారిజాతాపహరణము మాత్రి మీవిషయమున నూతనపథమున నున్నది.

పారిజాతాపహరణప్రబంధమున ప్రస్తావితవిషయము పరిణయానంతరకౌటుంబికజీవితవృత్తాంతము. ఈసందర్భమున నీకావ్యముతో దొరయుపాటి ప్రబంధము ఆంధ్రమున మఱియొకటి లేదనికూడఁ జెప్పవచ్చునేమో!

—: ఉపసంహారము :—

అర్థసంపద, భావచమత్కృతి, రసపుష్టి, సందర్భశుద్ధి, వస్తురచనాకౌశల్యము మొదలగు కవితాసంభారముల నెల్ల నేర్చి కూర్చి, తెలుఁగుపలుకుబడుల గుబాళింపులతోఁ గావ్యమును భోగ్యద్రవ్యముగా నొనర్చి ఆంధ్రప్రబంధకవులలోఁ దిమ్మన పీనుమిగిలినాఁడు. దేశభాషలందుఁ దెలుఁగు లెస్స యగునట్లుగా సృష్టిపఱచిన కావ్యస్రష్టలలో నుత్తమశ్లోకుల వర్గమున తిమ్మనార్యునకు మంచిస్థానము కలదు.

ఆంధ్రప్రబంధభాండారమునఁ బ్రథమస్థానము ప్రభావతీప్రద్యుమ్నమునకుఁ జెందుననుట నిర్వివాదాంశము. ద్వితీయస్థానము మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతాపహరణములలో నెద్దానికి లభించు ననుట విమర్శకులు పరామర్శింపవలసిన విషయము.

ఈ సందర్భమున నెంతయేని అవకాశము గలదు, భేదాభిప్రాయములకు.

పారిజాతాపహరణమే ద్వితీయస్థానమున కర్హ్యమని నా వాదము.

పాక్షికబుద్ధితో విమర్శకు లా స్థానము పారిజాతాపహరణమున కీయకున్నచో నదియే మను, వసు చరిత్రల మెడ వట్టి నెట్టి వెన్బడఁజేసి ఆ స్థానము నాక్రమించి అలంకరించి మించఁగలదు.

అందులకుఁ గారణము లీవ్యాసమున నాయాతావుల వివరించియే యుంటిని.

## ౧౦

# పారిజాతాపహరణము-పాత్రపోషణము

అనేకాంధ్రప్రబంధములలో మందునకైనఁ గానరాని సముచితపాత్రసంపోషణము పారిజాతాపహరణప్రబంధమున సెబాసని శిరఃకంపము చేయవలసివచ్చునట్లు నిర్వహింపఁబడినది.

నారదుఁడు, సత్యభామ, శ్రీకృష్ణుఁడు- పారిజాతాపహరణమునఁ బ్రధానపాత్రలు.

కథాప్రారంభమునందే ముఖ్యపాత్రలతోఁ బాఠకులకుఁ బరిచయము కల్పించుట గొప్పకవిలక్షణము. కవిసంప్రదాయము కూడ.

షేక్స్పియరు తననాటకములందుఁ బ్రాయికముగాఁ బ్రథమాంకముననే చదువరులకు ప్రధానపాత్రలతోఁ జనవు కల్పించుననుట ఏతత్కవికృతనాటకపాఠకుల కనుభవపునరుక్తమగును.

ముక్కుతిమ్మనార్యుఁడుకూడఁ బ్రథమాశ్వాసముననే ప్రధానపాత్రలతో మనకుఁ బరిచయము కల్గించియున్నాఁడు.

ఈప్రధానపాత్రల స్వభావపరిపోషణము కవి యెట్లు నిర్వహించెనో ప్రత్యేకించి విమర్శించుకొందము.

—: నా ర దుఁ డు :—

నారదుఁడు కలహాశనుఁ డనుట జగమెఱిఁగిన విషయము. అతని కలహప్రియత్వ మిందు లెస్సగాఁ జక్కఁగాఁ జిత్రితము.

ఈ 'పోరోగిరము తిండిపోతు' శ్రీకృష్ణుఁడు రుక్మిణీకాంతగృహంబులో జూదమాడుచుండ నచ్చటి కరుదెంచి పారిజాతకుసుమరాజ మాతని కొసంగెను. అతం డది భోజనందన కిచ్చెను. కయ్యము కల్పించుటకు 'నారివేరంపుఁదపసి'కి సందు దొరకినది.

ఆతండు 'కలహసంభ్రమపరుఁడై' పారిజాతప్రసూన ప్రభావము తెలియఁజెప్పి రుక్మిణితో నిట్లనియె: 'నెఱిగొప్పున నీకుసుమంబు దాల్చుటచే సవతులువచ్చి నీ చరణసారసయుగ్మము నాశ్రయింతురు. ధవుఁ డటులేనికూర్మి జవదాఁటక నీపలు కాదరించును.'

మన బాఁపఁ డంతటితో నూరకుండెనా? లేదు. ఊరకుండుచోఁ గలహబీజ మేది?

స్తుతివాక్యములలోఁ గలహకారణములు మేళవించి-

ఉ. చక్కనిదాననంచు నెలజవ్వనినంచు జగంబులోనఁ జే
రెక్కినదాననంచుఁ బతియెంతయు నాకనురక్తుఁడంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య యింతకున్
ద్రుక్కకయున్నె నీమహిమ సూచిన బోటులు విన్నవించినన్.

అని సత్యకుఁ గోపజనకంబులగు పలుకులు వచించినాఁడు.

ఔరా! నారదుని చాకచక్యము! స్తుతివాక్యములలోఁ గూడఁ గలహము వర్జింపఁడాయె.

ఇఁక నేమున్నది? అనుకొన్నంతయు నైనది.

ఈవృత్తాంతము సత్యకుఁ దెలిసినది. ఆపె మూతిముడిచినది. కంసారి తనకాళ్ళమీఁదఁబడి వేఁడికొనఁగా నాతనిశిరమును వామపాదమునఁ దొలఁగం ద్రోచినది. పారిజాతవృక్షమే

తెత్తునని శ్రీకృష్ణునిచే ననిపించినది. నారదుని కలహబీజ మిట వికసించి మొలకెత్తినది.

మునీశ్వరుఁడు సత్యభామకుఁ గోపము పెంపెత్తునట్లు నిందించి రుక్మిణీకృష్ణులకును, నామెకును మనసులో రవరవలు పుట్టించినాఁడు.

అంతతో నిలిచెనా? పారిజాతతరుసంపాదనకై మురారి వృత్రారితోఁ గయ్యము చేయవలసియుండును. దీనం జేసి ఇంద్రు నకును, గృష్ణునకును గూడ నారదుఁడే పోరు కల్పించినాఁ డన వచ్చునుగదా!

ఒకటికి రెండు కల్పించిన నారదుని బుద్ధివైశద్య మేమని కొనియాడఁగలము?

చిత్రము కనుఁడు.

రుక్మిణీకాంతగృహములో సత్యను నోరికొలందు లాడిన నారదుఁడే సాత్రాజితి కావించిన యతిథిసత్కారము లందికొని, పంచేరము లారగించి, త్రేఁపులు త్రేఁచుచు- 'నతులప్రాభవ వైభవోన్నతుల ప్రోవై యిట్లు వర్తించు నినుం బోలంగల రబ్జ గంధు లన వింటే యెందు సాత్రాజితీ!'- అని మొగమిచ్చ మాటలాడెను.

'ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కామాటలాడు'- నారదుని సమయోచితకార్యనిర్వహణ వైదుష్య మెంత నేర్పుతోఁ గవి చిత్రించినాఁడో కంటిరా!

సత్యను ముఖస్తుతిచేయుకాలమునందే ఆతఁడు- 'అని కైనం బతి నిన్నుఁబాసి చనునో'- యని సాభిప్రాయముగా వచించి కృష్ణునితో నాకమున కామెకూడఁ బోవునట్లుఁ బొసంగించెను.

మొలకెత్తిన కలహబీజ మిట చెట్టయి పూచి కాచి ఫలించినది.

స్తుతిలోఁ గలహకారణములు మేళవించుటయే నారదుని చాకచక్యము. అదియే ఆతఁ డొనర్చు చమత్కారము.

పారిజాతతరువు దెచ్చిన పదంపడి నారదుఁడు తిరిగివచ్చి- 'హేమనిభగాత్రి! నీభాగ్య మేమి చెప్పు!' అని సత్యను సన్నుతి చేసి, ఆమెచేఁ బుణ్యకవ్రతమును జేయించి, వ్రతదక్షిణగా నామెవలనఁ గృష్ణునిగ్రహించి, యతనిచే వెడఁగుపనులఁ జేయించి యెల్లరయుల్లంబుల హాస్యము దొప్పఁదోఁగించెను.

పరమభాగవతశిరోమణియు, భక్తాగ్రేసరుఁడును నగు నారదుఁడు నవ్వుటాల కట్లొనర్చెనే కాని నిక్కంపుమనముతోఁ గాదు. ఆతండు మొక్కవోని భక్తుఁ డనుటకు రుక్మిణీసద్మమునను, పుణ్యకవ్రతానంతరమునను శ్రీకృష్ణభగవానుని స్తుతించిన పద్యములే చాలును.

ఒక్కవిషయమున నారదుని స్వభావపరిపోషణమునం దనౌచిత్యము కనిపించుచున్నది.

ఏదియందురా? పారిజాతప్రభావము రుక్మిణితో వర్ణించునెడ నారదుఁడు:

మ. అళినీలాలక! నీవు నీపతి రహస్యక్రీడ వర్తించు వే
ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబుఁ గల్పించు ను
జ్జ్వలదీపాంకురమై రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబు ల్దొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్.

అనుట అనౌచిత్యముగ, నసమంజసముగ నున్నది.

ఈమాటలు మునులనోటనుండి రాఁదగినవి కావు. భార్యాభర్తలయెదుట నారదునివంటి సకలశాస్త్రపారంగతుఁ డిట్టి

యసభ్యశృంగారవచనము లుచ్చరించెననుట అనాగరకము కదా?

ఈఘట్టమున ముక్కు తిమ్మన్న నారదుని స్వభావపరిపోషణము చెడఁగొట్టి పప్పులోఁ గాలువై చెననుటలో సందియము లేదు. పాత్రపరిపోషణమునఁ దీకవి గావించిన లోప మిది యొక్కటే.

నారదుని కలహప్రియునిఁగా, 'ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కా మాటలాడి' సమయోచితముగఁ గార్యము నిర్వహించుకొనుటయందు నిపుణుఁగా, భక్తాగ్రగణ్యుఁగా తిమ్మనార్యుఁ డతిచాకచక్యముతోఁ జిత్రించియున్నాఁడు.

పారిజాతాపహరణమునందు రణభోజనుని పాత్ర ప్రధానమైనది. ఇందలి కథాకల్పనకు నాతఁడే సూత్రధారుఁడు. అతఁడు లేనిచోఁ గథయే లేదు.

—: స త్య భా మ :—

సత్యభామ రాజసికగుణము గల స్త్రీరత్నము. 'కులమును రూపము నృగని కూరిమియుం గలది.' సౌందర్యవతి. మానవతి. మహనీయసౌభాగ్యవతి.

కావుననే నారదుఁ డాడిన మాటలు విని లాఁతిదేవేరులు చల్లచల్లఁగ నూరకున్నను మానవతియగు సత్య 'వ్రేటువడ్డయురగాంగనయుం బోలె నేయివోయ భగ్గని దరికొన్న భీషణహుతాశనకీల యనంగ లేచి'- నారదుఁడు 'అతులమహానుభావ మని యవ్విరి' యచ్యుతునకు నొసఁగినదియని నిచ్చుఁగాక; 'తా నతఁడు ప్రియంబుగల్గు నెడ కర్పణచేసినఁ జేసెఁగాక; ఆ మతకరి వేలుపుం దపసి మమ్ము దలంపఁగ నేల?' యని బిట్టు వగచినది.

రుక్మిణిఅని యనక 'ప్రియంబుగల్గునెడ' కని భోజనందనను గూర్చి పల్కుటచే సత్యకు నామెయెడఁ గలుగు చూపోపమి యగ్గలము తెల్లమగును. 'మమ్ము' అను గౌరవార్థకబహు వచనప్రయోగముచే నామె రాజసికగుణము తెలియనయ్యెడిని.

సత్యభామకుఁ గృష్ణునిపైఁ గినుక వొడమినది. 'ధూర్త గోపాలుఁడ'ని మగనిం దూలనాడినది, 'శరదంబుదచలచిత్తులు పురు'షు లన్నది. 'ఆహా! యిట్టిమాటలు చెవులన్ వినంబడియుఁ బ్రాణము దాల్చెద మేన నింతగా, నోఁచితి నింక నెట్టివి కనుం గొనవున్నదాననో'- యని యనర్థములకుఁ దలంకినది.

ఆమె కోపము క్రమముగా నె ట్లగ్గలమగుచున్నదో కనుఁడు.

మఱల నంతలో భర్తృప్రేమ తలంచుకొన్నది. వగల మిగుల నొగిలినది. 'మాసినచీర గట్టికొని, నిరస్తభూషయై'- 'చీఁకటింటి కడకంకటిపై గాఢమనోజవిషాదవేదనచేఁ' బొరలినది.

ఇదంతయు నెందులకు? తనకు నలుగురిలో నలుసుఁ దనము వచ్చినదని.

ఈసందర్భమున స్త్రీజనసహజంబులగు అసూయాదిగుణ ములు కూర్పునేర్పుతోఁ గవి మనోహరముగ వెల్వారించి యున్నాఁడు.

కృష్ణుఁడు సత్రాజిత్తనయ నెన్నియోరీతుల ననునయిం చెను. పాటలగంధి కోపభరముఁ దీర్పఁజాలక 'మృదుపల్లవ కోమలతత్పదద్వయీపాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నెవెట్ట నాజగన్నాటకసూత్రధారి' మ్రొక్కెను.

రజోగుణప్రధానయగు సత్య 'జలజాతాసనవాసవాది

సురపూజాభాజనంబై తనర్చు లతాంతాయుధుకన్నతండ్రి శిరమును వామపాదంబునం దొలఁగంద్రోచె.'

అహా! రాజసమా! జగన్నాటకసూత్రధారి లతాంతాయుధుకన్నతండ్రి నీకు మ్రొక్కినను నీదౌరతనంపునీటు రవ్వంతైన సరే తగ్గించుకొంటివి కాదుగదా!

సత్యభామ స్వాభిమానసంరక్షణప్రియత్వము, స్త్రీసహజమగు నసూయయు నిచ్చోఁ బ్రదర్శితము.

కృష్ణభగవానునివాక్యము లామెను సూఱటపుచ్చలేదు. అతనిని నిందింప దొరఁకొన్నది. పసులకాపరికి భావజుమర్మకర్మములు తెలియువన్నది. 'మాయలు నీకు వెన్నతోడఁ బెట్టినవి;' 'ఇంకిటు నిను నమ్మను,' అన్నది. 'మానరహితమైనబ్రదుకు మానిని కేలా?' అని ఆత్మగౌరవనాశనమునకై వగచినది. 'నను నెవ్వతిగాఁ జూచితివి' అని మఱల రాజసము మెఱపించినది.

అంతలోఁ జూపోపమిపెంపుచే నామెకు విచారము గల్గినది. స్త్రీలకుఁ గన్నీ రాయుధమువంటిదికదా! అగుట ఆమె గాసిలి యేడ్చినది.

నరకాసురదమనుఁ డామెకుఁ బూర్తిగ లొంగిపోయి నెయ్యముఁదియ్యముఁ దోఁప- 'పారిజాతవృక్షంబునే తెచ్చి నీపెరటిచెట్టుగ నాటింతుఁ బెంపుఁగనుము'- అన్నాఁడు.

అంత సత్యామానిని 'నీపలుకికవోలెం గనుపట్టె.' ఆమె సంతుష్టి చెందినది. నాథునకు మజ్జనభోజనాదులు యథావిధిగ సల్పినది.

చిన్నిసంగతులకై నను పెనువంతఁ గుంది యంతలో మఱల నూఱడిల్లుట స్త్రీలకు స్వభావసిద్ధము.

మఱియుఁ జీటికిమాటికిఁ జిఱ్ఱుబుఱ్ఱుమనువారే త్రుటిలోఁ బొగడ్తలకుఁ బొంగిపోవుదురు. లతాంతమాత్రముననే మూతి ముడిచిన సత్య మఱల నంతలో సంతసించినది.

ఆలుమగల యలుక 'అద్దమువిూఁద పెసరగింజ నిలుచు నంతకాల ముండు' నని సామెత. అట్లే సత్య కృష్ణుని దూఱియుఁ దన్నియుఁ బారిజాతపాదపము తెత్తు ననుటతోడనే హెచ్చుగా మెచ్చుకొన్నది. అందుచే నామె అల్పసంతోషి యని వచింపవచ్చును.

రుక్మిణీసదనంబునఁ దన్నుఁ దూలనాడిన నారదుఁడే తన వద్దకు వచ్చి తన్ను పొగడినవెంటనే సత్య పొంగిపోయినది. దీనిచే నామె అమాయకురాలని నిర్ధారణచేయవచ్చును.

నారదునకు సత్కారము లొనర్చుటచే నామె గురుజన భక్తియు, నుదాత్తగుణములును తెలియనయ్యెడిని.

శ్రీకృష్ణుఁడు సురతరువు పెకలించినపుడు నందనపాలురు వారించిరి. వారికిఁ గృష్ణుఁడు జవా బీయవలసియుండఁగాఁ దనకార్యము నెగ్గినదను గర్వముతో, తనముద్దు చెల్లినదను నహంభావముతో సత్యభామ 'ఏమో వచింపఁబూను హృదయేశ్వరునిఁ గరసంజ్ఞ మాన్చి' సురేశ్వరవనపాలకులను 'వార్ధిఁ బొడమిన యీదివ్యభూరుహమున కింద్రాణి యెవ్వతె? ఇంద్రుఁ డెవ్వఁడు? ఇందిరను గౌస్తుభము నెవ్వఁడు చేకొనె అతఁడె దీని కధికారి. తెక తేర యిది యేమి యొకరి సొమ్మే?' అని అడిగినది.

అంతతోఁ బోక—

'ఇది నాదువిభునిచే నీవదాన్యనగంబు
నొడియించుకొని యేఁగుచున్నదాన'—

అన్నది.

తిలకించితిరా? సత్యగర్వము.

విశేషమేమనఁగా సత్య శ్రీకృష్ణుని 'సత్యభామావిధేయుఁ' డనుట. ఆమె గర్వము సోదుముట్టినది. ఆమె యహంభావము ఆకాశమంటినది.

నారదుని పంపునఁ బుణ్యకవ్రతము సల్పుటచే నామె వ్రతనిష్ఠ, సదాచారసంపత్తి గలదియని ప్రస్ఫుటమగును.

సురమునీశ్వరుఁడు నాథుని ధారోదకపూర్వకముగ దానమొనర్చుమని యనినతోడనే సత్యభామ 'మధుకైటభమర్దన! చిత్తగించితే మునిపతి మాట?' అన్నది. భావము వెలిపుచ్చక, మర్మము చెడక, నోరు వెలితిచేసికొనక ఆమె తన భావానుగుణముగ నాథుని ఒప్పుకోలు వడసినది. ఏమి? ఆమె తెలివితేటలు?

సత్యభామ ఆత్మగౌరవముగలది. మానవతి. రజోగుణప్రాధాన్యముగల కాంతారత్నము. స్త్రీలకు సహజముగ సవతులయెడనుండు అసూయాదిగుణములు గలది. అల్పసంతోషి, అమాయికురాలు, గురుజనభక్తి గలది. సువ్రత. సదాచారిణి, గర్వము కలది. అహంభావముకూడఁ గలది. కృష్ణుని మన్ననలఁ గన్నది. తెలివితేటలు గలది.

ఇట్టి ఆమె విశేషగుణములు నేర్పుతో, మెలఁకువతో వర్ణించి వివరించిన నంది తిమ్మనార్యుని విశేషశేముషీధురంధరత్వము నిరుపమానముకదా!

—: శ్రీ కృష్ణుఁడు :—

శ్రీకృష్ణుఁడు శృంగారపురుషుఁడు. రసికశిఖామణి. ఆతఁడు సత్యభామ ననునయించుటకై పన్నిన

మాయలు, సల్పిన సరసములు, వచించిన ముద్దుమాటలు, ఒనర్చిన కృత్యములు నాతని రసికత్వమును శృంగారరస స్వరూపవిజ్ఞానమును వేయినోళ్ళ వెల్లడిచేయుచున్నవి.

'నయగారవుంబ్రియములు, మొగమిచ్చుమాట' లాడి సత్య ననునయింపఁజూచెను. సత్య యెందు కలిగినదో తనకుఁ దెలిసియున్నను ఏమియు నెఱుఁగనివానివలె- 'మైతొడవు లేల ధరింపవు?'- అని పృచ్ఛించెను. చూచితిరా! 'మురారి మాయాకల్పనాచాతురి!' శతధా సాహస్రధా కీర్తింపవలసి యున్నది.

కోపోపశమనమునకై శ్రీకృష్ణుఁడు ఆమెను బతిమాలెను. చివరకు మ్రొక్కెను.

అప్పుడైన సత్యభామ కోపాగ్ని చల్లారినదా? లేదు. పేరలుకం జెంది యామె పురుషోత్తము నుత్తమాంగము వామ పాదముతోఁ దన్నినది.

దానికిఁ గృష్ణుఁడు గ్రుడ్లెఱ్ఱచేసెనా? మండిపడెనా? లేదు. లేదు. రసికజనశిఖామణి, 'భావజమర్మకర్మము లెఱింగిన పనులకాపరి,' శృంగారరసస్వరూప మెఱింగిన దక్షిణానాయకుఁడు అగు అతఁడట్లేల చేయును?

ప్రత్యగ్ర 'శిరీషకుసుమకోమలసుధామయోక్తుల'

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాఁ
చిన యది నాకు మన్ననయ చెల్వగు నీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానము సోఁకిన నొచ్చునంచు నే
ననియెద నల్కమానవుగదా యిఁకనైన నరాళకుంతలా!

యనునయించి పారిజాతపాదపము దెచ్చి సత్యభామ కేళివనములో నాటుదునని ప్రతిన యొనర్చెను.

చిత్రమారయుఁడు: సత్యభామ నెయ్యపుఁగినుకఁ బూని నదఁట. ఔరా! కృష్ణుని గడుసుమాటలు!

కోపమును ప్రసాదముగాఁ దీసికొనుటయందు మురారి దిట్ట. కోపమును ప్రసాదముగా స్వీకరించుటయే కోపాగ్నిని చల్లార్చుటకు, తద్వేగము తగ్గించుటకు ముఖ్యసాధనము. ఇట్టి సాధనము స్వాధీనములో నుంచుకొనిన కంసారి ఎంతటి మాయాకల్పనాచతురుఁడో, గడుసువాఁడో యోచింపుఁడు.

ఈ ఘట్టమునందలి శ్రీకృష్ణుని శృంగారవిలాసరహస్య జ్ఞానము, మాయాకల్పనాచాతుర్యము, గడుసుందన మసదృశముగాఁ జిత్రింపఁబడినది.

స్వర్గయాత్రకుఁ బోవుచుఁ దనకాంతకు విశేషవస్తువర్ణనలు చేయుటచే నాతఁడు సత్యభామాప్రియుఁడని తేటతెల్లమగును.

పారిజాతాపహరణమునకై ప్రియకాంత వేగిరించుచున్నను నందనవనములోఁ గొంతకాలము విహరించుటచే నాతని క్రీడాప్రియత్వము తెలియవచ్చెడిని.

సముద్రమువలె సురసైన్యము దన్ను చుట్టుముట్టినను వెనుకంజ వేయక తానొక్కఁడే నిలచి నిశ్చలధైర్యముతో, నిర్నిద్రసాహసముతోఁ బోరాడుటచే నాతఁడు మహావీరుఁడని నిర్ణయింపవచ్చును.

ఇంద్రుఁ డోడి సాఁగఁబడి మ్రొక్కిన కృష్ణుఁడు కృపార్ద్రచిత్తుఁడై అతని వజ్రమాతని కిచ్చె. పిఱికికండలేని కడింది మగండగు కంసారి- 'చంపఁదగినయట్టి శత్రువు తనచేతఁ జిక్కినేని పొసఁగ మేలుచేసి పొమ్మను' విశాలహృదయుఁడనియు, సకరుణుండనియు దీనిచేఁ జెప్పఁజెల్లును.

'నీమహేంద్రులు కోరిన పారిజాతము చేకొంటిని' అని నేరము సత్యభామపైఁ బెట్టి, 'వలసినచోఁ దీసికొమ్ము'- అని యింద్రునితో ననిన నరకాసురదమనుని సంభాషణసమీచీనత, నాగరికత, గడుసుఁదనము ఏమని కొనియాడఁగలము?

పారిజాతముతో నిజనగరి కేతెంచి దేవకీవసుదేవులకు, బలభద్రునకుఁ, దక్కుఁగల పెద్దలకు నమస్కరించెనని చెప్పుటచే శ్రీకృష్ణుని గురుజనభక్తి వెల్లడియగును.

పుణ్యకవ్రతసందర్భమున నారదునకుఁ దాను దానమీయఁబడుట యొప్పుకొలిచ్చుటచే నాతని సుకుమారసరస. శృంగారరసజ్ఞానప్రాగల్భ్యము తెల్లమగును.

నారదునిపంపున వెడఁగుపను లొనర్చుటచే నాతఁడు 'కపటనటనాపరుండనియు,' 'లీలామానుషశరీరుం' డనియు, భక్తాభీష్టప్రదాతయనియు, బ్రాహ్మణభక్తిపరాయణుండనియు స్ఫురించును.

శ్రీకృష్ణుఁడు రసికజనశిఖామణి. శృంగారవిలాసవినోదవిచక్షణుఁడు. 'సత్యభామావిధేయుఁడు.' మహావీరుఁడు; అట్లయ్యు కృపార్ద్రచిత్తుఁడు. మాయాకల్పనాచతురుఁడు. బ్రాహ్మణభక్తిపరాయణుఁడు. క్రీడాప్రియుఁడు. గురుజనభక్తి కలవాఁడు. గడుసరి. విశేషించి, కాంతల కనుసన్నల మెలఁగువాఁడు.

శ్రీకృష్ణుఁడు, సత్యభామ, నారదుఁడు ఈ కావ్యమున ప్రధానపాత్రలు. వీరుకాక ఇఁక ఇందలి పాత్రలు రుక్మిణి, ఇంద్రుఁడు.

—: ఇంద్రుఁడు :—

ఇందు ఇంద్రుఁడు కేవలము ఉత్తరకుమారునివలెఁ

జిత్రింపఁబడినాఁడు. సత్యభామావిధేయుఁడు పారిజాతాపహరణము చేయుటను వనపాలకులు పులోమజాస్వామియైన ఇంద్రునకుఁ జెప్పిరి. అప్పుడు ఇంద్రుఁడు అనిన మాటలు:

ఏమేమీ కృష్ణుఁడు మందలోబలెనె తా నింద్రద్రుమోత్పాటనం
బీమై నిచ్చటఁజూపవచ్చె నిదిమేలే తార్క్ష్యుఁడైన న్మదీ
యామోఘాశనిపాత మిట్టిదని యూహా! తెల్పఁడాయెంజుమీ!

పారిజాతమును ఇంద్రద్రుమమని గర్వముగాఁ జెప్పికొనెను. మందలోఁజేసినట్లు కృష్ణుఁడు చేయుచున్నాఁడని ఈసడించెను. గరుత్మంతుని ఈఁకనుమాత్రము చెండిన తన వజ్రాయుధము సంగతి గొప్పగాఁ జెప్పికొనెను. 'కన్నులువేయును జేవుటింప' కదనమునకుఁ బోయెను. తన అస్త్రమును దేవకీనందనుఁడు గైకొనఁగా ఇంద్రుఁడు ఐదుపదిచేసినాఁడు.

—: రుక్మిణి :—

ఇఁక రుక్మిణి పాత్రపోషణవిషయము:

శ్రీకృష్ణునకు సమతాభిమానవతులయిన మహిషు లెనమంద్రు. వారిలో రుక్మిణిని, సత్యను హరి మిగుల మన్నించి హెచ్చుచనవు లిచ్చెను. కాఁగా వారిరువురకు కులరూపములకుఁ దోడు మగని కూరిమికూడఁ గలదను అభిమానముతో రవరవలు పుట్టినవి.

ఐనను రుక్మిణి పెద్ద, మహిమాన్విత కావున గంభీరముగ నుండినది. పారిజాతకుసుమధారణప్రభావమున

చక్కఁదనమున కొక వింత చక్కఁదనము
జవ్వనంబున కొకవింత జవ్వనంబు
విభ్రమంబున కొకవింత విభ్రమంబు

కలిగినను ఆమె తన గాంభీర్యమును విడనాడి ఒకమాట యైన ఆడలేదు.

తన సదనమునకు నారదుఁడు వచ్చిన అతనిని పూజించుచు, నారదునివలన నందికొని శ్రీకృష్ణుఁడు తనకిచ్చిన పారిజాతకుసుమము నెఱిగొప్పునఁ దాల్చి వెలుఁగొందుచు, 'సతులు పదాఱువేవురును సంగడిరా కమలరాగమణీశిబికాధిరూఢయై' పుణ్యకవ్రతసందర్భమున సత్యభామసదనమునకుఁ బోవుచు మాత్రమే రుక్మిణి పాతకులకుఁ బొడగట్టును. ఆమె నోటిమాట లేవియుఁ దిమ్మన మనకు వినిపించలేదు. పట్టపుదేవికి సముచితమగు స్తవనీయ గాంభీర్యముతో, ఔదార్యముతో ఆమె మసలినది.

తన పెరటిలో పారిజాతమును నాటించుకొని పుణ్యకవ్రతమును చేయు సత్యభామసదనమునకును ఆమె పోయి తన యౌదార్యమును జూపినది.

అగుఁగాక! ఆమె స్త్రీ. స్త్రీజనస్వభావసిద్ధమగు అసూయ ఆమె కుండుట సహజము. కావుననే ఆమె సత్యభామసదనమునకు 'వదనాంబుజంబునం గృతకవికాస మచ్చుపడ' వచ్చినదని తిమ్మనార్యుఁడు చెప్పుచున్నాఁడు.

ఇట్టి సందర్భోచితపాత్రసంపోషణ మసదృశముగా నొనర్చి ఆంధ్రప్రబంధకవులకు ముక్కు తిమ్మనార్యుఁడు పూజ్యలింగమైనాఁడు.

# మనవి మాటలు

ఆంధ్రసారస్వతము, సారస్వతపట్టభద్రులగు ఆంధ్రకవులు, 'ఆంధ్రకవిప్రణీతకృతిసారకథాసుధారససంపన్మాధురీవిశేషములు'- వీనిని గుఱించి ఈగ్రంథకర్త వ్రాసిన వ్యాసములలో ఇంతకుఁబూర్వము పత్రికలలోఁ బ్రచురితములైన పదివ్యాసములను మాత్రము ఈగ్రంథమున సంధానితములైనవి.

ఈవ్యాసములు ఈగ్రంథకర్త కళాశాలవిద్యార్థిగా నుండఁగా అనఁగా నిప్పటికిఁ బాతికేండ్లకుఁ బూర్వము రచితములైనవి. సమయవిలాసి సన్మానమున అవి నేటికి గ్రంథరూపము నందఁగల్గినవి.

ఈ పదివ్యాసములలో మొదటిది (1923), రెండవది (1927), మూడవది (1924), నాలుగవది (1925) ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలలోను; ఐదవది (1941), ఆఱవది (1924) భారతిమాసపత్రిక సంచికలలోను; ఏడవది (1925) సమదర్శిని సంవత్సరాదిసంచికలోను; ఎనిమిదవది (1926) లలిత మాసపత్రికసంచికలోను; తొమ్మిదవది (1926) ఆంధ్రసర్వస్వము మాసపత్రికసంచికలోను; పదియవది (1924] భారతి మాసపత్రిక తొలిసంచికలోను ప్రచురితములైనని.

ఈ పదివ్యాసములలో మొదటిదగు 'ప్రాచీనాంధ్రవాఙ్మయావలోకనము'ను ఆ యేటి ఉగాదిసంచికలోని చెప్పఁదగిన వ్యాసములలో నొకటిగ సంపాదకులు దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు

తమ ప్రస్తావనలో ప్రత్యేకముగ చేర్కొనినారు. ఆ సంచికను అప్పుడు సారస్వతసంపాదకులుగా నుండిన అధికతకావ్యతీర్థాది బిరుదులు శ్రీపంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ఈవ్యాసమును ఎక్కువగా మెచ్చుకొనుచు ప్రత్యేకము ఒక పెద్ద జాబు వ్రాసియున్నారు. 'తెనుగు కైతల క్రొత్తతెన్నులు' కళాశాలలో పోటీవ్యాసములందు ప్రథమబహుమానము నందినది. 'ఆంధ్రవాఙ్మయావలోకనము'నుండి, 'తిక్కనవంశకథ'నుండి కొన్ని పంక్తులు ఎత్తి కవిత్వవేది 1927లో ప్రచురించిన ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహమున ఉదాహరించియున్నాడు. 'పారిజాతాపహరణము : పాత్రపోషణము'. ఆంధ్రమాసపత్రికారాజమగు భారతి తొలిసంచికకు కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారి ప్రత్యేకాహ్వానముపై పంపబడి ప్రచురింపబడినది. ఈ వ్యాసమును చేకొన్న ఆ సంచిక ప్రతులు కాకినాడ కాంగ్రెస్‌లో కరపత్రములవలె ధారాళముగ బంచిపెట్టబడి ఈగ్రంథకర్తకు బుధజనులలో, బంధుజనులలో ఒక్కపెట్టున పేరు తెచ్చినవి.

ఈ వ్యాసములపట్ల నడచిన ఈ సంఘటనములు చిన్నవి, సన్ననివి. అగుగాక! రచనములు తొలిరచనము లగుట, కాలము అవినయనిధానమగు యౌవనమగుట అవి గ్రంథకర్తకు ఆనాడు గర్వకారణములై అతడు సారస్వత జీవనపథప్రవేశకుడగుటకు ముల్లుచూపినవి.

Golden Press, 2/50 Tana Street, Madras—7.